# అనగనగా ఓ ప్రశ్న





తెలుగు కోరా రచయితల వ్యాస సంకలనం

# అనగనగా ఓ ప్రశ్న

కోరాలోని విజ్ఞానం కొంతైనా అందరికీ చేర్చాలనే సదుద్దేశ్యంతో ఆయా రచయితల అనుమతితో ఈ చిన్ని పుస్తకాన్ని మీ ముందుకు తెస్తున్నాము. ఈ పుస్తకంలోని కంటెంట్ కాపీరైట్ హక్కులు ఆ రచయితలకు చెందుతాయి.

**కవర్ పేజీ**

సరసి

**ధర**

అమూల్యం

**కూర్పు**

అజహర్, అలోక్ నంద ప్రసాద్, అప్పారావు ముప్పాళ్ల, కిషోర్ శీమల, లలిత నిగేష్, ప్రసాదరాజు, ప్రత్యూష, పుష్యమి, వాత్సల్య గుడిమళ్ళ.

# అంకితం

ఒక మదిలో పుట్టిన ప్రశ్న ఆ మదిని వికసింపజేయవచ్చు. పదిమందిని జాగృతం చేయనూ వచ్చు. నమ్మకాన్ని కదిలించి, ఆశ్చర్యాన్ని కలిగించి, ఆలోచనను ప్రేరేపించి, ఆచరణకై ప్రోత్సహించిన ప్రశ్నలు ప్రపంచ చరిత్రనే మలుపు తిప్పాయి అంటే అతిశయోక్తి కాదేమో ! తెలిసింది పంచుకోవాలి అనే ప్రేరణ కలిగించే ప్రశ్నలు వేసిన వారికి, ఆ ప్రశ్నలు సరైన వారికి చేరేలా చేసిన వారికి, వాటికి తెలుగులో నిండైన సమాధానాలు ఇచ్చిన రచయితలకు, ఆయా సమాధానాలు మీ ముందుకు తేవడానికి మద్దతుగా నిలిచిన అందరికీ మా ఈ పుస్తకం అంకితం.

# ధన్యవాదాలు

పెద్దమనసుతో ముందు మాట వ్రాసిన రావు గారికి, ముఖచిత్రం గీసిన సరసి గారికి, తమ సమాధానాలని ప్రచురించడానికి అనుమతించినవారికి, ఇంకా కష్టపడ్డ మా అందరికీను.

# మా మాట

ఏదైనా విషయాన్ని తెలుసుకోవాలనే జిజ్ఞాసతో వేసిన ప్రశ్నలకి ఎందరో పెద్ద మనసున్న వాళ్ళు ఆయా రంగాలలో అనుభవంతో లేదా పుస్తకాలని తిరగేసి జవాబులు చెప్పే ఒక వెబ్ వేదిక కోరా(Quora). మొదట ఇది ఇంగ్లీషు భాషకే పరిమితమైనా 2019లో తెలుగులోనూ అందుబాటులోకి వచ్చింది.

అంతర్జాలంలో వెతికితే దొరికే సమాచారం కోరాలో ఎందుకు చూడాలి?
అంతర్జాలంలో వెతకాలంటే ముందు మనకు ఏమి కావాలో స్పష్టంగా తెలియాలి. అలా తెలిసి వెతికినా కావలసిన సమాచారమంతా తెలిసిన భాషలో ఒకే చోట అర్థవంతంగా గుది గుచ్చి ఉండదు. అయితే, కోరా సమాధానాల్లో కావలసిన సమాచారమంతా లోతైన విశ్లేషణతో, అర్థం చేసుకోవడానికి అనువుగా ఉండే ఉపమానాలతో మన తెలుగులో లభిస్తుంది.

ఎన్నెన్నో సామాజిక మాధ్యమాలు ఉవ్వెత్తున ఎగసి, పడి సమసిపోయాయి. తెలుగు కోరా కూడా అలా అయితే ఎలా అన్న ముందుచూపుతో ఆ రత్నగర్భలోని అమూల్యమైన సమాచారాన్ని పరిరక్షించడానికి లాభాపేక్ష లేకుండా చేస్తున్న ఒక చిరు ప్రయత్నం ఇది.

మా మొదటి ప్రయత్నంలో పుస్తకాలు, సినిమాలు, సైన్స్, తెలుగు భాష, ఆర్థికం అని షడ్రుచుల్లా ఆరు విభాగాలున్నాయి. ఈ ఐదింటికీ తోడు గిలిగింతలు పెట్టే హాస్యం కూడా చేర్చాము. ఒక్కో విభాగం మీద నొక్కి చూస్తే అందులో ఉన్న సమాధానాలు కనిపిస్తాయి.

పిల్లల్ని చూసుకుంటూ, పీహెచ్డీకి శ్రమపడుతూ, ఖండాలు మారుతూ, ఉద్యోగ బాధ్యతలతో ఉరుకులు పెడుతూ... ఇలా ఒకొక్కళ్ళం వ్యక్తిగత జీవితాల్లో తీరిక లేకుండా ఉన్నా కానీ పుస్తకాన్ని ఒక రూపుకు తీసుకురావడానికి ఇష్టంగా కష్టపడి 'అనగనగా ఓ ప్రశ్న' అనే ఈ-పుస్తకాన్ని మీ ముందుకి తెచ్చాము.

# సూచిక

# పరిచయ వాక్యాలు

ఈ పుస్తకానికి పరిచయ వాక్యాలు రాయమని నన్ను అడిగేరు. కనుక ఇవి కేవలం పరిచయ వాక్యాలు మాత్రమే; సమీక్ష కాదు.

ఇది అసాధారణం, అపూర్వం  అయిన పుస్తకం. ఎందుకంటే ఇది ఒక రచయిత రాసినది కాదు; ఒక బృందం తయారుచేసినది. ఆ బృందం కూడా భౌగోళికంగా ఒక చోట కానీ, ఒక వ్యవస్థలో కాని పని చేస్తూన్నవారు కాదు. నాలుగు మూలలా చెల్లాచెదరుగా ఉన్న వ్యక్తులు,  అంతర్జాలం కలుగజేసిన వెసులుబాటుని ఆసరాగా చేసుకుని, నలుగురూ కూడబలుక్కుని తయారు చేసిన గ్రంథం ఇది. గడ్డిపరకలు సహితం వెంటిగానేర్పడి మదపుటేనుగును బంధించుట లేదా! అలాగే సంఘీభావంతో చేస్తే ఎటువంటి పనిని అయినా చెయ్యవచ్చని నిరూపిస్తుంది ఈ పుస్తకం.

తెలుగుకోరాలోని రచయితలు కొందరు అందులో ఉన్న మంచి మచ్చు తునుకలని సేకరించి, ఒక పుస్తకరూపంలో ప్రచురించడానికి సాహసించినందుకు వారిని మెచ్చుకోవాలి.

ఇంతకీ ఏమిటి ఈ తెలుగు కోరా? కోరా అనేది ప్రశ్నలు, వాటికి సమాధానాలు ఉండే జాలస్థలి. ఇది ఎన్నో భాషలలో ఉంది; తెలుగులో ఉన్న దానిని "తెలుగు కోరా" అంటారు. ఇక్కడ ఎవ్వరైనా ప్రశ్నలు అడగవచ్చు, వాటికి ఎవ్వరైనా సమాధానాలు రాయవచ్చు. ఇటువంటి వెసులుబాటు ఉన్నప్పుడు ఈ జాలస్థలిని ఉపయోగించి జ్ఞాన సంపదని పంచుకోవచ్చు కనుక కొత్త విషయాలు నేర్చుకుందుకి ఇది ఎంతో ఉపయోగ పడుతుంది. ఇక్కడ కనిపించే ప్రశ్నలు, జవాబులు చదివి నేను ఎన్నో కొత్త విషయాలు నేర్చుకుంటున్నాను.

ఒక నిర్దిష్టమైన కాల పరిమితిలో తెలుగు కోరాలో ప్రచురణ పొందిన సమాచారం అంతటికి చటుక్కున ఒక ఛాయాచిత్రం తీసేమంటే ఆ ఛాయాచిత్రం ఆ కాలంలో ఉన్న మన జ్ఞాన సంపదకి ఒక నిక్షేపం అన్న మాట! ఈ నిక్షేపంలో రాళ్ళూ, రత్నాలూ కూడా ఉండవచ్చు. ఇలా కలగాపులగంలా ఉన్న నిక్షేపం నుండి ఈ సంపాదక వర్గం - వారి శక్తియుక్తుల పరిమితికి - కొన్ని రత్నాలని ఏరి మనకి ఈ పుస్తకరూపంలో ఇచ్చేరు. సహజంగా ఈ ఎంపిక ఈ వర్గం అభిరుచులని ప్రతిబింబిస్తుంది. గ్రంథ విస్తరణ భీతి వల్ల మంచివని ఎంపిక అయిన వ్యాసాలు అన్నీ ఈ సంపుటంలో ఇమిడి ఉండకపోవచ్చు. కనుక ఈ పుస్తకంలో కనిపించే అంశాలు తెలుగు కోరా నిజ స్వరూపానికి ఒక ప్రక్షేపం మాత్రమే!

స్థూలంగా ఈ పుస్తకంలో ఆరు వర్గాలు ఉన్నాయి: (1) పుస్తకాలు, సాహిత్యం, (2) సినిమాలు, (3) హాస్యం, (4) తెలుగు, (5) ఆర్థికం, (6) సైన్సు. వీటిల్లో మొదటి నాలుగు వర్గాలూ ఎక్కువ మంది పాఠకులని ఆకర్షించవచ్చు కానీ నిజానికి ఎక్కువ మందికి ఉపయోగపడేవి చివరి రెండు వర్గాలూ అని నా అభిప్రాయం.

ఇది హర్షించదగ్గ ప్రయత్నం. ఈ పుస్తకాన్ని పాఠకులు చదివి ఆనందిస్తారనే నా నమ్మకం.

వేమూరి వేంకటేశ్వరరావు

ప్లెజంటన్, కేలిఫోర్నియా

అక్టోబర్ 2023

# పుస్తకాలు, సాహిత్యం

## తెలుగు వ్యాకరణం గురించి, తెలుగులో వ్రాయడం గురించి తెలిపే పుస్తకాలు ఏమైనా ఉన్నాయా? ఉంటే అవేమిటి?

తెలుగు వ్యాకరణం, తెలుగులో వ్రాయడం రెండూ వేర్వేరు అంశాలు. ఆ రెండు అంశాలకు సంబంధించి కూడా పలు పుస్తకాలు ఉన్నాయి. తెలుగులో బాగా ఎలా వ్రాయాలి అన్నదాని కోసం అయితే వ్యాకరణం, భాషా శాస్త్రం తెలుసుకుని తీరాల్సిన అవసరం లేదు.

ముందుగా వ్యాకరణం గురించే చూద్దాం. కాకపోతే మరోసారి చెప్తున్నాను, భాష వ్రాయ దలచినవారికి వ్యాకరణ జ్ఞానం కన్నా ప్రయోగ జ్ఞానం ముఖ్యం. ఇవి చదవడం వ్యాకరణ జ్ఞానం కోసమో, పట్టా కోసమో, తెలుగు భాషా చరిత్రపై ఆసక్తితోనో అయితే సరే కానీ, చదవక పోతే తెలుగు వ్రాయడం రాదనో, చదివితే తెలుగు రాయడం బ్రహ్మాండంగా వస్తుందనో అనుకోకండి.

తెలుగు వ్యాకరణానికి సంబంధించి పలువురి నోట పడి నలిగిన పుస్తకం చిన్నయసూరిగారి **బాలవ్యాకరణం**. దీనికి పలు వ్యాఖ్యానాలు ఉన్నాయి. దువ్వూరి వేంకటరమణ శాస్త్రిగారి రమణీయం వంటివి ఇందులో భాగం. ఈ బాలవ్యాకరణంలో చెప్పకుండా విడిచి పెట్టేసిన విషయాలను పూరించే ఉద్దేశంతో బహుజనపల్లి సీతారామాచార్యులుగారు **ప్రౌఢవ్యాకరణం** వ్రాసారు. మళ్లీ దీనికీ అంబటిపూడి నాగభూషణంగారి దిగ్దర్శినీ మొదలైన వ్యాఖ్యలు ఉన్నాయి. పాఠ్యాంశాలుగా వ్యాకరణాన్ని విశ్వవిద్యాలయ పరీక్షలకు, పోటీ పరీక్షలకు చెప్పాలి కాబట్టి మార్కెట్లో తెలుగు వ్యాకరణం అన్న పేరుతో పలు పుస్తకాలు దొరుకుతున్నాయి. ఇదంతా విషయం విషయంగా తెలుసుకున్నదే తప్పించి ఈ వ్యాకరణమనే నదిలోకి దిగి ఈతలు కొట్టి చెప్తున్నది కాదు.

***

ఇక భాషాశాస్త్రంలో చెప్పుకోవాల్సినది, తెలుగు భాషపై అవగాహన పెంచుకోదగినవారు చదవాల్సినదీ చేకూరి రామారావుగారి **తెలుగు వాక్యం**.

> *వ్యాకరణం అంటే వ్యవహర్తలను ఇట్లా మాట్లాడమని గాని, రచయితలను ఇట్లా రాయమని గాని శాసించే లిఖిత సూత్రాల పుస్తకం అనే అర్థంలో వాడటం లేదు. భాషా వ్యవహారంలో వ్యవహర్తలు పాటించే నియమావళి అనే అర్థంలో వాడుతున్నాను. ఈ నియమాలు వ్యవహర్తల మనస్సులో అజ్ఞానంగా ఉంటాయి. వాటిని జాగ్రత్తగా గ్రహించి వ్యక్తరూపం ఇయ్యటమే భాషాపరిశోధకులు చేసే పని.*

అంటూ ముందుమాటలో తన పంథా తేల్చి చెప్పిన చేకూరి రామారావుగారు ఆ ప్రకారమే తెలుగు వాక్యమనే మహా సముద్రపు తీరుతెన్నులను, దాని వెనుక శాస్త్రీయతను నిగ్గు తేల్చారు. అంతే కాకుండా భవిష్యత్ పరిశోధకులు ఏ త్రోవన పోతే భాషాశాస్త్రానికి ప్రయోజనకరమో తెలియజేసారు.

ఇంతకుముందు వాటిలా కాక ఈ పుస్తకం చదవడం మాత్రం భాషపై పట్టు సాధించాలనుకున్నవారికి ఉపయోగపడుతుంది. అంటే ఇలా వ్రాయండి అని చెప్పదు. భాష తీరుతెన్ను ఇదీ అని చెప్తుంది. ఇది తెలుగు వాక్యమనే మహా సంస్థకు నమస్కరించి, వినయంగా దాని తీరును గ్రహించడం కాబట్టి నిస్సంశయంగా చాలా చాలా ప్రయోజనకరమే! "తప్పక చదవవలసినదా?" అని రెట్టిస్తే మాత్రం బలహీన స్వరంతో కాదు అనవలసి వస్తోంది.

ఆసక్తి ఉన్నవారు ఈ 'తెలుగు వాక్యం'తో ప్రారంభించి ఆయనవే అయిన పలు గ్రంథాలూ, ఆయన గురువు, ఆధునిక తెలుగు భాషాశాస్త్ర యుగకర్త ఐన ఆచార్య భద్రిరాజు కృష్ణమూర్తి గారి రచనలు, వగైరాలు తవ్వుకుంటూ పోవచ్చు.

***

స్పష్టంగా ప్రయోజనకరమనీ, చదివి చూడమనీ చెప్పగలిగినవి భాషా శైలికి సంబంధించిన పుస్తకాలు. ఈ పరంగా ఎక్కువ కృషి చేసినది ఈనాడు పత్రిక అవసరార్థం, వారి ఆర్థికదన్నుతో పనిచేసిన బూదరాజు రాధాకృష్ణగారు. ఆయన వ్రాసిన **ఈనాడు భాషా స్వరూపం** చదవవలసినది.

కావడానికి తెలుగు వచన రచనలనే మహా వృక్షంలో పత్రికా రంగం అన్న కొమ్మకు, అందులో ఈనాడు అనే రెమ్మకు పరిమితమేనని పేరును బట్టే తెలుస్తున్నా ఈ పుస్తకం గొప్ప ప్రయోజనకారి అనడానికి మూడు కారణాలు ఉన్నాయి:

1. ఇలాంటి శైలీ పరమైన ప్రయత్నాలు ప్రామాణిక పద్ధతిలో ఎక్కువ జరగకపోవడం
2. వ్రాసినవారు బూదరాజ రాధాకృష్ణ గారూ, వ్రాసింది, తెలుగు పత్రికా చరిత్రలో చెప్పుకోదగ్గ, ఈనాడు వంటి సంస్థలోని భాషా స్వరూపం వివరిస్తూ కావడం
3. అన్నిటికన్నా ముఖ్యమైన కారణం, అసలంటూ ఏదోక ప్రామాణిక శైలీ రచన చదివితే, మనకు ఇతర రచనా శైలులను అర్థం చేసుకుని మన రచనను మలుచుకునే ప్రజ్ఞ అలవడుతుంది.

ఐతే, అలాంటి ప్రజ్ఞ కావాలంటే ఇది భాషా శైలి అనే మహా వృక్షంలో చిన్న కొమ్మ మాత్రమేననీ, ఈనాడు వంటి సంస్థలో శైలి నిర్దేశించే ఉద్యోగంలోని బూదరాజు గారికి భాషా శైలిని అర్థం చేసుకుని సమ్యక్ దృష్టితో ప్రజంట్ చేయడం కన్నా, ఇదిగో ఇది తప్పు, ఇది ఒప్పు అని నిర్దేశించడం ముఖ్యమనీ గుర్తించి చదవాలి.

ఇదే కాక బూదరాజ వారివే అనువాద పాఠాలు, భాష-శైలి నియమావళి వంటి పుస్తకాలూ ఈయన వ్రాసారు. దొరికితే చదవదగ్గవే. ఐతే, మరో మారు గుర్తు చేసేదేమంటే స్వయంగా తెలుగులో ఆధునిక భాషాశాస్త్ర ప్రవక్తగా పేరు తెచ్చుకున్న భద్రిరాజు కృష్ణమూర్తి గారి శిష్యుల్లో ఒకడే అయినా, తన ఉద్యోగ

లక్షణం వల్లనో ఏమో బూదరాజ గారి దృష్టి భాషను నియమించడం మీదే ఉంటుంది. కాబట్టే, వందల యేళ్ళుగా తెలుగు వాడుకలో ఉన్న పదాలను పట్టుకుని ఇది పారశీకం, ఇది ఆంగ్లం, ఇది సంస్కృతం అని చెప్తూ తెలుగులో తెలుగెంత అని ప్రశ్నించడమైనా, కొద్దిపాటి స్వేచ్ఛను మాత్రమే రచయితకు ఇస్తూ భాషను నియమించడమైనా ఎక్కువగా ఉంటుంది.

ఆ ధోరణి వదిలిపెట్టి విషయం మీద శ్రద్ధ పెడితే ఈయన పుస్తకాలు చాలా పనికి వస్తాయని నా భావన. ఈ ధోరణిలో అడపాదడపా ఇతర పుస్తకాలూ వచ్చాయి కానీ, ఇప్పటికీ భాషా శైలికి సంబంధించిన కాడి బూదరాజగారు ఎక్కడ వదిలేసారో అక్కడే ఉంది.

***

చివరగా అసలు విషయం -
తెలుగులో ఎలా వ్రాయాలో తెలియాలంటే తెలుగు రచనలు చదవడాన్ని మించిన మార్గం లేదు. జనం మాటలు పట్టుకోవాలంటే జనం మాట్లాడగా వినడాన్ని మించిన దారి లేదు. కాబట్టి, ఆ రాచబాటను వదలకండి.

- **అమరావతి కథలు**, పురాణం సుబ్రహ్మణ్యశర్మ (సీత) గారి **ఇల్లాలి ముచ్చట్లు**, ఆంధ్ర సచిత్ర వారపత్రిక వారి **తెలుగు వెలుగులు** వంటివి చదివితేనే తెలుగు వాక్యంలోని క్లుప్తత, ఆ క్లుప్తతలోని అందం తెలుస్తుంది.

- శ్రీపాద సుబ్రహ్మణ్యశాస్త్రి గారి **అనుభవాలూ, జ్ఞాపకాలూను** భాషను సాధించడానికి రచయిత చేసే ప్రయత్నమూ, అదే శ్రీపాద సుబ్రహ్మణ్యశాస్త్రిగారు వ్రాసిన కథలు చదివితే, పట్టుబడితే రచనలో ఎలా పరిపుష్టమవుతుందన్న విషయమూ తెలుస్తాయి.

- **చలం రచనలు**, గురజాడ వారి **కన్యాశుల్కం**, నామిని సుబ్రహ్మణ్యం నాయుడు గారి **పచ్చనాకు సాక్షిగా**, చెళ్ళపిళ్ళ వేంకటశాస్త్రి గారి **కథలూ-గాథలూ**, తిరుమల రామచంద్ర గారి **హంపీ నుంచి హరప్పా దాక**, దాశరథి రంగాచార్యుల వారి **జీవనయానం**, **చిల్లర దేవుళ్ళు**- ఇలా పలు రకాల గొప్ప రచనలు చదివేకొద్దీ, భాష విస్తృతి, దానిని రచయితలు ఎలా ప్రయోగించారు వంటివి తెలుస్తూ ఉంటాయి.

- నండూరి రామమోహన రావుగారు వ్రాసిన **విశ్వదర్శనం, నరావతారం, విశ్వరూపం** తెలుగును పాపులర్ శాస్త్ర రచనలు చేయడానికి ఎలా వాడారన్నవి గమనించడానికి తప్పక చదవాలి

- నండూరి రామమోహన రావు గారి **మార్క్ ట్వేన్ పుస్తకాల అనువాదాలు**, సహవాసి 'ద రూట్స్' అనువాదం **ఏడు తరాలు** వంటి అనువాద రచనలు కూడ ఆంగ్లానికి తెలుగుకు ఉన్న భేదం (ఇది తెలుసుకోవడం ఈనాటి ఆంగ్ల విద్యావంతులకు అత్యావశ్యకం), అది అనువదించడంలో ఉండాల్సిన ఒడుపును చెప్తాయి.

- సినిమాలను తక్కువగా అంచనా వేయకూడదు. **మాయాబజార్, మూగమనసులు, సంపూర్ణ రామాయణం, శంకరాభరణం, సీతారామయ్య గారి మనవరాలు, బొమ్మరిల్లు** వంటి సినిమాలను వాటి భాష కోసం చూడండి.
- తెలుగు వచన రచన ఎంత అద్భుతంగా ఉంటుందో తెలియాలంటే ఈ తరహాలోని గొప్ప పుస్తకాలన్నీ తనివి తీరా చదవండి, ఆ వ్రాసిన శైలిని కాపీ కొట్టండి ఫర్లేదు, మీదైన గొంతుక వెతికి పట్టుకోండి, మీ చుట్టూ మాటలు వినండి, ఇంకా ఇంకా చదవండి, ఇంకా ఇంకా వ్రాయండి. భాష మీకు పట్టుబడి తీరుతుంది.

పవన్ సంతోష్ సూరంపూడి<br>https://qr.ae/pykwvz

## బండి నారాయణస్వామి గారి నవల 'అర్ధనారి' చదివారా? ఆ నవల మీద మీ అభిప్రాయం ఏమిటి?

సోనాగచ్చి (కోల్‌కత్తా), బుధ్‌వార్‌పేట్ (పూణే), చతుర్భుజాస్థాన్ (ముజఫర్ పూర్), శివ్‌దాస్‌పూర్ (వారణాసి), ఇట్వారీ (నాగపూర్), కామాటిపురా (ముంబై), మీర్‌గంజ్ (ప్రయాగరాజ్), జీబీ రోడ్ (ఢిల్లీ)... మన భారతదేశంలోని ఈ ప్రాంతాలన్నిటికి ఒక సారూప్యత ఉంది. ఇప్పటికే చదువుతున్న మీకు ఆ సారూప్యత ఏమిటన్నది తెలిసిపోయి ఉంటుంది. ఈ ప్రాంతాలన్నీ పడుపువృత్తి (Prostitution) ప్రాంతాలుగా పేరొందాయి.

ఈ ప్రాంతాలన్నీ నగరానికి దూరంగా విసిరేసినట్టుగా ఉంటాయి. ఇక్కడ ఉండే మహిళలు స్వతహాగా వచ్చిన వాళ్ళు కారు. కుటుంబ పోషణకై, ఆర్థిక పరిస్థితుల వల్ల గత్యంతరం లేక, దుర్మార్గుల చేత బలవంతంగా ఇందులోకి లాగబడినవారు. కారణమేదైనా ఎందరో మహిళల జీవితాలు ఈ చీకటి కూపాల్లో మగ్గిపోతున్నాయి.

రైలు ప్రయాణాల్లో మీకు ఎక్కడో ఒక చోట రైల్లోనో, రైల్వే స్టేషన్ ప్లాట్‌ఫారం మీదనో హిజ్రాలు కనిపించే ఉంటారు. మనం కొన్నిసార్లు వారి నుంచి తప్పించుకుని వెళ్ళిపోతాం. కొన్నిసార్లు ఎంత ప్రయత్నించినా వారి నుంచి తప్పించుకోలేము. వాళ్ళు మనల్ని డబ్బులు అడిగిన వెంటనే ఇవ్వకపోతే దౌర్జన్యంగా తీసుకుంటారు. కొన్నిసార్లు వారి చర్యలు శ్రుతి మించిపోతాయి. మన నుంచి వారు డబ్బులు ఏ విధంగానైనా రాబడతారు. మనమూ వారు పెట్టే అల్లరి నుంచి తప్పించుకోవటానికి ఎంతో కొంత వారికి ముట్టజెప్పి అక్కడి నుంచి బయటపడతాము.

పడుపు వృత్తి చేపట్టిన ఒక మహిళ, హిజ్రాగా మారిన ఒక వ్యక్తి - వీళ్ళ జీవితమే ఈ 'అర్ధనారి' నవల.

**కథా నేపథ్యం:**

రామలక్ష్మి ఒక పేద కుటుంబంలో పుట్టిన అమ్మాయి. తనకు చిన్నతనంలోనే పెళ్ళి చేస్తారు. భర్త తనను మోసం చేస్తే, తన ముగ్గురు పిల్లల్ని తీసుకుని ఎలాగైనా బ్రతకాలనే సంకల్పంతో కళ్యాణదుర్గం (అనంతపురం జిల్లా, ఆంధ్రప్రదేశ్ రాష్ట్రం) వస్తుంది. అక్కడ తను అనుభవించిన కష్టాలు, పొందిన అవమానాలు, ఒంటరి మహిళకు కలిగే ఇబ్బందులెన్నిటినో ఎదుర్కొని నిలబడుతుంది.

ఇంకోపక్క పుట్టడం మగవానిగానే పుట్టిన చంద్రన్న తనను తాను ఆడదానిగా గుర్తిస్తాడు. చెబితే తనను అర్థం చేసుకోరేమోనన్న భయంతో ఈ విషయాన్ని ఇంట్లో వాళ్ళకి చెప్పడు. కొన్ని అనుకోని సంఘటనల వల్ల చంద్రన్న గురించిన నిజం ఇంట్లో వాళ్లకు తెలిసిపోతుంది. ఇంటి సభ్యుల నుంచి వ్యతిరేకత, అసహ్యం చూసిన చంద్రన్న ఇక ఇంటి నుంచి వెళ్ళిపోవడమే ఉత్తమమని నిర్ణయించుకుని ఒక రాత్రివేళ ఇంటి నుంచి పారిపోయి కళ్యాణదుర్గం చేరుకుంటాడు. కళ్యాణదుర్గం చేరిన రామలక్ష్మి, చంద్రన్న ఇద్దరూ వారి వారి జీవితాల్లో ఎలా ముందుకెళ్ళారో తెలుసుకోవాలంటే ఈ' అర్ధనారి' నవల చదవాలి.

**కథా సారాంశం:**

కళ్యాణదుర్గం వచ్చిన రామలక్ష్మి, చంద్రన్నలకు ఏవీ సులువుగా దక్కలేదు. కొన్నిటి కోసం పోరాడారు, కొన్నిటి కోసం కష్టాల్ని అనుభవించారు. అనూహ్య రీతిలో వారిద్దరూ ఎదురు పడతారు. ఇద్దరూ ఒకరి కష్టాల్ని ఒకరు అర్థం చేసుకుని తోడుగా ఉంటారు. కొద్ది రోజులు వారు ప్రశాంతంగా చిన్న చిన్న పనులు చేసుకుంటూ బ్రతుకుతారు. వారి జీవితం సజావుగా సాగుతున్న సమయంలో అనూహ్యంగా కష్టాలు ఎదురవుతాయి. అలా వారు ఎదుర్కొన్న కష్టాలు ఎవరి నుంచి వచ్చాయన్నదే 'అర్ధనారి' ముఖ్య కథ.

- కుటుంబం, సమాజం ఒక మనిషి జీవితాన్ని ఎన్ని విధాలుగా ప్రభావితం చేయగలవు?
- హిజ్రాలు, పడుపువృత్తి మహిళల పట్ల ప్రభుత్వమూ, ప్రభుత్వయంత్రాంగ తీరు ఏ విధంగా ఉంటుంది?
- చంద్రన్నని తన కుటుంబ సభ్యులు అంగీకరించారా? చివరికి చంద్రన్న ఎవరికీ భయపడకుండా బ్రతకగలిగాడా?
- రామలక్ష్మి జీవితం బాగుపడిందా? తన పిల్లలకు మంచి భవిష్యత్తు అందించగలిగిందా?

ఈ ప్రశ్నలన్నిటికీ సమాధానాలు తెలుసుకోవాలంటే మీరు 'అర్ధనారి' పుస్తకము చదవాల్సిందే.

ముంబై లోకల్ ట్రైన్లలో హిజ్రాలు యాచకం చేస్తున్నప్పుడు ఎవ్వరినీ ఇబ్బంది పెట్టరు. ఎవరైనా ఇస్తే తీసుకుంటారు లేదంటే వెళ్ళిపోతారు. దౌర్జన్యం చేయరు, దబాయించరు., అదే మన ఆంధ్రాలో హిజ్రాలు దౌర్జన్యంగా డబ్బులు వసూలు చేస్తారు. ఇవ్వకపోతే నానా రభస చేసి డబ్బులు ఇచ్చే దాకా వదిలిపెట్టరు.

ప్రాంతాన్ని బట్టి హిజ్రాల  ప్రవర్తనలో మార్పు ఎందుకన్న ప్రశ్నకు సమాధానం 'అక్కడి హిజ్రాలని వాళ్ళు మనకన్నా ఎక్కువగానే అర్థం చేసుకున్నారు. ముంబైలో కొంత మంది హిజ్రాలు యాచక వృత్తితో పాటు ఏవైనా చిన్నచిన్న పనులు చేస్తుంటారు, వారికి అక్కడ వివక్ష మన వైపు ఉన్నంత లేదు' అని ఈ పుస్తకం చదివాకా అర్థమయ్యింది.

బహుశా హిజ్రాలు యాచక వృత్తి వైపు మళ్ళటానికి మన సమాజమూ ఒక కారణమే. వారిని అర్థం చేసుకోవటంలో మనం విఫలమయ్యామనే చెప్పాలి. అందరి హిజ్రాలకు ఆదరణ దక్కకపోవచ్చు. పుస్తకంలో చెప్పినట్టు కుటుంబం నుంచీ, సమాజం నుంచీ వారికి తోడ్పాటు లభించాలి. లేకపోతే వారు యాచక వృత్తి వైపు వెళ్ళిపోతారు. చంద్రన్న, రామలక్ష్మి ఇద్దరూ వారి వారి జీవితాల్లో అన్ని కష్టాల్ని అనుభవిస్తుంటే చదువుతున్నంతసేపు మనకు భయం, బాధ రెండూ కలుగుతాయి. పుస్తకం చదువుతున్నంతసేపూ మనకు రామలక్ష్మి లాంటి ఎంతో మంది మహిళలు, చంద్రన్న లాంటి వాళ్ళు తమ జీవితాల్లో ఈ విధంగానే కష్టాల్ని అనుభవిస్తూ ఉండుంటారు కదా అని అనిపించక మానదు.

**రచనా శైలి:**

నవల ఆసాంతం రాయలసీమ ప్రాంతంలో జరుగుతున్న కారణాన పాత్రలన్నీ సీమ మాండలికంలోనే మాట్లాడతాయి.

మామూలుగా మన తెలుగు రచయితల్లో కథను మెల్లిగా చెబుతూ ఏదైనా బలమైన విషయాన్ని పుస్తకం మధ్యలోనో లేక చివరిదాకా వచ్చాకో చెప్పటం సహజం. కానీ ఈ పుస్తకం చదవటం మొదలుపెట్టిన పది పేజీల్లోనే చంద్రన్న పాత్రని పరిచయం చేసిన తీరు చూసి ఆశ్చర్యం వేస్తుంది. తర్వాత ఎలా ఉండబోతుందో అని అప్పుడే అర్థమైపోతుంది.

ఒకదాని తర్వాత ఒక సంఘటన రచయిత వర్ణిస్తుంటే పాఠకులకు తెలుగులో ఇటువంటి ఒక కథని ఎవ్వరూ చెప్పలేదనిపిస్తుంది. చంద్రన్న, రామలక్ష్మి పాత్రలని రచయిత మలచిన తీరు, ఎక్కడా కథ నుంచి పక్కకు వెళ్ళకుండా, కథకు అనవసర హంగులు అద్దకుండా వ్రాసిన తీరును అభినందించక తప్పదు. తెలుగు సాహిత్యంలో ఇటువంటి రచన రాలేదని కచ్చితంగా చెప్పవచ్చు. అసలు ఇటువంటి ఒక కథావస్తువును ఎన్నుకోవటమే సాహసమని చెప్పాలి.

నారాయణస్వామిగారు ఈ పుస్తకంలో హిజ్రాలను, పడుపువృత్తి చేసే మహిళలను ఎక్కడా గొప్ప స్థాయిలో చూపించలేదు. కేవలం వారి జీవన విధానం మాత్రమే మన ముందుంచారు.అంతటి దుర్భర స్థితికి రావటానికి గల కారణాలను మాత్రమే చర్చించారు.

తెలుగు భాషలో ఇదివరకు ఈ కోవకి చెందిన రచనలు వచ్చినా, ఇంత లోతుగా ఒక పరిశోధనాత్మక స్థాయిలో హిజ్రాల జీవన విధానాన్ని, పడుపు వృత్తిలోకి రాబడిన మహిళల కష్టాల్ని వివరించటం ఈ నవలలోనే జరిగింది. రచయిత ఎంచుకున్న అంశంలో కొద్దిగా అశ్లీలతకి ఆస్కారం ఉన్నా ఎక్కడా పాఠకులకు ఆ ఆలోచన రాకుండా వ్రాయడం వారి రచనా కౌశల్యానికి నిదర్శనం.

అజహర్

https://qr.ae/pygfOE

## సన్నపురెడ్డి వెంకటరామిరెడ్డి గారి నవల 'ఒంటరి' చదివారా? ఆ నవల మీద మీ అభిప్రాయం ఏమిటి?

21వ శతాబ్దంలో ఒక సగటు మనిషి ఇంకో మనిషితో మాట్లాడటం తక్కువైపోయింది. ప్రకృతిని ఆస్వాదించటం, దానితో కలిసి జీవించటం దాదాపుగా కనుమరుగయింది. ఎప్పుడో పండగలు, సెలవు రోజులలో తప్ప ప్రకృతి గురించి, పక్కనే ఉన్న మనిషి గురించి ఆలోచించే సమయం, ఓపిక రెండూ ఇప్పటి మనుషుల్లో తక్కువయ్యాయి. ఇప్పటి తరం మనుషుల్ని తప్పుపట్టడం కాదు కానీ, వారి జీవన విధానమే వారి ఈ ప్రవర్తనకు కారణం.

అభివృద్ధి, పారిశ్రామికీకరణ, ప్రపంచీకరణ ఇలా కారణాలు ఏవైనా అందరూ వారి వారి జీవితాల్లో వేగాన్ని అందుకున్నారు. ఆ వేగానికి తగ్గట్టే వారి జీవన విధానాల్లో మార్పులు చేసుకున్నారు. అలా వచ్చిన మార్పుల వలన సగటు మనిషి తన జీవితంలో శారీరకంగా, మానసికంగా, మానవ సంబంధ బాంధవ్యాలు, ఇలా ఎన్నో రకాలుగా కోల్పోవాల్సివస్తుంది. అలా తన జీవితంలో ఆరోగ్యాన్ని, మానసిక ఆనందాన్ని పోగొట్టుకున్న ఒక వైద్యుడి కథే ఈ 'ఒంటరి' నవల.

**కథా నేపథ్యం:**
డాక్టర్ రాఘవ తన వృత్తిలో ఎంతో ఎత్తుకు ఎదిగిన మనిషి. కానీ తన సొంత ఆరోగ్యం విషయంలో అలసత్వం చూపటం వల్ల తీవ్ర అనారోగ్యానికి గురవుతాడు. తన స్థితిని మెరుగు పరుచుకోవడానికి దేశంలోని ఎన్నో ప్రాంతాలకు వెళ్ళినా ఫలితం లభించదు. చివరికి మహారాష్ట్రలోని ఒక ఆశ్రమ గురువు తన ఆరోగ్య పరిస్థితి మెరుగుపడాలంటే అరికెలతో (Kodo Millets) చేసిన ఆహారం తీసుకుంటే నయమయ్యే సూచనలున్నాయని ఉపదేశిస్తాడు.

అలా గురువు గారి సూచన మేరకు అరికెల వేటను ప్రారంభిస్తాడు డాక్టర్ రాఘవ. దేశంలో ఎన్నో ప్రాంతాల్ని తిరిగి అరికెలు దొరక్క, చివరి ప్రయత్నంగా రాయలసీమ ప్రాంతంలో అరికెలు ఉండే అవకాశం ఉందని తెలుసుకుని ఆ ప్రాంతానికి తన ప్రయాణాన్ని కొనసాగిస్తాడు. ఆ విధంగా రాయలసీమలోని ఒక పల్లెటూరికి వచ్చిన డాక్టర్ రాఘవ నరసయ్య అనే రైతు దగ్గర అరికెల పంటకు తగిన విత్తనాలున్నాయని తెలుసుకుని నరసయ్యతో కలిసి ఆ పంట వేస్తాడు. అసలు అరికెల కోసం తను పడ్డ కష్టం, చేసిన ప్రయాణం వల్ల రాఘవకు ఏం లభించిందో, పంట చేతికి వచ్చే కాలంలో తాను పడ్డ కష్టాలు, నేర్చుకున్న పాఠాలు, పొందిన అనుభవాలు, కలిసిన మనుషుల సమాహారమే ఈ 'ఒంటరి' నవల.

**కథా సారాంశం:**
నరసయ్య భార్య ఓబులమ్మ. వారికి నరసింహ, రాములమ్మ ఇద్దరు సంతానం. నరసింహ తల్లిదండ్రులను విడిచి టౌన్ లో వేరుగా ఉంటాడు. రాములమ్మ భర్తతో విభేదాల కారణాన తల్లిదండ్రుల దగ్గరే ఉంటుంది. నరసయ్య తల్లి ముసలమ్మ వీరితోనే ఉంటుంది.

నరసయ్యని అరికెల పంట వెయ్యటానికి ఒప్పించినప్పటికీ ఆ పంట చేతికి వచ్చే దాకా నరసయ్యతో పాటు డాక్టర్ రాఘవ కూడా కష్టపడాల్సి వస్తుంది. మధ్యలో ఎన్నో సార్లు పంటకు అపాయాలు కలిగినపుడు రాఘవ బాధతో కృంగిపోతాడు. కొన్నిసార్లు అసలు పంట తనకు దక్కదేమోనని భయపడతాడు.

కేవలం అరికెల కోసం వచ్చిన రాఘవకు ఆ పల్లెటూరి వాతావరణంలో ఎన్నో అనుభవాలు ఎదురవుతాయి. అలా ఆ ఊరిలోని మనుషులు, చెట్లు, పశువులు అన్నిటితో స్నేహం ఏర్పడుతుంది. తన స్వార్థం కోసం వచ్చిన మనిషి చివరికి తనలోని తప్పులు తెలుసుకొని ఆ పల్లెటూరికి ఎలా సహాయపడ్డాడు అనేది ముఖ్య కథ.

- నరసయ్య తన పల్లెలో ఎన్నో కష్టాలకు కొత్తగా వచ్చిన రోడ్డు కారణమని చెప్తాడు. అసలు ఒక రోడ్డు పల్లెటూరిలోని అనేక కష్టాలకు ఎలా కారణమయ్యింది?
- అభివృద్ధి, పారిశ్రామికీకరణ వల్ల మంచితో పాటు చెడు కూడా జరుగుతుంది. వీటి వల్ల ఆ ఊరిలోని ప్రకృతి ఎలా నాశనం అయ్యింది?
- అసలు డాక్టర్ రాఘవకు అరికెల పంట చేతికి వచ్చిందా?

ఈ ప్రశ్నలన్నింటికీ సమాధానం తెలుసుకోవాలంటే ఈ పుస్తకం చదవాల్సిందే.

**పుస్తకంలోని కొన్ని ముఖ్య అంశాలు**

- ఒక మనిషి ప్రకృతితో కలిసి జీవిస్తే ఎలా ఉంటుందో చెప్పారు. ప్రకృతి మనకు ఎన్నో విధాలుగా సహాయపడుతుంది, మరి మనం ప్రకృతిని ఏ విధంగా చూసుకుంటున్నాము?
- నరసయ్య జంతువులతో కూడా మనుషుల్లాగే మాట్లాడతాడు. వాటితో తన కష్టాల్ని, ఆనందాన్ని, బాధను పంచుకుంటూ తన కుటుంబంలో ఒక వ్యక్తిగానే పరిగణిస్తాడు. మనిషికి - పశుపక్ష్యాదులకు ఉండవలసిన స్నేహపూర్వక సంబంధాన్ని రచయిత ఇందులో చెప్పారు.
- సరిగా తిండి తింటే చాలు, ఏ రోగాలూ రావు అని చెప్పకనే చెప్పారు.
- చెట్లని ఎందుకు కాపాడుకోవాలో చెప్తూనే మనుషులకు మాత్రమే కాదు చిన్న చిన్న కీటకాలకు, జంతువులకు కూడా చెట్లు ఏ విధంగా సహాయపడతాయో చెప్పారు.
- నరసయ్య దృష్టిలో పాపపుణ్యాలు మన కర్మ ఫలితాలను బట్టే ఉంటాయని, ఎవరు ఏ కార్యాలు చేస్తే వారికి అవే తిరిగొస్తాయని చెప్పారు.
- ఇందులో దాదాపుగా పదికి పైనే ఆకుకూరల పేర్లు తెలుసుకున్నాను. ఆకుకూరలు అలవోకగా పల్లెల్లోని కాలువ గట్ల వెంబడి పెరుగుతాయని ఈ పుస్తకం ద్వారా తెలిసింది.
- ఈ కథలో తన చేష్టలతో ఇంట్లో అందరినీ విసిగించే ముసలమ్మ చేసిన పనికి అందరూ తిట్టినా, తర్వాత వాళ్ళే ముసలమ్మకు స్నానం చేయించి తిండిపెట్టి ఏమీ జరగనట్టే

ఉంటారు. ఇది చదవగానే మన కుటుంబాల్లో కూడా రాత్రి పోట్లాడుకున్నా ఉదయం ఏమీ జరగనట్టే మాట్లాడుకుంటాం  కదా అనే ఆలోచన రాక మానదు.

రాయలసీమ మాండలికంలో అరుదుగా రచనలు వస్తుంటాయి. అలా వచ్చిన అరుదైన కోవలోకి చెందినదే ఈ రచన. చదువుతున్నంత సేపు సీమ ప్రాంతాల్లో తిరిగినట్టే ఉంటుంది. సీమ ప్రాంత జనాలు, మాటలు, అలవాట్లు, ఆహారపద్ధతులను వెంకటరామిరెడ్డిగారు చక్కగా కళ్ళకు కట్టినట్టు మన ముందుంచారు. నిజానికి ఈ నవల చదువుతున్నంతసేపూ రచయిత బాధ్యతతో కన్నా బాధతో వ్రాసినట్టే అనిపించింది.

250 పేజీల ఈ నవలలో వ్యవసాయం, పల్లెటూరి జీవితం, పల్లె మనుషుల మనస్తత్వాలు, సాంప్రదాయ కళలు, పశువులు, పక్షులు, పంటలు, ప్రకృతి... ఇలా అన్నిటినీ రచయిత పొందుపరిచారు. ఇంత చిన్న పుస్తకంలో  రచయిత ఇన్నిటిని చక్కగా వివరించటం నిజంగా అభినందనీయం. పుస్తకంలోని డాక్టర్ రాఘవ, నరసయ్య, ఓబులమ్మ, రాములమ్మ ఇలా ప్రతి పాత్ర మనకు జీవితంలో ఎక్కడో ఒక చోట తారసపడతారు.

పుస్తకం చివర్లో రచయిత వెంకటరామిరెడ్డిగారు ఇచ్చిన ఒక మంచి సూచన/పిలుపు కచ్చితంగా ఆమోదయోగ్యంగా అనిపించింది:

*'మన తెలివితేటల కోసం ఎన్నో పల్లెలు ఎదురుచూస్తున్నాయి.'*

అజహర్

https://qr.ae/pyDpvu

## సోమరాజు సుశీలగారు ఎవరు? ఆవిడ రచనా శైలి, విశేషాలు ఏమిటి?

డా.సోమరాజు సుశీలగారు రసాయన శాస్త్రంలో పరిశోధన చేసి డాక్టరేట్ సాధించిన తొలి తెలుగు మహిళ, భాగ్యనగరంలో పరిశ్రమ స్థాపించిన తొలి తరం మహిళా పారిశ్రామికవేత్త.

ఆవిడ చాలా ఆలస్యంగా కలం చేతబట్టి రచనలు చేయడం ప్రారంభించారు. ఈ పని ఇంకొన్ని దశాబ్దాల ముందు చేసి ఉంటే ఇంకొంచెం సేపు నవ్వుల్లో మునిగే వాళ్ళం కదా అని ఆవిడ రచనలు తెలిసిన వాళ్ళందరూ అనుకుంటారు.

ఇక ఆవిడ రచనా శైలి ఎలా ఉంటుంది అని కదా అడిగారు. సునిశిత హాస్యం, గంభీరమైన జీవిత సత్యాలను మనసుకు తాకేటట్టుగా చెప్పడం, నిత్యజీవితంలో జరిగే రోజువారీ సంఘటనలకి కితకితలనే తాలింపు జోడించి వ్రాయడం...ఇదీ ఆవిడ శైలి.

మొట్టమొదట ఆవిడ గురించి నేను నెమలికన్ను బ్లాగులో మురళిగారు 'ఇల్లేరమ్మ కతలు' పుస్తకం గురించి వ్రాసినప్పుడు చదివాను. ఆ పుస్తకాన్ని చదవగానే వెనువెంటనే 'ముగ్గురు కొలంబస్‌లు', 'దీపశిఖ', 'చిన్న పరిశ్రమలు-పెద్ద కథలు' కొని చదివాను. ఏ పుస్తకమూ నిరాశకి గురి చెయ్యలేదు.

'ముగ్గురు కొలంబస్‌లు' అమెరికా ట్రావెలాగ్ లాంటిదే కానీ ఇల్లేరమ్మ మార్క్ ట్రావెలాగ్. ఇల్లేరమ్మ తన భర్త, అత్తగారితో అమెరికా వెళ్ళిన ఈ యాత్రలో హడావిడంతా ఈవిడదే అని ఆ పుస్తక ముఖచిత్రం చూస్తేనే తెలిసిపోతుంది. ఆవిడతో కలిసి అమెరికాలో ప్రయాణిస్తూ ఇల్లేరమ్మ మార్క్ హాస్యాన్ని ఆనందించాలంటే ఇది తప్పక చదవాలి.

పారిశ్రామికవేత్తగా ఆవిడ పడిన ఇబ్బందులను తనదైన శైలిలో 'చిన్న పరిశ్రమలు-పెద్ద కథలు' పుస్తకంలో ఆవిష్కరించారు.

సుశీలగారు జీవితంలో తనకు ఎదురైన అనుభవాలనే పసందైన కథలుగా మార్చి 'దీపశిఖ' అనే కథల పుస్తకం వేసారు.

లక్ష్మీబాయి కేళ్కర్ గారి రామాయణ ప్రవచనాల సంకలనాన్ని 'పథదర్శిని శ్రీరామకథ' పేరుతో సుశీలగారు తెలుగులోకి అనువదించారు.

డా.వై.నాయుడమ్మ గారి గురించి తెలుసుకోవాలంటే సుశీలగారు వ్రాసిన 'ప్రపంచ ప్రఖ్యాత శాస్త్రవేత్త డా||.వై.నాయుడమ్మ' పుస్తకం తప్పక చదివి తీరాలి.

ఇక ఆవిడ 'పెండ్లి పందిరి కథలు' పుస్తకం నిండా అచ్చంగా పెళ్ళిళ్ళ కథలే. సుశీలగారు తన చేతుల మీదుగా జరిపించిన వివాహాల గురించి, తాను వెళ్ళిన వివాహాల గురించి తనదైన శైలిలో చెణుకులతో వ్రాసిన పుస్తకం ఇది. మొత్తం పధ్నాలుగు కథలున్న ఈ పుస్తకంలో ఆఖరి కథ సుశీల గారి పెళ్ళి కథ.

ఈ పుస్తకంలో ఆవిడ వ్రాసిన 'ఏ ఫంక్షనైనా రక్తి కట్టాలంటే ఎంత అర్థబలం ఉన్నా నమ్మకమైన అంగబలం ఉండాలి ' అన్న వాక్యం చదివితే నిత్యసత్యం అనిపించకమానదు.

అలాగే తలకి మించిన భారాన్ని అమాయకత్వంతో తలకెత్తుకుని 'అజ్ఞానం ఇచ్చిన ధైర్యం విజ్ఞానం ఇవ్వదు' అనే చమక్కు చదవగానే తెలియకుండానే పెదాల మీద చిరునవ్వు పూస్తుంది.

ఆవిడ కేవలం 6 పుస్తకాలే ప్రచురించినా అవన్నీ ఆణిముత్యాలే. తప్పక చదివి తీరవలసినవే.

వాత్సల్య గుడిమళ్ళ
https://qr.ae/pvW1Ov

## కల్కి గారి 'శివగామి శపథం' నవల చదివారా? ఆ నవల మీద మీ అభిప్రాయం ఏమిటి?

పొన్నియిన్ సెల్వన్ నవల వ్రాసిన కల్కి కృష్ణమూర్తి గారి మరొక నవల శివగామి శపథం. పొన్నియిన్ సెల్వన్ నవలల ఐదు భాగాలనీ తెలుగులోకి అనువదించిన నాగరాజన్ గారే ఈ నవలని కూడా అనువదించారు.

ఇక ఈ నవల కథ ఏమిటో చూద్దాము.

పల్లవ రాజ్యంలో చక్కదనానికి పేరుగాంచి, నాట్యశాస్త్రాన్ని ఔపోసన పట్టిన శివగామి అరంగేట్రం ఆ రోజు. ఆమె తండ్రి 'ఆయనార్' పల్లవ రాజ్య ఆస్థాన శిల్పి, పైగా పల్లవ చక్రవర్తి మహేంద్ర పల్లవుడికి అత్యంత విశ్వసనీయుడు కూడా.

ఆ కార్యక్రమం కోసం ప్రజలతో పాటు యువరాజు కూడా ఆసక్తిగా ఉన్నాడు. ఇంతలో వేగులు అత్యవసర వార్త మోసుకురావడంతో చక్రవర్తి ఆఘమేఘాల మీద సభని వీడి బయలుదేరతాడు.

నాట్యప్రదర్శన ఆగిపోవడంతో శివగామి తన తండ్రితో కలిసి పల్లకీలో తిరుగు ప్రయాణమై వెళ్తుండగా వీధిలో మదమెక్కిన ఏనుగొకటి దూసుకొస్తుండటంతో బోయీలు పల్లకీని విడిచి పరుగు లంకించుకుంటారు.

అదే సమయంలో ఒక సన్యాసితో కలిసి కంచిలోకి ప్రవేశించి అంత పెద్ద నగరాన్ని చూసి అబ్బురపడుతున్న పరంజ్యోతి అనే యువకుడు దూసుకొస్తున్న మదపుటేనుగు మీదకి తన చేతిలోని శూలాన్ని గురిపెట్టి విసరగానే అది నేలకూలుతుంది.

తమని రక్షించిన యువకుడెవరని ఆ తండ్రీ కూతుర్లిద్దరూ ఆలోచిస్తుండగానే మళ్ళీ ఇంకో కోలాహలం. మహారాజు మహేంద్ర పల్లవుడు, యువరాజు నరసింహవర్మని చూసి వీధిలో ప్రజలు పలుకుతున్న జేజేలు అవి.

పెద్దలిద్దరూ మాట్లాడుకుంటుండగానే శివగామి, నరసింహవర్మ చూపులతో మూగ ఊసులాడుకుంటూ ఉంటారు.

ఇంతలో తన చేతిలోని మూటని శూలం విసిరిన చోట మర్చిపోయానని గుర్తొచ్చి దానిని తెచ్చుకోవడానికి వెళ్తున్న పరంజ్యోతిని ఇద్దరు రాజభటులు పట్టుకుని అతడు వెళ్ళాల్సిన చోటుకి తాము తీసుకుళతామని మభ్యపెట్టి ఒక భవనంలోకి తీసుకెళ్ళి బంధిస్తారు. పరంజ్యోతిని కోటలోకి తీసుకొచ్చిన సన్యాసి అతడిని ఆ బంధిఖానాలోంచి తప్పిస్తాడు.

పరంజ్యోతిని బంధించినదెవరు? సన్యాసి అతడిని ఎందుకు తప్పించాడు? అతడిని తప్పించడమే కాకుండా పల్లవరాజులు కౄరులని, అతడు శూలం విసరడం వల్లే ఏనుగుకి మదమెక్కిందనే నిందమోపి శిక్షించినా ఆశ్చర్యపోవక్కర్లేదని చెప్పి మయూరశర్మ అనే యువకుడిని పల్లవులు అలాగే శిక్షించారని చెప్పడంతో పరంజ్యోతి భయపడతాడు.

చాళుక్యులతో యుద్ధం అనివార్యమని తోస్తోందని చెప్పిన ఆ సన్యాసి పరంజ్యోతిని గబగబా కోట దాటించి ఒక ముఖ్య కార్యం మీద పంపుతాడు.

దారిలో పరంజ్యోతిని కలిసిన వజ్రబాహు అనే వీరుడు మొదటిరోజు సన్యాసి చెప్పిన మయూరశర్మ కథనే వేరొకలా ఎందుకు పరంజ్యోతికి చెప్పాడు? అసలు ఎవరీ వజ్రబాహు? అతడు పరంజ్యోతి దగ్గరున్న తాళపత్రాన్ని ఎందుకు చేజిక్కించుకోవాలని చూసాడు?

అరంగేట్రానికి విఘ్నం కలగడంతో ఇంటికి చేరిన శివగామి అసహనంతో ఉంది. ఇంతలో అక్కడకి పరంజ్యోతితో కలిసి వచ్చిన సన్యాసి మాటలు ఆమె అసహనాన్ని రెట్టింపు చేయడంతో తాను సేదతీరే తామరకొలను వైపు వెళ్ళింది. ఆమె అటు వెళ్ళగానే ఒక యువకుడు గుర్రం దిగి ఆమెని సమీపించాడు.

ఆమెని సమీపించిన ఆ యువకుడెవరు? వాళ్ళిద్దరూ మాట్లాడుకుంటుండగా చెట్టు వెనక నక్కి ఆ సన్యాసి ఎందుకు వింటున్నాడు? చెట్టు తొర్రలోంచి అతడు ఏమి చేజిక్కించుకున్నాడు?

ఆ తరువాత కొన్ని కారణాల వల్ల తాను ఎంతగానో విశ్వసించే ఆస్థాన శిల్పి ఆయనార్ మీద చక్రవర్తి నిఘా ఏర్పాటు చేసి కొన్ని విషయాలని తెలుసుకుంటాడు. అవేమిటి?

కొన్ని సంఘటనల వల్ల పరంజ్యోతి సేనాపతి అయి యువరాజుకి అత్యంత విశ్వసనీయుడవుతాడు.

కొన్నిరోజులకి శివగామి అరంగేట్రం జరుగుతుండగా ఆమె అకస్మాత్తుగా కళ్ళుతిరిగిపడిపోయి సపర్యలు చేసాకా కోలుకుంటుంది. అప్పుడు ఆమెని చూసిన ఒక పెద్దాయన ఈమెకి మున్ముందు కఠినపరీక్ష ఎదురవబోతోందని చెప్పడంతో ఆమె తండ్రి హతాశవుడవుతాడు. ఇంతలో వేగులు తెచ్చిన సమాచారం విన్న యువరాజు హఠాత్తుగా ఆక్కడినుండి నిష్క్రమిస్తాడు.

యుద్ధరంగంలో ఉన్న మహేంద్ర పల్లవుడు తన కొడుకు నరసింహవర్మని కూడా యుద్ధరంగానికి రమ్మనమని కబురుపెట్టి, వచ్చేటప్పుడు శివగామిని కలిసి రమ్మని చెప్పడంతో యువరాజు ఆశ్చర్యపోతాడు. ఎన్నో ఆశలతో ఆమెని కలవాలని వెళ్ళిన యువరాజుకి వారింటికి వేసిన తాళం స్వాగతమిచ్చింది.

యుద్ధం రాబోతోందని తెలిసిన ఆయనార్, తన కుమార్తెని తీసుకుని ప్రయాణమవుతాడు. యువరాజు గురించి కల్లబొల్లి కబుర్లు చెప్పి శివగామి మనసులో ఆయనపట్ల విషం నింపాలని సన్యాసి చేసిన ప్రయత్నం కొంతవరకు ఫలించినట్లే కనిపిస్తోంది.

తాను ఇల్లు విడిచి ప్రయాణమయ్యాకా యువరాజు తనని చూడటానికి వచ్చాడని గుండోదరుడనే ఆయనార్ శిష్యుడి ద్వారా తెలుసుకుని శివగామి ఆశ్చర్యపోతుంది. గుండోదరుడు శివగామి వద్దకి చేరగానే సన్యాసి వాళ్ళని వదిలి ఎందుకు వెళ్ళిపోయాడు?

పులకేశి ఆదేశాలననుసరించి కంచిని ముట్టడించాలని బయలుదేరిన ఒక రాజుని యుద్ధంలో కట్టడి చేసి వెనుదిరిగిన యువరాజు శివగామిని కలుస్తాడు. ఇంతలో వరదల వల్ల నది గట్టు తెగడంతో అందరూ ఒక గ్రామంలో చిక్కుకుపోతారు. ఆ గ్రామంలో ప్రజలకి తమతో ఉన్నది యువరాజని తెలియదు. అతను అక్కడ బస చేసినప్పుడే ఒకరు యువరాజుని హత్య చేయడానికి ప్రయత్నిస్తారు.

గ్రామస్తులకి యువరాజు తమతోనే ఉన్నాడన్న విషయం తెలిసి జయజయధ్వానాలతో ఆయనని సమీపించేలోపే యువరాజు అక్కడినుండి మాయమైపోతాడు.

ఆ తరువాత శివగామిని కలుసుకున్న పల్లవ చక్రవర్తి చాళుక్యుల నుండి కంచి నగరాన్ని కాపాడే సామర్థ్యం ఇప్పుడు శివగామి మీదనే ఉందని, అందుకు ఆమె ఒక వాగ్దానం చెయ్యాలని కోరగానే శివగామి కుప్పకూలిపోతుంది.

కంచికి తిరిగి వెళ్ళిన యువరాజుకి తన తండ్రి ఇంకా కంచికి చేరలేదని తెలిసి ఖిన్నుడవుతాడు. మంత్రులతో సమావేశం నిర్వహించి తాను చాళుక్యులని ఎదుర్కోవడానికి యుద్ధానికి వెళ్తానని చెప్తుండగా ఎవరూ ఎదురుచూడని ఒక దూత వచ్చి పల్లవ చక్రవర్తి చాళుక్యుల చెరలో ఉన్నాడనీ, శివగామి, ఆమె తండ్రి వాతాపి చాళుక్యుల గూఢచారులనే వార్త అందజేస్తాడు.

ఈ మాటలు వినగానే యువరాజు తల గిర్రున తిరుగుతుంది. ఇంతలో చక్రవర్తి అక్కడకి చేరుకుని తాను క్షేమంగానే ఉన్నానని చెప్పి ఆ దూతని బంధించమని ఆజ్ఞ ఇస్తాడు.

ఈ ఉదంతం జరిగిన కొన్ని రోజుల తరువాత కొన్ని ఆశ్చర్యకర పరిణామాల మధ్య వాతాపి చక్రవర్తి కంచి పల్లవులకి అతిథిగా వస్తాడు. అక్కడ పల్లవ చక్రవర్తి మాట తూలి చెప్పిన కొన్ని మాటలని విన్న పులకేశి కోపంతో రగిలిపోయి శివగామిని బంధించి వాతాపి నగరానికి తీసుకెళ్తాడు.

అక్కడ శివగామి కొన్ని కారణాలవల్ల నడివీధిలో దాదాపు నెలన్నరపాటు రోజూ నాట్యం చేయవలసి వస్తుంది. అప్పుడు అక్కడకి వచ్చిన సన్యాసి తాను ఇప్పుడే శివగామిని విడిపించి సగౌరవంగా కంచి నగరానికి పంపిస్తానని చెప్తాడు. కానీ శివగామి అందుకు ఒప్పుకొనక యువరాజు నరసింహవర్మ వాతాపి నగరాన్ని జయించి ఈ పట్టణాన్ని కాల్చి బూడిద చేస్తే తప్ప తాను ఇక్కడినుండి కదలనని శపథం చేస్తుంది.

ఈ మాటలు వినగానే ఆ సన్యాసి ముఖంలో ఓ మర్మభూయిష్టమైన నవ్వు ఎందుకు విరిసింది?.

కొన్నిరోజులకి మారువేషంలో వాతాపి నగరంలోకి ప్రవేశించిన యువరాజ శివగామిని తనతో రమ్మని కోరినా శపథం గుర్తుకు వచ్చి శివగామి వారితో వెళ్ళేందుకు ఒప్పుకోదు.

శివగామిని తీసుకురాలేదని తెలిసి పల్లవ చక్రవర్తి మరింత దిగులుపడతాడు. మరణపు అంచున ఉన్న తండ్రిని సంతోషపెట్టడానికి తనకి ఇష్టం లేకపోయినా తండ్రి కోరిన వాగ్దానం చేస్తాడు యువరాజ.

ఆ తరువాత దాదాపు తొమ్మిదేళ్ళకి పల్లవ యువరాజ వాతాపిని ముట్టడించి శివగామి కోరికని నేరవేరుస్తాడు.

శివగామి, యువరాజ పెళ్ళి చేసుకున్నారా? మధ్యలో ఏమి జరిగింది తెలుసుకోవాలంటే ఈ నవల చదవాలి.

పుస్తక అనువాదకుడు నాగరాజన్ గారి వెబ్సైట్లో మొదటి భాగం ఉంది. అది చదివి ఆయనకి మెయిల్ చేస్తే మిగతా భాగాలు పంపిస్తారు. చారిత్రక నవలల మీద ఆసక్తి ఉన్నవారికి ఇది బాగా నచ్చుతుంది.

ఈ నవలలో నాగనంది అనే బౌద్ధ సన్యాసి కథని అనేక మలుపులు తిప్పుతూ ఉంటాడు. అతడి పాత్ర వచ్చినప్పుడల్లా ఒకప్పటి తెలుగు సినిమాల్లో స్క్రీను మీదకి రాగానే భయపెట్టిన ముక్కామల, రాజనాల, కోట లాంటి విలన్లు గుర్తొస్తారు.

ఇందులో పొన్నియిన్ సెల్వన్‌లా అనేక పాత్రలు లేవు, పేర్లు కూడా మనకి గుర్తుండే పేర్లే. కథనం కూడా వర్ణనలవీ ఎక్కువ లేకుండా సరళంగా ఉంది.

నాగరాజన్ గారి వెబ్సైట్ : http://taoofeverything.in

వాత్సల్య గుడిమళ్ళ
https://qr.ae/pye4sD

## గొల్లపూడి మారుతీరావు గారి 'సాయంకాలమైంది' నవల చదివారా? ఆ నవల మీద మీ అభిప్రాయం ఏమిటి?

గొల్లపూడి గారి సంసారం ఒక చదరంగం, డబ్బు భలే జబ్బు, మనిషికో చరిత్ర లాంటి సినిమాలు చిన్నతనంలో చూసి ఆయన నటనకి అభిమానిగా మారాను.

ఏవైనా సినిమాలలో ఆయన ఉన్నాడంటే ఆ వ్యంగ్య డైలాగులకు నవ్వుకోవచ్చు అని చూసేవాడిని. ఆయన రచనల గురించి తెలియని వయసులో, నాకు తెలిసింది ఆయన వార్తాపత్రికల్లో వ్రాసే వ్యాసాలు మాత్రమే.

స్కూల్‌కి వెళ్లే రోజుల్లో ప్రతి గురువారం అనుకుంటా, సాక్షి వార్తాపత్రిక కోసం ఎదురుచూసేవాడిని. పేపర్ రాగానే నేను చేసే మొదటి పని సంపాదకీయం పేజీ తెరిచి గొల్లపూడి గారి వ్యాసం ఎక్కడ ఉంది అని వెతికి చదివితేగాని ఆ పూట తృప్తిగా ఉండేది కాదు. పొరపాటున ముందు రోజు ఏదైనా పండగ బుధవారం వస్తే తెగ బాధ పడేవాడిని గురువారం పేపర్ రాదు. పండగ సెలవు దినం కాబట్టి. కాలేజీ వయసుకి వచ్చాక అవన్నీ యూట్యూబ్ ఛానెల్స్‌లో, కౌముది వెబ్సైటులో చూసి మళ్ళీ చదువుకొని సంతోషించాను. ప్రతి అంశం పైన ఆయన విశ్లేషణ అంత బాగుంటుంది, రాజకీయంగా ఒక పార్టీకి సపోర్ట్ చేస్తున్నట్టు కనపడినా కూడా ఆ విమర్శల విశ్లేషణ శైలి ఏదో నన్ను బలంగా ఆకట్టుకునేవి.

కొన్ని సంప్రదాయాలు మాటల్లోకి తర్జుమా చేస్తే చాలా విపరీతంగా కనిపిస్తాయి. బహుశా ఇలాంటి కొన్ని నవలలు చదివితే వచ్చే అనుభూతిని తర్జుమా చేసి వ్రాసినా కూడా చాలా విపరీతంగా కనిపిస్తుందేమో. వ్రాసేటప్పుడు కన్నీళ్లు వస్తాయేమో, అది అర్థమయ్యేలా చెప్పేకంటే అనుభవిస్తే సరిపోతుందేమో!!!

'సాయంకాలమైంది' నవల యాదృచ్ఛికంగా నేను సాయంకాలమే చదివాను. ఈ నవలలో మూడు తరాల అంతరం సుస్పష్టంగా కనిపిస్తుంది.

ఎక్కువ శాతం ఇళ్లలో ఉండే తండ్రి ఛాయలే సుభద్రాచార్యుల పాత్రలో కనపడుతుంది. ఎవడి మాట వినడు సుభద్రయ్య. జాలేస్తుంది, మన ఇంటి దగ్గర ఉండే తండ్రులు కూడా ఇంతే ఇబ్బంది పడ్డారా అనిపిస్తుంది. నిస్సహాయత కమ్మేస్తుంది. పిల్లలు వేరే ఊర్లకి వెళ్తే ఆ తండ్రి ఇంటి అవసరాలకి క్యూ లో నిలబడి సరుకులు కొనడం సర్వ సాధారణ పని, విడిగా ఎవరైనా చెప్తుంటే విన్నప్పుడు అందులో ఏముందిలే అని తీసిపడేసేలా ఉండచ్చు గాని, కథలో నిమగ్నమై చదువుతుంటే మన తల్లి, తండ్రి పెద్ద వయసుకి వచ్చాక ఇంకా కష్టపడుతుంటే అది ఒకరంగా మన చేతకానితనమేనా అనే ప్రశ్న మనల్ని ఛిన్నాభిన్నం చేస్తుంది.

పిల్లల సుఖమే ఎల్లప్పుడూ కోరుకునే తల్లి వరదమ్మ ఆఖరి ఘడియల వర్ణన కంట నీరు తెప్పిస్తుంది. బుల్లిరాజ లాంటి స్నేహితుల అవసరం ఎంతైనా ఉంటుంది, కడదాకా పిల్లలు ఉంటారో లేదో గాని చిరకాల స్నేహితులు తప్పకుండా తోడుంటారనడానికి బుల్లిరాజు లాంటి వారే ఆదర్శం.

మాటలు రాని కైకవశి, అనాథలా పెరిగిన సంజీవి, అన్నీ కోల్పోయిన నవనీతం, కళ్ళున్నా చూడలేని నారాయణ ఇలాంటి భిన్న వ్యక్తులు కలిసి ఒక అందమైన కుటుంబంగా ఏర్పడి తమకున్నదాంట్లో ఎంత సంతోషంగా బ్రతకచ్చో చూపిస్తుంటే ఆశ్చర్యమేస్తుంది.

కథలో నన్ను బాగా ఆకట్టుకుంది మాత్రం వేంకటాచలం కుటుంబమే. కలియుగ దైవం వేంకటాచలపతి తిరుమలకి వెళ్లి ఆ ప్రాంత విశిష్టతని పెంచినట్లు, కథలో వేంకటాచలం కూడా చిన తిరుమల దగ్గరకి వెళ్లి అతని జీవితాన్ని మార్చేసి సముద్రాలూ ఖండాలు దాటించి శిఖరాల మీద నుంచోబెట్టాడు.

వేంకటాచలం భార్య జయవాణి, కూతురు విక్టోరియా కలిసి రోగం బారిన పడిన అతన్ని చూసుకున్న తీరు ముచ్చటేస్తుంది. వాళ్ళిద్దరూ చూపిన ఆదరణ చదువుతుంటే మనల్ని ప్రేమించే వారుంటే రోగం రావడం కూడా అదృష్టమే కదా అనిపిస్తుంది. కష్టాన్ని సునాయాసంగా ఎదురుకునే ధైర్యాన్నిస్తుంది.

'తిరుమల' పాత్ర గురించి చెప్పడానికి ఏమీ లేదు, మనల్ని మనం ఆ పాత్రలో చూసుకోవచ్చు, ఏమి చేయలేని స్థితి, ముందడుగు వేయలేని పరిస్థితి. తను తల్లి ఆఖరి చూపుకు పడిన ఇబ్బంది చదువుతుంటే నన్ను నేను చూసుకున్నాను.

ఏ తల్లిదండ్రులూ  తమ కష్టాలని దూరంగా ఉండే పిల్లలకి చెప్పుకోరు, చెప్పినా వాళ్ళకి మనఃశాంతి లేకుండా చేయడం తప్ప మరింకే ఉపయోగం ఉండదని భావిస్తారు. తల్లి దండ్రుల ఆరోగ్యం గురించి పిల్లలు ఇతరులకి చెప్పాల్సింది పోయి, పిల్లలు ఇతరులని వాకబు చేసే దుస్థితి. పొరపాటున బతికే ఉన్నారని తెలిస్తే ఇంకొన్ని రోజులు ప్రయాణం వాయిదా వేసుకునే సాకు, మనలో కూడా ఇలాంటి వంకలు పెట్టి ప్రయాణాన్ని వాయిదా వేసుకునే కోణం ఉండే ఉంటుందా అనే ఆలోచన మనసుని మెలి పెట్టేస్తుంది.

> *ముగిసే జీవితాల కోసం మన ఉద్యోగాన్ని కాదని ముందు తరాల అవకాశాన్ని ఫణంగా పెట్టాలా? అది మనిషిని బట్టి ఉంటుంది. ఆయా వ్యక్తుల విలువల్ని బట్టి ఉంటుంది.*

నవలలో గొల్లపూడి గారి కలం నుండి జాలువారిన కొన్ని వజ్రవైఢూర్యాలు:

- జన్మతః శ్రీ కృష్ణుడు అంటరాని వాడు. గుడిలోకెళ్ళాక తాను అంటరానంత దూరమయ్యేవాడు.
- ప్రవృత్తి నిష్ఠ కళను పరాకాష్టకు చేరుస్తుంది. బాధ్యత లక్ష్యాన్ని భారం చేస్తుంది. ఆసక్తి లక్ష్యాన్ని పదును పెడుతుంది.
- మానవ జీవితం అవసరాలను కుదించుకునే దశ నుండి గుణించుకునే దశకి చేరింది.

- కోటు ఇంగ్లీష్ వాడికి అవసరం. గోచి భారతీయుడికి చాలు, అది పేదరికం కాదు, నియమం. ఇదే రమణుడు, గాంధీ ఆదర్శంగా చేసి చూపారు.
- బ్రతికుండగా మనుషులని దూరంగా నిలిపిన ఆచారాలు, సంప్రదాయాలు, ఆంక్షలు అన్నిటిని మృత్యువు జయిస్తుంది.

మనం తీక్షణంగా చదివి వెతుక్కోవాలే గాని నవలలో ఇలాంటి మట్టిలో మాణిక్యాలు ఎన్నో దాగి ఉంటాయి.

కథలో ఎన్నో పాత్రలు, వారి మధ్య సంభాషణలు ఎంతో సహజంగా హృద్యంగా ఉంటాయి. అవి చదువుతున్నంత సేపు ఇవన్నీ మన ఇళ్ళల్లో జరిగే ఉంటాయా అనే సందేహం తప్పక కలుగుతుంది. తండ్రి ఆవేదన మనల్ని కుదిపేస్తుంది. రేచకుడి కథ చదువుతుంటే మన గొంతు తడారిపోతోంది.

ఈ కథ అప్పటి అమెరికా వలస పక్షుల తల్లిదండ్రుల ఇబ్బందులు గురించి వ్రాసినా కూడా ఇప్పటికీ మన దేశంలోనే మహానగరాలకు వలస వెళ్లిన మనలాంటి పక్షులకి కూడా చెల్లుబాటవుతుంది. ప్రతి వలస పక్షి జీవితంలో ఒక్కసారైనా చదివి తీరాల్సిన నవల ఇది.

ఈ నవలలో ఎవరిని తప్పుబట్టే ప్రయత్నం చేయలేదు, పరిస్థితులు ప్రభావం మన జీవితంలో ప్రతి దశలోనూ ఎలాంటి మార్పులు తీసుకువస్తుందో, దానికి ఎలా సిద్ధపడి ఉండాలో చెప్పిన ప్రయత్నమే అని నా భావన.

ముచ్చటగా మూడు వాక్యాల్లో ఈ నవల గురించి నా అభిప్రాయం:

- సాయంకాలమైంది.
- మన తల్లిదండ్రుల వయసుకి సాయంకాలమైంది.
- మనం వారికి చేతనైనంత సాయం చేసే కాలం ఆసన్నమైంది.

ఈ నవల చదవాలి అనుకునే వారికి కౌముది వారి గ్రంథాలయంలో, గొల్లపూడి మారుతిరావుగారి రచనల విభాగంలో వారి రచనలు కొన్ని సాఫ్ట్ కాపీలు అందుబాటులో ఉంచారు. అక్కడ 'సాయంకాలమైంది' డౌన్లోడ్ చేసుకొని చదివి తరించండి.

ప్రకాష్
https://qr.ae/pyMt5

## వడ్డెర చండీదాస్ గారి 'హిమజ్వాల' నవల మీద మీ సమీక్ష ఏమిటి?

ఎంత కళ్ళెం వేసినా ఆలోచనలు కుదురుగా ఒక పద్ధతిలో ఉండవు కదా! ఒకటి అనుకుంటూ, ఇంకో దాంట్లో దూరిపోవడం వాటికి మామూలే. ముళ్ళపూడిగారన్నట్టు 'శాఖా చంక్రమణం' అంటే, కొమ్మల మీది కోతిలా, అలుపుసొలుపు లేకుండా, ఎటువైపంటే అటువైపు తిరిగే మనసుకున్న ఈ అలవాటును పుస్తకాల్లో రాసే టెక్నిక్‌ని, 'చైతన్య స్రవంతి' శైలి (స్ట్రీమ్ ఆఫ్ కాంషస్నెస్ ) అంటారు. ఇంగ్లీషు సాహిత్యంలో మేరుశిఖరం అనదగ్గ జేమ్స్ జాయిస్ రచన 'యూలిసెస్'లో ఈ శైలి మొదటిసారి దర్శన మెచ్చింది.

మన తెలుగులో బుచ్చిబాబు దీనికి ఆద్యుడు. వడ్డెర చండీదాస్ రెండు నవలలు ఇందుకు ఉదాహరణలే. చైతన్య స్రవంతిలో ఆలోచనలకు ఒక సహజ గతి ఉండదు. ముందు అన్న విషయానికి, వెనుక వచ్చే విషయానికి, క్రమ పరిణామం ఉండకూడదు. ఎందుకంటే, ఆలోచించేటప్పుడు అలా పద్ధతి పాడు ఏమీ ఉండకుండా ఒక ప్రవాహంలా ఆలోచనా పరంపర సాగిపోతుంటుంది కదా! అలా అని పిచ్చివాని ప్రేలాపన లాగ కూడా వ్రాయరాదు. అందుకే అలా వ్రాయగలగటం అంత సులభం కాదు.

'హిమజ్వాల'  వడ్డెర చండీదాస్ తొలి నవల. మంచులో చల్లదనాన్ని, జ్వాలలో మంటని కలిపి, వినూత్న మందుగుండు సామాగ్రి చేసి తెలుగు పాఠకుల మస్తిష్కాలలో ఫిరంగులను పేల్చిన నవల హిమజ్వాల. ఆంధ్రజ్యోతి వార పత్రికలో ధారావాహికగా వెలువడి ఆ కాలంలో బోలెడు ఖ్యాతిని, అలాగే అంతకు మించి అపప్రథని మూటగట్టుకున్న నవల.

ఇందులో నాటకీయత, కథనా నైపుణ్యం, చైతన్య స్రవంతి, ముప్పేట పేనుకుని, సమాజాన్ని ధిక్కరిస్తూ, కొత్త గొంతుక లేవనెత్తిన నవల. ఇందులో ప్రధాన పాత్రలు రెండు - కృష్ణ చైతన్య, గీత. వీరి వ్యక్తిత్వ, మానసిక చిత్రణ ఈ నవలలో ఒక నూతన ఒరవడిలో సాగింది.

హిమజ్వాల మొదటి అధ్యాయం 1960లో వ్రాసి,  ఏడు సంవత్సరాలు స్తబ్దత అనంతరం 1967 లో తిరిగి వ్రాయడం మొదలెట్టి ఆర్నెల్లలో పూర్తిచేసారు. వైట్ హెడ్ , సార్ట్రే , యూంగ్‌ల తత్వాలు మూలాంశాలుగా, గమనాన్నీ, యానాన్నీ, ప్రవాహాన్నీ అక్షరాలలో చిత్రించాలని — అంతర్ బహిర్ వర్తనాల మధ్యన వుండే గొలుసు పొరలు చిరగకుండా వొక్కొక్కటె విప్పి; యేదో శూన్య రహస్యాన్ని తెలుసుకోవాలన్న కోర్కెతో వ్రాసిన అస్తిత్వ వాద మనో వైజ్ఞానిక నవల హిమజ్వాల.

క్లుప్తంగా కథని పరిశీలిస్తే, ఇందులో ప్రధాన పాత్రలు రెండు, ఆ పైన కొన్ని సహాయపాత్రలు ఉన్నాయి. గీతాదేవి అనే పాత్ర, భావుకత, సౌందర్య ఆరాధన, సంగీతాభిలాష  ఉన్న విద్యాధికురాలు. కృష్ణచైతన్య తత్వశాస్త్రములో లెక్చరర్. ప్రవృత్తి, వృత్తి ఈ రెంటి వల్లా అబ్బిన తాత్విక ధోరణి, దానితో పాటు మంచి నడవడిక ఉన్నవాడు.

గీతాదేవికి జరిగిన ఒక ప్రమాదంలో  నాయికా నాయకులిరువురూ ఒకరికొకరు తారస పడతారు. అప్పటికే తల్లిని, తండ్రిని కోల్పోయి రోడ్డు పాలైన గీతను కొన్నాళ్ళు తన ఇంట్లో ఉండటానికి కృష్ణ తీసుకు రావడంతో కథ మెదలవుతుంది. వారిద్దరి అభిప్రాయాలు, ఆలోచనలు కలుస్తాయి. అందుకనే సామీప్యత పెరిగి ఒకానొక రోజు మరింత చేరువ అయ్యే సందర్భంలో గీత తన కోరికను వెలిబుచ్చినా, కృష్ణ సంకోచంతో వెనుకంజ వేస్తాడు. ఆ తిరస్కారాన్ని జీర్ణించుకోలేని గీత ఇల్లు వదిలి వెళ్ళిపోతుంది. ఆమె వెళ్ళాక తన పొరపాటు గుర్తించిన కృష్ణ కూడా దేశ దిమ్మరి అవుతాడు. ఇక గీత తన స్నేహితురాలు వద్దకు చేరి ఎమ్మే చదువుకుని ఉద్యోగాన్వేషణ చేస్తుంది. స్నేహితురాలి భర్త తనను కోరుకోవడం వల్ల వారికి దూరమై, ఒంటరిగా ఉంటూ ఒక పత్రికలో సబ్ ఎడిటర్‌గా పనిచేస్తుంది. కొంత కాలానికి పరిచయం అయిన శివరాం ఒత్తిడికి లొంగి అతన్ని పెళ్ళి చేసుకుంటుంది.

కానీ శివరాంలో రసస్పందన లేదని పెళ్ళయ్యాక తెలుస్తుంది. అతనికి నాలుగు గోడల మధ్య మొక్కు బడి శృంగారమే తప్ప స్త్రీలకు కూడా కొన్ని శృంగార భావనలు ఉంటాయని తెలీదు. అరకు లోయ సందర్శనలో గీత సహనం చచ్చిపోయి తిరగబడుతుంది. శివరాం ఆమెను అడవిలో ఒంటరిగా వదిలి వెళ్లిపోతాడు.

ఇంకోవైపు ఊర్లు పట్టుకు తిరుగుతున్న కృష్ణ, ఊటీలో పరిచయం అయిన రోగిష్టి చిదంబరం పెళ్ళాం మాధురి వలలో చిక్కి లొంగిపోతాడు. కొంతకాలానికి ప్లేటు తిప్పిన మాధురి ప్రవర్తనకు హతాశుడై ఆశ్రమంలో చేరతాడు.

అరకు లోయలో తుఫానులో చిక్కుకున్న గీతను, కృష్ణ తండ్రి సారథి కాపాడతాడు. గీత, సారథి వ్యక్తిత్వానికి మెచ్చి చేరువవుతుంది. తనతో గీతను ఇంటికి తీసుకువెళ్లిన కొద్దికాలానికే అయన చనిపోతాడు. తండ్రి మరణవార్త విని ఇల్లు చేరిన కృష్ణకు, తన తండ్రి చేరదీసింది గీతనని తెలిసినా, ఆమె సాన్నిహిత్యాన్ని కోరుకుంటాడు. ఇంతలో శివరాం ప్రత్యక్షమై గీతను తనతో రమ్మంటాడు. గీతను తీసుకు వెళ్ళే ప్రయత్నంలో, కోపంలో గొంతు నులిమి చంపి, తాను మరణిస్తాడు.

ఈ కథలో అడుగడుగునా మనల్ని ఆశ్చర్యపరచేవి వర్ణనలు. గడ్డి పోచ మొదలుకుని, కరి మబ్బు దాకా, అన్నిటిని తనదైన శైలిలో వర్ణిస్తారు చండీదాస్. ముఖ్యంగా పాత్రల వేషధారణ, ముఖ కవళికలు, మానసిక చిత్రణ, ప్రకృతి వర్ణన అన్నీ పొందికగా, పోలిక లేనట్టుగా చిత్ర విచిత్ర వర్ణనలు, రసరమ్యంగా చెక్కినట్టు ఉంటాయి.

'కౌగిలి విడిపించుకుని దూరంగా నిలిచిన ప్రేయసిలా కనిపించే ఆకాశానికి, నిరీక్షణతో క్రుంగిపోయిన ప్రియుడిలా అనిపించే భూమికి మధ్య గాలి చలనంతో ఆకారాన్ని పొందిన నిరావరణం'

చిన్న చిన్న వాక్యాల్లో పెద్ద పెద్ద భావాలు...

'తడిసి ముద్దయిపోయిన ప్రకృతి, ఆమె శరీరంలోంచి ఎగసే ఆవిరికి తేరుకుంటోంది'

'మాటాడే తీరులో, సెలయేటి గలగలలోని వేగం, స్పష్టత ఉన్నాయి'

ఇక నవలలో వచ్చే అధ్యాయాల పేర్లు కూడా వినూత్నమైనవే!

వెలుగు మరక, మూగవోయిన వీణ, వుప్పొంగి పోనాది గోదారి, అనుభూతి సిగ్గెరుగదట, ప్రేమ వెర్రిబాగులదట, మరీచికాన్వేషణ, సశేషం జీవితం. ఇవన్నీ ఆయా భాగాలలో వచ్చే కథను క్లుప్తంగా ఒక మాటలో సూచించేవే.

మొత్తం 550 పేజీల నవలలో నాయికా నాయకులకు తప్ప ఇతరుల అంతరంగ ఆవిష్కరణ లేదు.

తెలుగులో ఇ ఈ ఉ ఊ ఋ వంటి అక్షరాలు వాడనే లేదు. అవి వాడాల్సి వచ్చినపుడు వొకేవొక, యెదురుచూపు, యేరు, యేడ్పు... ఇలా ఉంటాయి పద ప్రయోగాలు.

ఇక ఇందులో ఉన్న చైతన్య స్రవంతి గురించి ఎంత చెప్పినా స్థలం చాలదు. మచ్చుకి ఒక ఉదాహరణ పన్నెండవ పేజీలో గీతాదేవి అనుభూతి మీద చేసే ఆలోచనలో కనిపిస్తుంది.

హిమజ్వాలలో అనుభూతివాదపు ఛాయలు ఉన్నా, ఎక్కువ కనిపించేవి వైట్ హెడ్, సార్త్రే, యూంగ్ రచనల తాలూకు భావాలు. నవల చివరన 'అర్థానుస్వారం' అనే భాగంలో రచయిత తన ఆలోచనలను పంచుకున్నారు.

ఇందులో గీతకు తండ్రి పట్ల అవ్యాజనురాగంలో 'ఎలెక్ట్రా కాంప్లెక్స్', కృష్ణకున్న తల్లి ప్రేమలో 'ఈడిపస్ కాంప్లెక్స్' కనిపించిందని విమర్శకులు వ్రాసినా, నాకు ఆ ప్రభావం అలా అనిపించలేదు.

ఒకప్పుడు పూర్తి శృంగార వర్ణనలు అనిపించి ఇబ్బంది అనుకున్న ఈ నవల, నేటి కథలకంటే ఎక్కువ ఎబ్బెట్టుగా లేదనిపించింది. కాలం మన ఆలోచనల్లో ఎన్ని మార్పులు తెస్తుందో కదా!

సమాజంలో కొన్ని లోపాలను కొందరు ధైర్యంగా మన ముందుకు తెచ్చినపుడు చాలా సార్లు, చాలా సందర్భాల్లో వారిని దోషులుగా పరిగణించడం నేను గమనించాను.

'సమస్య పరిణామమే తిరుగుబాటు' అన్న సూత్రాన్ని మరచి సమస్యను పరిశోధించటం, పరిష్కరించటం మానుకుని, ఎదురెత్తిన గళాన్ని దూషించటం చరిత్రలో పలుమార్లు కనపడుతుంది. దీని వల్ల సమస్యకు పరిష్కారం దొరకకపోగా అది ముదిరి ఉత్పాతంగా మారిన దృష్టాంతాలు అనేకం. ఇది సాంఘికము, రాజకీయము, ఆర్థికము... అంశం ఏదైనా కావచ్చు, జరిగేది మాత్రం ఇదే.

కొన్ని కథలు, ఇంకొన్ని సినిమాలు, వ్రాసినా/తీసినా అర్థం చేసుకుని స్వీకరించే కాలానికంటే ముందే రావటం మూలాన వాటి గొప్పదనం నివురుగప్పిన నిప్పులా మసిబారిపోతుంది.

సమాజంలో పురుషునికి శృంగారం పట్ల ధ్యాస ఉంటే అది ఆసక్తి, అదే స్త్రీ కి ఉంటే యావ ఎలా అవుతుంది? ప్రేమ అంటే శృంగారం ఉండాలనుకునే మనం, పెళ్ళి అంటే మాత్రం దానికి ప్రాధాన్యత ఎందుకు ఇవ్వం ? రసస్పందన, రసానుభూతి లేని సంగమం ఏ విధంగా కోరుకోదగ్గది? ఇరువురి మధ్య సంయమనం, సమన్వయం, పొందిక, భావసారూప్యత ఉండాలా వద్దా? శృంగార అనుకూలత/అనుగుణ్యత (sexual compatibility) అవసరం లేదా? దానికి ఏ విధమైన విలువా ఇవ్వనవసరం లేదా?

ఇవి అన్నీ పుస్తకం చదివేటప్పుడు మదిలో ఉదయించే  ప్రశ్నలు. వ్రాసిన విధానమూ, మితిమీరిన వర్ణనలు, పాత్రల స్వభావాల్లో లోపాలున్నా, లేవనెత్తిన సమస్యల యొక్క వాడిని, వేడిని అవి తగ్గించలేవని నా ఉద్దేశ్యం.

అప్పారావు ముప్పాళ్ళ
https://qr.ae/pymqPh

## సామల సదాశివగారు ఎవరు? ఆయన రచనల ప్రత్యేకత ఏమిటి?

సామల సదాశివగారు వృత్తిరీత్యా ఉపాధ్యాయులు, ప్రవృత్తి రీత్యా సంగీత ప్రియులైన రచయిత. అంజద్ రుబాయిల తెలుగు అనువాదం, కేశవసూత్ అనే మరాఠా కవి జీవిత చరిత్ర, రూమీ 'మసనవి' అనువాదం, మీర్జా గాలిబ్ జీవితము- రచనలు, ఫారసీ కవుల ప్రసక్తి వంటి అంశాలపై 'సియాసత్' అనే ఉర్దూ పత్రికలో 300  వ్యాసాలు, ఇతర తెలుగు పత్రికల్లో 400 వ్యాసాలు  వ్రాసారు.

'మలయమారుతాలు (స్వరలయలు)',  'సంగీత శిఖరాలు', 'యాది'  అనే అనే వ్యాస సంకలనాలు వారికి ఎంతో పేరు తెచ్చినవి. ఇవి మొదట ధారావాహికలుగా ప్రచురింపబడి, తర్వాత కాలంలో  పుస్తక రూపంలో వచ్చాయి.

వీరికి తెలుగు విశ్వవిద్యాలయం నుంచి గౌరవ డాక్టరేట్, కేంద్ర సాహిత్య అకాడమీ (2011) పురస్కారంతో పాటు ఎన్నో సత్కారాలు జరిగాయి.

స్వరలయలు పుస్తకంలో హిందుస్తానీ గాయకుల జీవితాల పరిచయాలు, గానంలో ప్రత్యేకతలు, కచేరీలలో జరిగిన సంఘటనలను, ఒక చిత్రకారుడు బొమ్మ వేసిన రీతిగా, వివరంగా వ్రాయడం కనిపిస్తుంది. అవి చదివిన వారు ఆసక్తితో ఆ తరం గాయకుల యూట్యూబ్ వీడియోలు వెతికి చూడక మానరు. ఈ పుస్తకంలో స్వాతంత్ర్యం రాక మునుపు నుంచి మొదలుకుని ఆయా కాలాల్లో ప్రఖ్యాతి గాంచిన హిందుస్తానీ గాయకుల పేర్లు మనకు కనిపిస్తాయి.

బడే గులాం అలీ ఖాన్, కేసరీ బాయి, భీమసేన్ జోషి, బేగం అఖ్తర్, అబ్దుల్ కరీం ఖాన్, అలాదియాఖాన్... ఇలా గాయకులు, వారి ఘరానాలు, ఆ కాలపు 'బాయి'లని పేరు గాంచిన స్త్రీ గాయనీమణులు, వారి పద్ధతులు, 'తప్పా', 'ఘజల్, 'తుమ్రీ'ల విపులమైన వర్ణనలు కనిపిస్తాయి. ఆయా గాయకుల సంగీతం, అలాగే వారి వ్యక్తిత్వం, సంఘంలో వారి పట్ల చూపిన ఆదరాభిమానాలు, అవమానాలు అన్నీ ఈ పుస్తకంలో పొందుపరిచారు.

ముఖ్యంగా బేగం అఖ్తర్, బడే గులాం అలీ ఖాన్, 'మాలికా ఏ తరన్నుం(మెలోడీ క్వీన్ )' అని  పేరుబడ్డ నూర్జహాన్ వంటి ప్రసిద్ధ గాయకులు వీరి రచనలో సజీవమూర్తులై మన కళ్ళ ముందు కదలాడుతారు.

పాతతరం సినిమాలు, పాటలు కొత్త తరాలకు నచ్చక పోవడం వెనుక తరాల అంతరాలే కాక, వేగం కూడా ఒక కారణం కావచ్చు. సుశీలమ్మ పాటలకు అలవాటు పడ్డ మనం రావు బాలసరస్వతి, భానుమతి గార్ల పాటలు విన్నప్పుడు ఏదో ఇబ్బంది కనిపిస్తుంది. ఇది గాయకుల లోపం కాదు, శ్రోతల అసమగ్రత (inadequacy) అని అనిపిస్తుంది.

సమాజ గమనంలో వేగం పెరిగే కొద్దీ, ఈ వ్యత్యాసం విస్తారం అవుతూ వస్తుంది కాబోలు! అలాంటివే ఈ హిందుస్తానీ గాయకుల గానాలు కూడాను. వారి కౌశలము, గానమాధుర్యం మనం అంచనా వేయలేము.

అందుకే విని ఆనందించని వారికి, చదివి ఊహించుకోడానికి, ఆ కాలంలో కచేరీల అనుపానులు తెలుసుకోవాలనుకునే సంగీత ప్రియులకు సామలగారి పుస్తకం చక్కని పసందైన విందు భోజనం. ఆయన శైలి విభిన్నంగా ఉంటుంది. చక్కని తెలంగాణ నుడికారంలో గాయకులను, ఘరానాలను, ఆ కాలపు కచేరీలను, వాటిలో పాడే గీతాలను చెప్తూ ఉంటే, మనం ఆయన చేయిపట్టుకుని ఆ కాలానికి టైం ట్రావెల్ చేసిన అనుభూతి కలుగుతుంది. ఒక వ్యాసంలో కృష్ణుడిపై గీతాలను వర్ణిస్తారు. అందులో పాడేవి గోపికల విరహ గీతాలు. అవి పాడేది గాయకుడైనా, గాయని అయినా, వినేవారికి వారి రూపం మాయమై, యమునా నది పక్కనే కూచుని పాడుతున్న గోపికయే ప్రత్యక్షం అవుతుందట.

ఉస్తాద్ బడే గులాం అలీఖాన్ భారీ ఆకారంతో పెద్ద పెద్ద మీసాలు ఉన్న గాయకుడు. ఆయన పాడుతున్నా కూడా అసలాయన అక్కడ కనిపించడం మానేస్తాడట. ఆయన గొంతులో పలుకుతున్న ఆర్తి, వ్యథ, మనని ఎక్కడికో తీసుకు పోతుందని రచయిత వ్రాస్తారు. పాడుతున్నప్పుడు తన్మయత్వంతో కళ్ళవెంట నీళ్ళు కారుతూ గోపికలా దుఃఖించే పర్వీన్ సుల్తానాని మన మనోఫలకంపై కన్నీటి చారికలతో ప్రత్యక్షం చేస్తారు.

చరిత్ర పుటలలో మరుగున పడిపోయిన హిందూస్తానీ ఘరానాలను, వాటిలో ఘనమైన గాయకులను వారి వారి ప్రత్యేక శైలులు, వేషభాషలు, ఆచార వ్యవహారాలను పూస గుచ్చినట్టు, ముంగిలిలో ముగ్గు వేసినట్టు వ్రాయడం ఆయన ప్రత్యేకత.

కేవలం సంగీత రచన వరకే కాదు, ఉర్దూ సాహిత్యం, తెలుగు సాహిత్యంలో కూడా వారి జ్ఞానం అపారం.

సామల వారి 'యాది' రచనని పరికిస్తే ఎందరో లబ్ధప్రతిష్టులైన రచయితల, కవుల ప్రసక్తి కనిపిస్తుంది. కవుల వ్యక్తిత్వమూ మన కనుల ముందు కదలాడుతుంది. వేలూరి శివరామశాస్త్రి, హరిప్రసాద్ చౌరాసియా, కాళోజీ, తిరుపతి వేంకట కవుల లాంటి మాన్యులు, ప్రసిద్ధుల నడుమ కొసరి కొసరి వడ్డించే చింతల నర్సమ్మ (పూటకూళ్ళ సత్రం ఆవిడ) కూడా కనిపిస్తుంది. ఈ జ్ఞాపకాల మాలికలో మాన్యులు, సామాన్యులు చెట్టాపట్టాలేసుకుని వారి వారి వ్యక్తిత్వాలతో మనని అబ్బుర పరుస్తారు. ఈ పుస్తకంలో ఆనాటి ఆర్థిక, సామాజిక వాతావరణం, సుస్పష్టంగా మనుషులలో, మాటల్లో వ్యక్తం అవటం మనం గమనిస్తాము.

'యాది' ఒక జీవితగాథ కాదు, అదొక జీవిత చిత్రం. కదుల్తూ, మనల్ని కదిలించే పుస్తకం.

** ఘరానా : గ్వాలియర్, జైపూర్, ఆగ్రా లాంటి ప్రదేశాల్లో కొందరు గాయకులు ఏర్పరిచిన సాంప్రదాయ సంగీత విధానం. ఇది పారంపర్యంగా వారి శిష్యులచే పాటింపబడి పేరు తెచ్చుకున్న విశిష్ట గాత్ర శైలి.

అప్పారావు ముప్పాళ్ల
https://qr.ae/pyM4zd

## తెలుగులో రైల్వే నేపథ్యంలో వ్రాసిన రెండు నవలలు 'విజయవాడ జంక్షన్', 'రైల్వే జంక్షన్'లను చదివారా? ఆ నవలల మీద మీ అభిప్రాయం ఏమిటి?

మనందరికీ జీవితంలో అతి సుపరిచితమైన అనుభవం రైలు ప్రయాణం. అందువల్ల ఈ నవలల ఇతివృత్తం అందరినీ బాగా ఆకట్టుకుంటుంది. రైల్వే నేపథ్యంలో తెలుగులో చాలా నవలలు వచ్చి ఉండవచ్చు. అయితే పైన పేర్కొన్న రెండింటిలో ఒక రైలు ప్రయాణంలో జరిగే ఆకస్మిక దుర్ఘటన, దానికి కారణాలు, దానిని ఎదుర్కొనే వ్యక్తులు, ఆ క్రమంలో ఎదురయ్యే ఇతర సంఘటనలు వంటి వర్ణన ఉంటుంది.

మొత్తం రెండు నవలలోనూ ఇతివృత్తం ఒకటే అయినా కథనం, ఎత్తుగడ వేరు. 'రైల్వే' అనేది మనకందరికీ బయటికి ఒకటే సంస్థలా అనిపించినా ఇందులో బోలెడు శాఖలు, ఉద్యోగుల మధ్య తెలీని అడ్డంకులు, అపార్థాలు కూడా ఉంటాయి.

ప్రమాదాల సమయంలో రైల్వే ఉద్యోగులు ఎలా స్పందిస్తారు, వారికున్న పరిమితులను దాటి ఎలా వ్యవహరిస్తారనే కోణాన్ని ఈ నవలలు కళ్ళకి కడతాయి.

ఈ రెండు నవలల్లో విజయవాడ స్టేషన్‌కు గల ప్రాధాన్యత కథకి పునాది. రెంటిలోనూ తుఫానే పెద్ద ప్రతిబంధకం. రెంటిలోనూ రైళ్ళు చిక్కుకునే కథే!

ఇందులో 'విజయవాడ జంక్షన్' రచయిత ఘండికోట బ్రహ్మాజీరావుగారు  రైల్వే ఆఫీసర్ పదవిలో పనిచేసి రిటైర్ అయ్యారు. 1983లో ఈ నవల ఆంధ్రజ్యోతి వారపత్రికలో సస్పెన్స్ నవలల పోటీలో మొదటి బహుమతి గెలిచి ధారావాహికగా ప్రచురించబడింది.

స్థూలంగా కథ: కాజీపేట నుండి విజయవాడ వెళ్తున్న గూడ్స్ రైలు కేసముద్రం దాటాక తుఫాను కారణంగా ప్రమాదంలో చిక్కుకుంటుంది. 40 బోగీలు, ఇంజిన్ నీటిలో మునిగిపోతాయి.

ఇక అక్కడి నుండి ఆ సంఘటన ఏ విధమైన మలుపులు తిరిగిందనేదే సస్పెన్సు. కథలో శ్రీనివాసమూర్తి అనే ఆఫీసర్, అతని అన్న కేశవయ్య అనే డిప్యుటీ కంట్రోలర్, తుఫాను వల్ల పాడైన ట్రాక్ సరిచేసి రైళ్ళను పునరుద్ధరించే పనిలో పడతారు.

ఇదే సమయంలో ఢిల్లీలో బయలుదేరిన గ్రాండ్ ట్రంక్ ఎక్స్‌ప్రెస్‌లో ఆగంతకులు ముగ్గురు వ్యక్తుల ప్రమేయంతో ఒక పెట్టెలో బాంబు అమరుస్తారు. రాణీ మోహినీ దేవి, కుమారరాజా, జస్బీర్‌సింగ్‌ల మధ్య నడిచే ప్రేమ-మోసం-పన్నాగం కారణంగా కొన్ని రేసుగుర్రాలు, వాటితో ఎన్నో అమాయక ప్రాణాలు బలి అయ్యే ముప్పు వస్తుంది. ఇక ఆ రైలులోనే లోకో డ్రైవర్ వెంకటనారాయణ, ఎంతోకాలంగా కలుసుకోవాలనుకునే అతడి ప్రేయసి పెరియనాయకి కూడా ఉంటారు.

పట్టాల మరమ్మత్తు చేస్తున్నందువల్ల ఆ రైలు వరంగల్లు తర్వాత ఆగవలసి ఉండగా, దోపిడీ దొంగ గబ్బర్‌సింగ్ రైలుని హైజాక్ చేస్తాడు. ఆ క్రమంలో రైలు డ్రైవర్ గాయపడతాడు. మరి ఇన్ని మలుపుల మధ్య తరువాత ఏమి జరుగుతుందనేది తెలియాలంటే నవల చదవాలి.

ఇందులో ముఖ్యంగా ఆపరేటింగ్ విభాగం, అంటే డ్రైవర్, గార్డ్, స్టేషన్ మాస్టర్, డివిజన్ పరిధిలో ఉద్యోగులను సూచనల ద్వారా నడిపించే కంట్రోలర్, వారికి ఆదేశాలు ఇచ్చే ఆఫీసర్ పనిచేసే విధానం సుస్పష్టంగా వర్ణించడం కనిపిస్తుంది. ఏదైనా ప్రమాదం జరిగితే రైల్వే యంత్రాంగం స్పందించే తీరు, గ్యాంగ్‌మెన్ మొదలుకుని క్రేన్‌డ్రైవర్‌ల వరకు ఎవరెవరి పాత్ర ఎలా ఉంటుందో సవివరంగా రచయిత వర్ణిస్తారు. పాత్రల చిత్రణ, సన్నివేశాలు ఉత్కంఠ రేకెత్తిస్తాయి.

రెండో నవల 'రైల్వే జంక్షన్' రచయిత యర్రంశెట్టి శాయిగారు. ఈయన కూడా రైల్వే ఉద్యోగియే. హాస్యకథలకు వీరు చాలా ప్రసిద్ధి.

సూక్ష్మంగా నవల ఇతివృత్తం: ఆంధ్రాలో తుఫాను గండాలు మామూలే. అలాంటి తుఫాను వచ్చినపుడు రైళ్ళ రాకపోకలు గందరగోళంలో పడిపోతాయి. ఆ సందర్భంలో డ్యూటీలో ఉన్న ఒక డివిజనల్ రైల్వే అధికారి రావు, అతను జీవితం పంచుకోవాలనుకుంటున్న చంద్రకళ(ఆమెకు ఇంకొకరితో పెళ్ళి ఖాయమవుతుంది), మధ్యలో రావు కూతురు కథలో ఆసక్తి పెంచుతారు.

ఇంకో ఆఫీసర్ మహీధర్ - అతను కావాలనుకుంటున్న ప్రియురాలు తులసి ఇందులో కనిపించే ముఖ్య పాత్రలు. వీళ్ళను కలవనీయని తుఫాను, దానివల్ల వచ్చిన సమస్యలు, ఓ పక్కేమో వదలలేని ఉద్యోగబాధ్యతలు...

చిన్నాపురం అనే స్టేషన్ దగ్గర బుడమేరు కాలువ పొంగటంతో అందులో చిక్కుకున్న ప్యాసెంజర్ బండిలో స్కూలు పిల్లలు, వారి మధ్య ఇద్దరు ప్రేమికులు భవానీశంకర్ -స్వప్న, కొంచెం హైప్ కోసం గుండె సమస్య ఉన్న సుహాసిని అనే చిన్న పాప కూడా ఉంటారు.

ఈ తుఫానులో చిక్కుకున్న వారందరినీ ఎలా రక్షిస్తారు, ఆ పాపకు గుండె ఆపరేషన్ ఎలా చేయాలి, మిగతా రైళ్ళను ఎలా సరిదిద్దాలి? విజయవాడ స్టేషన్‌లో చిక్కుకుపోయిన ప్రయాణీకుల ఆకలి ఎలా తీర్చాలి... ఇవన్నీ చిక్కుముడులు. వీటి మధ్య ప్రేమ కోణాలు. ఇవన్నీ దాటుకుని చివరికి కథ ఎలా సుఖాంతమవుతుందో తెలియాలంటే నవల చదవాలిగా మరి.

ఇందులో శాయి మార్కు గాలం వేసే ప్రియుడు, వద్దనుకుంటూనే పడిపోయే ప్రేయసి,  మతిమరుపు స్టేషన్ మాస్టర్ రంగనాయకులు, ఆపద్బాంధవుడు రామ్మోహన్, తుఫానును వివరించే మెట్రాలజీ ఉద్యోగి అరుణ... ఇలా ఎన్నో పాత్రలు. నరాలు తెగే సస్పెన్స్ అనలేం కానీ సరదా సరదాగా సాగిపోతూ ఉండే నవల ఇది.

రెంటిలోనూ ఆపదల్లో రైల్వే యంత్రాంగం ఎలా స్పందిస్తుంది అనే వివరణ ఉంది. అందరూ ఒకేలా ప్రాణాలకు తెగిస్తారు అని అనకుండా, మొండికేసే పాత్రలు, తప్పించుకునే పాత్రలు, తప్పించుకోలేక ఇరుక్కుపోయే పాత్రలు, ఎలాగూ చేయాలిగా అని చేసేవి... ఇలా అన్ని పాత్రల స్వభావాల్ని వర్ణించటం బాగుంది. మనుషులంతా ఒక్కలా ఉండరుగా!

మొత్తంగా కొంత అవగాహన, మరి కొంత వినోదం కలిపిన రెండు నవలలు.

ఇలాంటిదే ఇంకో నవల 'ఎయిట్ డౌన్'. బ్రేకు పడని గోదావరి ఎక్స్‌ప్రెస్‌లో జరిగే సంఘటనలు ఈ నవల ప్రధాన ఇతివృత్తం. అయితే ఇది పైన పేర్కొన్న రెండు నవలల స్థాయిలో ఆకట్టుకోలేదనే చెప్పాలి.

అప్పారావు ముప్పాళ్ల
https://qr.ae/pyMMTj

## జీవితంలో చదవదగ్గ పుస్తకాలు కొన్ని చెప్పగలరా?

మొదట జీవితాన్ని కొన్ని దశల వారీగా వర్గీకరించాలి. అందుకే ఒక్కో దశకి తగిన పుస్తకాలు సూచిస్తున్నాను.
సాధారణ చర్చ కోసం ఇలా ఊహించుకుందాం:

1. బాల్యం (0-14)
2. కౌమార (15-20)
3. యవ్వనం (21-30 )
4. నడివయసు (31 -59)
5. వార్ధక్యం (60+)

వీటిలో తరగతి గదిలో చదవవలసిన పుస్తకాలు చేర్చడం లేదు. కేవలం తెలుగులో మాత్రమే కాక ఇంగ్లీషుని కూడా ప్రస్తావించక తప్పలేదు.

**బాల్యం:**
దీన్ని రెండు భిన్న ఉప దశలుగా భావిస్తే, తొలి భాగంలో, అక్షరాలు, మాటలు, చిన్న పదాలు వగైరా మాత్రమే పిల్లలకు చెప్పగలం. అప్పుడు వారికి మీరు చదివి,చూపి, నేర్పేవే ఉంటాయి. తెలుగు పద్యాలూ, ఇంగ్లీష్ రైమ్స్ వీటికి ఎనిమేషన్‌తో నేర్పే వీడియోలు బోలెడు. కొద్దిగా, నాలుగు ముక్కలు చదవగలిగిన, పిల్లలు దేనితో మొదలెట్టాలి అంటే, రంగు బొమ్మలతో ఉన్న, కథల పుస్తకాలు పిల్లల్ని బాగా ఆకట్టుకుంటాయి. పాతకాలపు 'బాలమిత్ర', 'చందమామ', 'బుజ్జాయి' వీటిలో నీతి ఉన్న కథలు, మీరు చూపుతూ, చదివి వినిపిస్తే ముందు ముందు, వాళ్ళే చదివి అలవాటు చేసుకుంటారు.

ఇవి కాక బొమ్మల భారతం, భాగవతం, కృష్ణ లీలలు, వీరుల కథలు, విజ్ఞాన శాస్త్రవేత్తలు, స్వాతంత్ర పోరాట నాయకులు...ఇలాంటివి 'బాలానంద' పేరుతో బొమ్మల పుస్తకాలుగా దొరుకుతున్నాయి. ఇవి కాక పంచతంత్ర కథలు, నీతి మంజరి ఇలాంటివి అలవాటు చేయవచ్చు. ఇక ఇంగ్లీష్‌లో 'ఆదర్శచిత్రకథ, అమరచిత్రకథ' పేరుతో చక్కటి పిల్లల బొమ్మలపుస్తకాలు విభిన్న విషయాల మీద దొరుకుతాయి. ఇవే కాకుండా 'డార్లింగ్ టన్ కిన్దర్స్లే' (Dorlington Kindersley, DK) పుస్తకాలు అద్భుతమైన విజ్ఞాన వినోద భాండాగారాలు.

తర్వాతి ఉపదశలో పిల్లల అవగాహన పెరుగుతుంది. వీళ్ళు తరగతి గదిలో నేర్చుకున్న అవగాహనతో కొత్త విషయాలు నేర్చుకునే ఆసక్తితో ఉంటారు. ఇంగ్లీషులో 'క్లాసిక్స్ ఇల్లస్ట్రేటెడ్' అని 'మార్వెల్ ఇల్లస్ట్రేటెడ్' అని, 'సేడిల్ బాక్ ఇల్లస్ట్రేటెడ్ కామిక్స్' పుస్తకాలు ఉంటాయి. వీటిలో పెద్ద పేరున్న ఇంగ్లీష్ పుస్తకాలను, బొమ్మలతో విసుగు అనిపించకుండా, కుదించి వ్రాసారు. ఇవి వాళ్ళకు షేక్స్పియర్, డికెన్స్ వంటి రచయితలపై ఆసక్తి రేకెత్తిస్తుంది.

ఇక తెలుగులో విక్రమార్క కథలు, తెనాలి రామకృష్ణ, ముల్లా నసీరుద్దీన్ కథలు, శివాజీ, బోస్ వంటి వారి చరిత్రలు, తెలుగులో అనువదించిన గల్లివర్ యాత్రలు, ఆలిస్ ఇన్ వండర్లాండ్ కథ వంటివి, పైన చెప్పిన DK బుక్స్‌లో eyewitness సిరిస్ - ఇవి ఏకరూపత ఉన్న సిరీస్ అంటే సముద్రం, గుర్రం, గ్రీకులు వగైరా.

ఇవి కాక గ్రీక్ యోధుల గాథలు, ఇలియాడ్, ఎనియాడ్, హెర్క్యులిస్, అట్లాస్ వంటి వీరులు, కొంచెం మన ఇతిహాసాలు, వాటిలో ఉన్న యోధుల కథలు పరిచయం చేయవచ్చు.

వెంకట రమణ గారి బుడుగు, మొక్కపాటి వారి గణపతి ,బారిస్టరు పార్వతీశం కూడా మలిదశ అంతానికి వారు అర్థం చేసుకోగలరు.

**కౌమార:**

ఈ దశ జీవితంలో చాలా ఉద్వేగంతో ఉండే దశ. బాల్య యవ్వన మధ్య స్థితి. ఉద్రేకం పాలు ఎక్కువ. సెల్ఫ్ హెల్ప్ బుక్స్ వీరికి కావాలి కానీ, చదివే నిలకడ, ఓపిక ఉండవు. మార్వెల్ హీరోస్ దశ ఇది. ప్రపంచాన్ని రక్షించే ఏ హీరో అయినా వీరికి నచ్చుతాడు. 'ప్రపంచాన్ని మార్చివేసిన పుస్తకాలు', 'ప్రపంచాన్ని మార్చివేసిన ఆవిష్కరణలు' ఇలాంటి ఆసక్తిదాయక టైటిల్ ఉండేవి, సాహస భరితమైన గాథలు నచ్చే వయసు. అంటే జమాంజి లాంటివి, టైం మెషిన్ జర్నీ లాంటివి బాగుంటాయి.

ఇంగ్లీష్‌లో ఇలాంటివి బోలెడు కాల్పనికగాథలు దొరుకుతాయి. తెలుగులో ఇలాంటివి కొంచెం తక్కువే. తర్జుమా చేసిన ఇలాంటి సైన్సు ఫిక్షన్ పుస్తకాలు, ఇతరత్రా విజ్ఞాన పరమైన ఎన్సైక్లోపీడియా, వగైరా వీరికి చూపించవచ్చు.

**యవ్వనం:**

ఈ దశ చదువు ముగిసి జీవితంలో స్థిరపడే తొలి భాగం. పైగా హార్మోన్ల అల్లరి. ప్రేమ ఎక్కువగా ఆకర్షిస్తుంది. ముఖ్యంగా కవిత్వం బాగా ఇష్టపడే వయసు.

తిలక్ 'అమృతం కురిసిన రాత్రి', కృష్ణశాస్త్రి 'కృష్ణ పక్షము' లాంటి కవిత్వం చదవచ్చు. కాల్పనికతను ఇష్టపడటం కూడా ఉంటుంది. యండమూరి, మల్లాది, యద్దనపూడి, మాదిరెడ్డి, సూర్యదేవర వంటి వారి నవలలు అభిరుచిని బట్టి చదవవచ్చు. డిటెక్టివ్ సాహిత్యం ఇష్టపడేవారు మధుబాబు, కొమ్మూరి, పానుగంటి వంటి రచయితల పుస్తకాలు ప్రయత్నించవచ్చు.

ఇంగ్లీషులో జేమ్స్ హాడ్లీ చేజ్, అగాథ క్రిస్టీ, సర్ ఆర్థర్ కానన్ డయల్(షెర్లాక్ హోమ్స్) నవలలు పరిశోధక సాహిత్యానికి ప్రసిద్ధి. తెలుగులో సైన్సు ఫిక్షన్ కొంతవరకు ఎన్ ఆర్ నంది, మల్లాది, యండమూరి కొన్ని నవలల్లో వ్రాసారు. ఎన్ ఆర్ నంది అతీంద్రియ శక్తులపై వ్రాసిన 'దృష్టి' నవల, యండమూరి 'అష్టావక్ర', మల్లాది 'నత్తలొస్తున్నాయి జాగ్రత్త' వంటివి మచ్చుకు కొన్ని.

జూల్స్ వెర్న్ ఇంగ్లీష్‌లో కాల్పనిక వైజ్ఞానిక రచయిత. అరౌండ్ ది ఎర్త్ ఇన్ 80 డేస్, 20,000 లీగ్స్ అండర్ ది సీ, మిస్టీరియస్ ఐలాండ్, జర్నీ టు ది సెంటర్ ఆఫ్ ఎర్త్ ఇలాంటి ఎన్నో కథలకు జీవం పోసాడు. ఇక కొంచెం ఉద్రేకపూరితమైన విప్లవవాద పుస్తకాలు కమ్యూనిస్ట్ మేనిఫెస్టో, చేగువేరా, ఫిడేల్ కాస్ట్రో, రష్యా, ఫ్రెంచ్, చైనా విప్లవ గాథలు, మాక్సిం గోర్కీ 'అమ్మ', భగత్‌సింగ్, సుభాష్ చంద్రబోస్, తెలంగాణా సాయుధ పోరాటం, భారత స్వాతంత్ర్య పోరాటం లాంటి పుస్తకాలు ఆకర్షిస్తాయి.

**నడివయసు:**
ఇప్పుడు రక్తం ఉడుకు తగ్గి కొంచెం నెమ్మదిగా పరుగెడుతుంది. ఆలోచన, అవగాహన విస్తృతం అవుతుంది. చదివే పుస్తకాల లిస్టు పెరుగుతుంది.

ప్రాచీన కవుల పుస్తకాల నుంచి ఆధునిక కవుల దాకా కవిత్వం, కథ, నవల, ఆత్మకథ, వంటి ప్రక్రియలు, ఎందరో గొప్ప సాహితీ వేత్తల పుస్తక పరిచయం, వారి రచనల పఠనం అందుబాటులో ఉంది. శ్రీశ్రీ, ఆరుద్ర, తిలక్, విశ్వనాథ, చలం లాంటి నవయుగ రచయితలు, కవిత్రయం పోతన, శ్రీనాధుని వంటి ప్రాచీన కవుల రచనలను లేదా కనీసం వారిపై వ్రాసిన వ్యాసాలను చదివి ఆపై వారి గ్రంథాలను చదివే కృషి చేయాలి. ఇందుకు కొద్దిగా కష్టపడాలి.

**వార్ధక్యం:**
ఈ సమయంలో బోలెడంత సమయం ఉంటుంది, కానీ చదవడానికి ప్రశాంతత ఉండదు. అనారోగ్య సమస్యలు, సన్నిహితుల మరణాలు,స్నేహితుల లేమి వంటివి బాధిస్తున్నప్పుడు ఆధ్యాత్మిక పుస్తకాలు ఈ సమయంలో దారి చూపుతాయి. ఇతిహాసాలు, పురాణాలు, సంప్రదాయాలు, రామకృష్ణ మిషన్ ప్రచురణలు, యోగుల చరిత్రలు, జెన్ గాథలు, ఇవి గాక పాజిటివ్ దృక్పథమున్న పుస్తకాలు - మిమ్మల్ని మీరు గెలవగలరు వంటివి, ప్రాచీన గ్రంథాలు, భక్తికి ఆధ్యాత్మిక సాధనకు ఉపకరిస్తాయి.

ఇందులో ప్రస్తావించని వారు తక్కువ వారు కాదు. సమాధానం నిడివి దృష్ట్యా కొందరిని మాత్రమే పేర్కొన్నానని గమనించండి.

చివరిగా వికీ వారి పట్టిక ఒకటి ఉపయుక్తం గా ఉంటుందేమో చూడండి:
ముఖ్యమైన తెలుగు పుస్తకాల జాబితా - వికీపీడియా

అప్పారావు ముప్పాళ్ల
https://qr.ae/pvc7rX

# సినిమాలు

## తెలుగు సినిమాల గురించి వివరాలు పూర్తి స్థాయిలో ఎక్కడ దొరుకుతాయి?

తెలుగు సినిమాలే కాదు, మొత్తంగా భారతీయ భాషల సినిమాల్లో చాలావరకూ వివరాలు చక్కగా దొరికే చోటు http://indiancine.ma అన్న ఆర్కైవ్. నాకు దీని గురించి 'సెంటర్ ఫర్ ఇంటర్నెట్ అండ్ సొసైటీ'లో పనిచేస్తూండగా 2016 ప్రాంతంలో తెలిసింది. అప్పుడే దీన్ని అభివృద్ధి చేస్తున్నారు (పెట్టింది 2013లో). గొప్పగా ఎగ్జైట్ అయ్యాను.

భారతదేశంలోని ఏ ఇతర ప్రయత్నంలాగానే దీని గురించి కూడా "ఇది ఫిల్మ్ ఆర్కైవ్స్ వంటి ఒక ప్రభుత్వ సంస్థ చేయదగ్గ కృషి" అని చెప్పవచ్చు. కానీ, వాళ్ళు ఎలాగూ చెయ్యరు కాబట్టి దీన్ని కూడా కొందరు ఫిల్మ్ స్టడీస్ అధ్యాపకులు, రీసెర్చర్లు చేసారు.

దీనిలో చాలా రకాల యూజ్ కేసులు ఉన్నాయి:

1. సినిమాల గురించిన డేటా: అంటే దర్శకులు, నిర్మాతలు, ఫిల్మ్ కంపెనీలు, నటీనటులు, సంగీత దర్శకులు, పాటలు వగైరా ఉంటాయి. వీటిని బ్రౌజ్ చేయడానికి మొదట్లో చాలా తికమక ఉండవచ్చు. కానీ, మీకు ఆసక్తి, అవసరం ఉంటే కొంత సేపటికి పట్టేయగలరు. ఆ పైన, మీరు సినిమాల గురించి తెలుసుకోవాలన్న ఆసక్తి ఉన్నవారైతే ఎంతసేపైనా అలా సంవత్సరం, భాష మార్చుకుంటూ సినిమాల ఇన్ఫో చదువుతూ ఉండిపోతారంతే!

2. 1930ల నుంచి ఈనాటి వరకూ చాలా సినిమాలను ఇందులో ఆర్కైవ్ చేసారు. వీటిలో 1960లోపు విడుదలైన సినిమాలను ఏ లాగినూ లేకుండా చూడవచ్చు. కాపీహక్కులు ఉండడంతో ఆపైన విడుదలైన సినిమాలు చూడాలంటే మీరు లాగిన్ అయి, ఎడిటింగ్ హక్కుల కోసం కోరి ఉండాలి.
    a. ఇక్కడే చెప్పవలసిన మరొక యూజ్ కేస్ ఏమిటంటే, మీరు గనుక సినిమాలను అధ్యయనం చేసే దృష్టితో చూసేవారైతే మీకు ఇదొక అద్భుతం అనిపించక మానదు. కొన్ని ఫిల్మ్ స్టడీస్ చేసేవారు వీడియోల్లో సబ్-టైటిలింగ్ చేసి, పక్కన నోట్స్ నమోదుచేసారు. ఉదాహరణకు నాకు దీన్ని పరిచయం చేసిన మా పాత మేనేజర్ తన్వీర్ హాసన్, మరో మిత్రునితో కలిసి కన్నడ సినిమా అయిన 'బంగారద మనుష్య' ని ఆమూలాగ్రం అనొటేట్ చేసారు. ఆ సినిమాలో కథ నడుస్తూ ఉన్నప్పుడు దానికి సంబంధించిన సామాజిక, చారిత్రక వివరాలు, అవి చూపించిన ప్రభావం, సాంకేతిక వివరాలు, ఇతర ఫిల్మ్ స్టడీస్ సంబంధిత విశేషాలు వంటివి పక్కన ఉంటాయన్నమాట. వీటికి రిఫరెన్సులు, సైటేషన్లు కూడా ఇస్తారు. దీన్ని ఎడిట్ చేయడానికి ఎడిటింగ్ హక్కులు ఇవ్వాలి మనకు. నాకూ ఎడిటింగ్ హక్కులు

ఇచ్చారు. మన "మిస్సమ్మ" (1955) సినిమాను ఇలా సమగ్రంగా యానొటేట్ చేయాలన్న ఉత్సుకతతో మొదలుపెట్టాను. తీరా చూస్తే ఏమీ చేయలేదనుకోండి.

b. ఒక ప్రాజెక్టుగా తీసుకుని ఒక సినిమా రంగంలో వివిధ సినిమాల్లో తిరిగి తిరిగి వచ్చే థీమ్స్ కొందరు సినిమా స్టడీస్ విద్యార్థులు, అధ్యాపకులు అనొటేట్ చేసి, లిస్టులు తయారు చేస్తున్నారు. ఉదాహరణకు: భారతీయ సినిమా నవతరంగానికి సంబంధించిన సినిమాలన్నిటినీ ఈ క్రింద ఇచ్చిన లింకులో లిస్టు చేసారు చూడండి.
https://indiancine.ma/grid/year/list==ashish:The_New_Cinemas_project
అలాగే, కేరళ నుంచి అరేబియన్ గల్ఫ్ దేశాలకు 70ల నుంచి వలసలు ఎందరో వెళ్ళారు. మలయాళం సినిమాల్లో పూర్తిగా గల్ఫ్ జీవితాలను చూపించడం అరుదే అయినా, గల్ఫ్ రిఫరెన్సులు బోలెడట. ఈ రిఫరెన్సులు ఉన్న సినిమాలను "గల్ఫ్ ఇన్ మలయాళం సినిమా" అని ఒక లిస్ట్ చేసారు. ఆ లింక్:
https://indiancine.ma/grid/year/list==shafeeq.vly:Gulf_in_Malayalam_cinema
మనకు కూడా ఓపిక ఉంటే తెలుగు సినిమాల్లో ఉమ్మడి కుటుంబ సమస్యల కేంద్రమైన సినిమాల నుంచి టీనేజీ ప్రేమకథల వరకూ రకరకాల లిస్టులు తయారుచేయవచ్చు. అలాగే, స్వర్ణయుగం అని మనం చెప్పుకునే 1940-65 సినిమాల లిస్టూ వేయవచ్చు. (వేయలేదనుకోండి, ఎవరూ.. నాతో సహా)

3. సినిమాలకు సంబంధించిన పోస్టర్లు, పాటల పుస్తకాలు, రివ్యూలు - ఇలా సమస్తమైన మెటీరియల్ ఇక్కడ లభ్యమవుతుంది.

4. ఆశిష్ రాజధ్యక్ష, పాల్ విల్మాన్ అభివృద్ధి చేసిన 'ఎన్సైక్లోపీడియా ఆఫ్ ఇండియన్ సినిమా' అన్న ప్రాజెక్టును దీనిలో ఇంటిగ్రేట్ చేసారు. తత్ఫలితంగా 1890ల్లో భారతదేశంలో తీసిన మూకీ షార్ట్స్ నుంచి మొదలుకొని తెలుగు, తమిళం, హిందీ, అన్న భాషాభేదాలు లేకుండా పలు భాషల సినిమాలు, సినిమా వ్యక్తులు, సంస్థల వివరాలు క్లుప్తంగా, సరళంగా, అవసరమైనంత వివరంగా వ్రాసినవి ఇందులో దొరుకుతాయి. మనం ఒక సినిమా వివరాలపై క్లిక్ చేసినప్పుడే అందులో క్రమేపీ కిందివరకూ చెప్పుకోదగ్గ వ్యక్తులు దానికి పనిచేసి ఉంటే వారి వివరాలన్నీ ఇన్ఫో మోడ్ లో కనిపిస్తాయి.

వ్యక్తిగత ఆసక్తితో నేను తెలుగు సినిమా చరిత్రను అధ్యయనం చేసి, రాసుకుంటున్న క్రమంలో ఈ వెబ్సైట్ నాకెంతగా ఉపయోగపడిందో నేను చెప్పలేను. మీకు ఈ విషయాలపై ఏమాత్రం ఆసక్తి ఉన్నా ఒక్కసారి ఇందులోకి దిగి చూడండి, దీని గురించి మీకు తెలియడం నా ద్వారానే అయివుంటే మీరు నాకు ధన్యవాదాలు చెప్పి తీరతారు.

పవన్ సంతోష్ సూరంపూడి
https://qr.ae/pyiHSB

---

## మీరు కార్తీ నటించిన యుగానికి ఒక్కడు సినిమా చూశారా? అందులో చూపించిన చోళుల విషయాలు కల్పితాలా?

సినిమా మొదటి సీన్‌లో వీధినాటకం ద్వారా మనకి కథ యొక్క మూలాన్ని మొత్తం వివరించేసాడు డైరెక్టర్. అలా 800 ఏళ్ళ క్రితం జరిగిన సంఘటనను ఆధారం చేసుకుని పూర్తి కథను నడిపించిన తీరు చాలా అద్భుతంగా ఉంటుంది.అంతేకాకుండా ఫస్ట్ హాఫ్ లో ఆ చోళ రాజులు కల్పించిన 8 అడ్డంకులను (సముద్రం, ఆటవికులు, రక్షకదళం, సర్పం, ఊబి, ఆకలి, దాహం, గ్రామం) గురించి కూడా ఒక్కొక్కటిగా చాలా చక్కగా కథలో చూపించారు డైరెక్టర్.

ఇక ప్రశ్నలోని రెండవ భాగానికి వస్తే, సినిమాలో చూపించినట్టుగా చోళులకు పాండ్యులకు ఉన్న వైరం, పాండ్యులు చోళులను ఓడించడమూ నిజమే. సినిమాలో చూపించిన మిగతాదంతా మాత్రం కల్పితం. కాకపోతే, ఈ సినిమాలో 'తాయ్ తిన్ద్ర మణ్ణే' అనే పాట గురించి ప్రత్యేకంగా ప్రస్తావించాలి.

నిజానికి తమిళ వెర్షన్లో ఈ పాటలో కొంతభాగం తెలుగు సాహిత్యం ఉంటుంది. చోళ రాజును మెప్పించి అతనితో శృంగారం సలపడానికి పాండ్య యువతి అయిన అనిత(రీమాసేన్) తెలుగులో పాట పాడుతుంది. కానీ వందల సంవత్సరాల క్రితం భారత భూభాగాన్ని వీడి ఎక్కడో మారుమూల ద్వీపంలో తలదాచుకుంటున్న చోళులకు తెలుగు అర్థమౌతుందో లేదో అన్న విషయాన్ని పక్కన పెడితే ఈ పాట ద్వారా ఆ పాండ్య యువతి చోళ రాజును అపహాస్యమాడి కించ పరచాలనే ఉద్దేశ్యంతోనే అన్నది డైరెక్టర్ సెల్వరాఘవన్ యొక్క బుద్ధికుశలత అనే చెప్పొచ్చు.

ఇదేమి చోద్యం, తెలుగులో పాడితే కించపరచడం ఏమిటని అనుకుంటున్నారా! అదెలాగంటే ఈ విషయాన్ని చర్చించడానికి ముందు మనం చోళుల చరిత్రను క్లుప్తంగా కొంత తెలుసుకోవాలి.

**Early Cholas**

Ellalan · Kulakkottan · Ilamchetchenni · Karikala · Nedunkilli · Nalankilli · Killivalavan · Kopperuncholan · Kochchenganan · Perunarkilli

| Medieval Cholas | |
|---|---|
| Vijayalaya | 848–891(?) |
| Aditya I | 891–907 |
| Parantaka I | 907–950 |
| Gandaraditya | 950–957 |
| Arinjaya | 956–957 |
| Sundara (Parantaka II) | 957–970 |
| Aditya II | (co-regent) |
| Uttama | 970–985 |
| Rajaraja I | 985–1014 |
| Rajendra I | 1012–1044 |
| Rajadhiraja | 1044–1054 |
| Rajendra II | 1054–1063 |
| Virarajendra | 1063–1070 |
| Athirajendra | 1070–1070 |

| Later Cholas | |
|---|---|
| Kulothunga I | 1070–1120 |
| Vikrama | 1118–1135 |
| Kulothunga II | 1133–1150 |
| Rajaraja II | 1146–1173 |
| Rajadhiraja II | 1166–1178 |
| Kulothunga III | 1178–1218 |
| Rajaraja III | 1216–1256 |
| Rajendra III | 1246–1279 |

*మూలం: వికీపీడియా*

చోళుల వంశాన్ని మూడు భాగాలుగా చెప్తారు, తొలి  చోళులు, మధ్య చోళులు, మలి  చోళులు.  అయితే ఇప్పటికీ కొందరు తమిళనాడులోనూ, చరిత్రకారులలోనూ చివరి చోళులను తమిళులుగా భావించరు, వారిని తెలుగు సంతతిగానే గుర్తిస్తారు. ఎందుకంటే రాజరాజచోళుని కూతురు కుందవై తెలుగు చాళుక్య రాజైన విమలాదిత్యుడిని పెళ్ళాడి రాజరాజ నరేంద్రుడికి జన్మనిస్తుంది, ఆ రాజరాజ నరేంద్రుడే మన రాజమహేంద్రవరాన్ని పాలించిన ఏలిక.

ఇకపోతే రాజేంద్ర చోళుని కూతురు అమ్మంగదేవి మన రాజరాజ నరేంద్రుడిని పెళ్ళాడుతుంది, వీళ్ళిద్దరికీ మేనరిక సంబంధం ఉంది, వీళ్ళకి కలిగిన సంతానమే కుళోత్తుంగ చోళుడు.  అయితే రాజకీయ సంక్షోభం వల్లనో ఇతరత్రా కారణాల వల్ల కుళోత్తుంగ చోళుడు చోళ దేశానికి రాజవుతాడు.

అప్పటిదాకా పితృస్వామ్య వ్యవస్థ వల్ల  తండ్రి నుంచి కొడుక్కి రాజ్యం సంక్రమించిన క్రమం తప్పి, తల్లి ద్వారా గద్దెనెక్కిన కుళోత్తుంగుడు తమిళ ప్రభువు కాదు తండ్రి తెలుగువాడు అవడం చేత నువ్వు నీ సంతతీ మొత్తం తెలుగు చోళులే అని లెక్కగడతారు.

CHOLAS
Rajaraja I
EASTERN CHALUKYAS
Danarnava
Saktivarman I
Rajendra I
(d.) Kundavai (m.) Vimaladitya (m.) Medava Mahadevi
Rajadhi-raja I
Rajendra-deva II
Vira Rajendra
Adhi Rajendra
(d.) Ammanga-devi (m.) Narendra *alias* Rajaraja
Vijayaditya VII
Saktivarman II
Raja-mahendra
(d.) Madhurantaki (m.)
Rajendra *alias* Kulottunga I

*మూలం:* https://www.wisdomlib.org/south-asia/book/later-chola-temples/d/doc211946.html

సరే ఇక చరిత్ర గురించి పక్కన పెట్టి సినిమాలో ఆ పాట ప్రస్తావనలోకి వెళ్ళిపోదాం.

పాటలోని తెలుగు వరుసలు ఇలా ఉంటాయి –

*శృంగారించిన మంచి బంగారు ఊయలలోన, మరి బంగారు ఊయలలోన...*
*చెడెనె చామేంద్రుడే నృప చూడామణీ చంద్రుడే పగదానింటిలో చేరెనే...*

దీనిని ఎలా ఆపాదించుకోవాలంటే –

"అందంగా అలంకరించిన మంచి బంగారు ఉయ్యాలలో పెరిగిన చోళుడా... మతి మందగించి ముందున్నది చూడలేక పగదానింటిలో చేరి మోసపోబడితివి గదరా నరపతి"

అంటే పొగిడినట్టే పొగిడి 'నా చేతిలో మోసపోతున్నావు చూడు' అని పరాచికాలాడుతుంది.

అలా పాడి కించపరచినందుకే ఆ చోళున్ని పాటలో కోపంగా ఉన్నట్లు చూపిస్తారు, అయితే 'నువ్వు తమిళుడవు కాదు కదా అందుకే నీకు తెలుగులోనే పాడుతున్నా' అని అవమానించినందుకు బదులుగా ఆ చోళుడు కూడా "తాయ్ తిన్డ్ర మణ్ణే" అని పాడతాడు, అంటే "నా తండ్రులది చాళుక్య దేశమైయ్యుండచ్చు, కానీ నా తల్లి ఈ మట్టినే గదా తిన్నది, అంచేత ఆమె రొమ్ము పాలు తాగి పెరిగిన మేమూ తమిళులమే" అని తాయ్ తిండ్ర మణ్ణే అంటాడు.

అది మాత్రమే కాదు ఆ తెలుగు వరుసలు పాడిన తర్వాత పాండ్య యువతి(రీమాసేన్) చోళ రాజుతో ఇలా అడుగుతుంది –

> *"పాడు వీరో, దేవరే! భరణి, కళంబకం, ఉలా, ఏదేనుమ్, ఈరుగెట్ట ఎదిర్మఱై పెయరెచ్చమేనుం అఱివీరో!"*

అంటే ఒక్కో మెట్టు దిగజారుతూ కనీసం ఇదైనా తెలుసునా నీకు? వీటిలో ఒకటైనా పాడగలవా అని కించపరుస్తుంది.

ఇంతకీ ఇవేంటో ఒకసారి చూద్దాం.

భరణి, కళంబకం, ఉలా, ఈరుగెట్ట ఎదిర్మఱై పెయరెచ్చమ్ ఇవన్నీ తమిళంలోని వ్యాకరణ అంశాలు.

భరణి – ఒక చక్రవర్తి లేదా ఒక మహారాజు యొక్క యుద్ధంలోని వీరత్వాన్ని వివరించి పాడే శైలి. ఇది ఎవరికి పడితే వారి గురించి వ్రాసేది కాదు, యుద్ధంలో వేయి ఏనుగులను ఓడించ గల సామర్థ్యమున్న రాజుల గురించి మాత్రమే ఈ శైలిలో వ్రాస్తారు.

కళంబకం – వేర్వేరు సందర్భాల్లోని సంఘటనలను లేదా ఒక రాజు గురించి అబ్బురపరిచే విషయాలను వ్యక్తపరుస్తూ వ్రాసేది/పాడేది కళంబకం. కళంబకం అంటే వివిధ రకాల పూల మాల అని ఇంకో అర్థం కూడా ఉంది.

ఉలా – ఏదైనా రాజుయొక్క ఉన్నతమైన చరిత్రను గురించో, లేదా ఎవరూ చేయని విధంగా చేసిన కార్యాల గురించో వివరించేది ఉలా.

ఈరుగెట్ట ఎదిర్మఱై పెయరెచ్చమ్ – తమిళంలో కొన్ని సార్లు పదాల మధ్యలో కొన్ని శబ్దాలు మాయమౌతాయి. ఉదా : శెల్లా కాసు (శెల్లాద కాసు); నిల్లా కాలం (నిల్లాద కాలం); అంటే సాధారణ ప్రజల వాడుక భాషలో జానపదుల్లో ఇవి ప్రచారంలో ఉన్న పదాలు. కావ్య భాషలో ఇవి ఎక్కువగా కనపడవు.

ఇలా ఒక్కో దాని గురించి అడుగుతూ ఇవేమైనా తెలుసా, ఇవేం తెలియకపోతే ఈరుగెట్టు ఎదిర్‌మట్టై పెరియచ్చమ్ తోనైనా అక్కడిక్కడి పదాలు ఏరుకొచ్చిన పాటైనా పాడమని మానసికంగా హింసిస్తూ హేళన చేస్తుంది.

ఈ ఒక్క పాటకే ఇంత మాట్లాడాల్సి వచ్చింది, ఇంకా సినిమా మొత్తం, వ్రాసి  దర్శకత్వం చేసిన సెల్వ రాఘవన్ ఇంకెంత శ్రమపడుంటాడో ఆలోచించండి.

సూర్య పడుకొనె

https://qr.ae/pykpeU

## హీరో 'కృష్ణ' స్టార్‌గా ఎదగడానికి కారణాలేమిటి?

నిజమే. కృష్ణ గొప్ప నటుడు కాదు - రామారావు లాగా, మాంచి డాన్సర్ కాదు - చిరంజీవిలాగా, అందంగా ఉంటాడు కదా అంటే పక్కనే అప్పటి అమ్మాయిల మానసచోరుడైన శోభన్ బాబు ఉన్నాడు. అలాంటి కృష్ణ సాధించింది అలాంటిలాంటి స్టార్ డమ్ కాదు. ఊరూరా అభిమాన సంఘాలతో ప్రచండమైన స్టార్ డమ్. మరి అలాంటప్పుడు కృష్ణ ఎలా సూపర్ స్టార్ అయ్యాడన్నది గట్టి ప్రశ్నే.

ఈ సందేహం నాకూ ఉండేది. ఆ కారణంతోనే నేను తెలుగు వికీపీడియా వ్యాసం పేరు పెట్టుకుని, కృష్ణ గురించి పుస్తకాలు, సినిమాలు, మ్యాగజైన్లు వెతికాను. అతని గురించిన వ్యాసం బాగా విస్తరించే క్రమంలో నాకు సమాధానం దొరికింది.

నాకు అర్థమైనంతలో కృష్ణ విజయంలోని సీక్రెట్ సాస్‌లో ముఖ్యమైన దినుసులివి:

**సినిమా వ్యాపారం మీద లోతైన అవగాహన, అభిరుచి**

కృష్ణ సినిమా వ్యాపారంలోని లోతుపాతులు ఒకటో ఎక్కం అప్పచెప్పినంత తేలిగ్గా, మంచినీళ్ళ ప్రాయంగా చెప్పగలిగేవాడు. ఏ కథని ఏ దర్శకుడు ఎంత బడ్జెట్ పెడితే ఎలా తీస్తాడు, ఆ సినిమా ఎన్ని కేంద్రాల్లో ఎన్నాళ్ళు ఆడి, ఏమాత్రం సంపాదించగలగుతుందన్న విషయాన్ని కచ్చితంగా చెప్పి ఆశ్చర్యపరచగలిగేవాడు.

తెలుగు సినిమా చరిత్ర మొత్తమ్మీద చూసినా తమ కాలపు సినిమా వ్యాపారం మీద కృష్ణకి ఉన్నంత అవగాహన ఉన్న నిర్మాతలు, డిస్ట్రిబ్యూటర్లు అరుదేనని చెప్పాలి. ఏ ఏరియాలో ఎన్ని థియేటర్లున్నాయి, వాటిలో సీటింగ్ కెపాసిటీ ఎంత, ఎలాంటి ప్రేక్షకులు ఎంతెంత మంది ఉన్నారు, ఏ రకం సినిమాలు ఏ మేరకు ఆడతాయి వంటివి వివరంగా తెలుసు అతనికి. అంతేకాక ఎప్పటికప్పుడు వివిధ సెంటర్లలో సినిమాలు చూసి (ఎక్కువగా తెలుగు చలన చిత్ర వ్యాపార రాజధాని విజయవాడలో) తన అవగాహనను దిద్దుకుంటూ ఉండేవాడు.

సినిమా రంగంలో ఫైనాన్సు దగ్గర నుంచి పంపిణీ దాకా రకరకాల అంచెల్లో వ్యాపారం చేసి కానీ, చూసి కానీ చాలా అనుభవం గడించాడు. చాలామంది నిర్మాతలు కృష్ణకి సినిమా చూపించి ఏ సెంటర్‌లో ఎంతాడుతుందన్న లెక్కలు తెలుసుకునేవారు. ఇంతటి సినీ వ్యాపార అనుభవాన్ని, నైపుణ్యాన్ని కృష్ణ తాను స్టార్‌గా ఎదగడానికి వాడుకుని ఉండాలి.

ఇది కృష్ణ అమ్ములపొదిలో ఉన్న మొదటి బాణం.

**తన బలం, బలహీనతల మీద స్పష్టమైన అవగాహన**

1982లో కృష్ణావతారం అన్న సినిమా వచ్చింది. హీరో కృష్ణ, దర్శకుడు బాపు. ఇదే బాపు 1967లో లేత కృష్ణతో సాక్షి చేసాడు. కృష్ణావతారం షూటింగులో బాపు ఒక షాట్ నచ్చక రీటేక్ చేయిస్తున్నారట. కృష్ణ నవ్వుతూ "సాక్షి సినిమాకి ఇప్పటికీ పదిహేనేళ్ళు గడిచాయి కాబట్టి నటన ఇంప్రూవ్ అయిందనుకుంటున్నారేమో. మీరు పది టేక్‌లు చేసినా ఇంతే నటన వస్తుందని" మొహమాటం లేకుండా చెప్పాడట. డ్యాన్సు మూమెంట్స్ ప్రాక్టీస్ చేద్దామని అతని ఆస్థాన డ్యాన్స్ మాస్టర్ శ్రీనివాస్ అన్నప్పుడల్లా నవ్వుతూ హీరోయిన్‌ని కానీ, బాగా డ్యాన్స్ చేసే కో-స్టార్‌ని కానీ పక్కన కాకుండా తనకు కాస్త ముందు నిలబెడితే వాళ్ళని చూసి చేసేస్తానని చెప్పేవాడు.

తన సినిమా ఫ్లాప్ అయితే చాలామంది హీరోలు "పికప్ అవుతోంది" అనో, "యావరేజ్‌గా ఆడుతోంది" అనో ఏదోలా కవర్ చేసుకోవడానికి ప్రయత్నించేవారు. కృష్ణ మట్టుకు అవతలివారు భేషజానికి సినిమా హిట్టే కానీ అంటున్నా, "లేదండీ, మా సినిమా చీదేసింది" అని నిక్కచ్చిగా మాట్లాడేవాడు.

ఇదంతా ఏమిటంటే- తాను ఏం చేయగలడు, ఏం చేయలేడు అన్నదాని మీద కచ్చితమైన అంచనా ఉండడమూ, లేని గొప్పలు ఉన్నాయని చెప్పుకునే భేషజాలు లేకపోవడమూను. తన దగ్గర లేని దాన్ని కమ్ముకురావడానికి సినిమాలో ఏం ఉండాలన్నది కూడా తెలుసు అతనికి. అవన్నీ సరిగ్గా సమపాళ్ళలో ఉండేలా చూసుకునేవాడు. ఈ కటువైన నిజాయితీ, స్వస్వరూప జ్ఞానం కూడా ఒక మంచి వ్యాపారవేత్త లక్షణమే.

**తన ప్రేక్షకులను బాగా అర్థం చేసుకోవడం**

కృష్ణ నటించిన సినిమాల్లో భారీ హిట్లు ఉన్నాయి కానీ అవేమీ ఈరోజ మనం చూడడం కష్టం. ఎక్కడో ఒక అల్లూరి సీతారామరాజు లాంటి సినిమా మినహాయింపు. ఇదేమీ అతని బలహీనత కాదు. నిజానికి ఇదే బలం. ఎందుకంటే- అవి అప్పటి కాలంలోని ప్రేక్షకులని బాగా దృష్టిలో పెట్టుకుని తీసిన సినిమాలు. ఇంకాస్త పొడిగిస్తే ఆ ప్రేక్షకులను తప్ప మరెవరినీ దృష్టిలో పెట్టుకోకుండా తీసిన సినిమాలు. కాబట్టి, అవి వారినే రంజింపజేశాయి.

ఉదాహరణకు, మోసగాళ్ళకు మోసగాడు సినిమా ఇప్పుడు చూపిస్తే చాలామంది కుర్ర ప్రేక్షకులు ఏకంగా ఇదేంటెహె అనే ప్రమాదం లేకపోలేదు. ఇంకా చెప్పాలంటే "ద గుడ్, ద బ్యాడ్, అండ్ ద అగ్లీ"కి పచ్చి కాపీ అని మొహం చిట్లించుకోనూ వచ్చు. కానీ, దాని ప్రభావం అర్థం చేసుకోవాలంటే - వెనకాల ఓ తెర కట్టి దానిమీదే సూర్యోదయాలు, కోటలు, హిమాలయాలు చూపించిన 60ల సినిమాల పద్ధతి ఇంకా సాగుతున్న దశలో 1971లో బికనీర్ కోట, రాజస్థాన్ ఎడారి, సట్లెజ్ నదీ తీరం, హిమాలయ పర్వత సానువులూ రంగుల్లో తెరపై చూపిస్తే ఎలా ఉంటుందన్నది ఊహించాలి. ఎక్కడో పాశ్చాత్య దేశాల్లో ఉండే కౌబాయ్ సినిమాల ఫక్కీని మన తెలుగునాట తెచ్చి చూపిస్తే ఎలా నోరు తెరుచుకుని చూడబుద్ధేస్తుందో ఆలోచించాలి. అది కృష్ణ సరిగ్గా అంచనా కట్టాడు.




*1970ల ప్రారంభంలో ఈ అద్భుతమైన సాంకేతికత, ఎగ్జోటిక్ లొకేషన్లు ఎంత మాయ చేసివుంటాయో ఊహించండి. ఫోటో సేకరణ: తెలుగు వికీపీడియా నుంచి.*

ఎప్పటికప్పుడు ప్రేక్షకులకు ఒక విభిన్నమైన అనుభవం ఇవ్వడం మీదే అతను దృష్టిపెట్టాడు. ఇందుకు సాంకేతికత మీద అతను ఎంతో దృష్టి పెట్టాడు. 1974లో తొలి సినిమాస్కోప్ సినిమాగా అల్లూరి సీతారామరాజు, 1982లో తొలి ఈస్ట్‌మన్ కలర్ సినిమాగా ఈనాడు, 1986లో తొలి 70 ఎంఎం సినిమాగా సింహాసనం, చివరకి 1995లో తొలి డీటీఎస్ సినిమాగా తెలుగు వీర లేవరా- ఇవన్నీ ఆయన తెచ్చిన సాంకేతిక మార్పులే.

ఉన్న కథలకే ఏదోక సాంకేతికతలోనో, సెట్టింగుల్లోనో, మరేదైనా అంశాల్లోనో ఒక కొత్తదనం చూపించి, కొత్త అనుభవాన్ని ఇచ్చి హిట్ చేయడం కృష్ణ ఫార్ములా ఐతే, ఈ పద్ధతిలో వెళ్లి అతను దెబ్బతిన్న సందర్భాలూ లేకపోలేదు- దేవదాసు సినిమా కలర్‌లో కొత్త పాటలతో, కొత్తగా తీద్దామని చేసిన ప్రయత్నం ఫెయిలైంది.

అలానే అప్పటివరకూ వచ్చిన భారత రామాయణ భారతాల సినిమాలు ప్రధానంగా నటుల నటనను, పద్యాలనూ నమ్ముకుని హిట్లు కొట్టగా, అది పక్కనపెట్టి బ్రహ్మాండమైన స్టార్ కాస్ట్, అద్భుతమైన సెట్టింగులతో మరో గొప్ప అనుభవాన్ని ఇచ్చి 'కురుక్షేత్రం'గా హిట్ ఫార్ములా రూపొందిద్దామని చూసాడు. కానీ, తెలుగువారిలో భారతం మీద నాటకీయ ధోరణి, డైలాగులతో ఉన్న పౌరాణిక సంప్రదాయం మీద మక్కువ ఇంకా పోలేదని గ్రహించకపోవడం వల్ల అది దెబ్బతిని దానవీర శూరకర్ణ హిట్టయింది. మళ్ళీ- చవకగా తీసే జానపదానికి బదులు భారీ ఎత్తున ఓ జానపదం తీసి, తన కొత్త అనుభవం ఫార్ములాతో సింహాసనం హిట్టు కొట్టాడు.



*కృష్ణ మీద విపరీతమైన అభిమానం ఉండేది. కృష్ణ-రామారావు అభిమానుల మధ్య పెద్ద ఫ్యాన్ వార్ నడిచేది. ఫోటో సేకరణ: సూపర్‌స్టార్ కృష్ణ ఫ్యాన్ ట్విట్టర్ అకౌంట్ నుంచి.*

మొత్తానికి, ఎప్పటికప్పుడు ప్రేక్షకుల అభిరుచులకు కొత్త చవులు మప్పుతూ సాంకేతికత బలంతో కొట్టుకురాగలిగాడని చెప్పవచ్చు. ఈ కొత్తదనం ఈనాడు మనకు పాతదనం కాబట్టి కృష్ణ సినిమాలకు టీవీ వాల్యూ ఉండదు. అయితే, ఆ సమకాలీన ప్రేక్షకుల అభిరుచుల మీద ప్రయోగాలు అన్నదే అప్పట్లో అతని బలం.

**మంచివాడు, నిజాయితీపరుడు అన్న పలుకుబడి**

దేవుడులాంటి మనిషి అని కృష్ణ బయోగ్రఫీ రాస్తూ దానికి ఆ పేరు పెట్టారొక జర్నలిస్టు. కాస్త, అతిశయోక్తే కానీ కృష్ణ చాలా చాలా మంచివాడు అంటే అతని సమకాలీన నటులు, సాంకేతిక నిపుణులు, నిర్మాతలు ఎవరూ కొట్టిపారేయరు.

శోభన్‌బాబు సినిమాలు లేక ఖాళీగా ఉన్నాడని తెలుసుకుని ఆయన ఇంటికి వెళ్ళి మరీ హేమాహేమీలు అతనితో మల్టీస్టారర్ సినిమాగా చేద్దామని ఆఫర్ చేసాడు. ఇంతలో అనుకోకుండా ఏదో పెద్ద హిట్ వచ్చింది శోభన్‌బాబుకి. "మన హేమాహేమీలు శోభన్‌బాబు చెయ్యడు చూడు" అని పకపకా నవ్వుతూ విజయనిర్మలతో వేరే షూటింగ్ సమయంలో అన్నాడు కృష్ణ. ఇంతలో అలానే శోభన్‌బాబు కుదరదని చెప్పేశాడట. కృష్ణ అలా అంచనా కట్టెయ్యగలగడం విచిత్రం కాకపోయినా అవతల మనిషి ఇబ్బందుల్లో ఉన్నప్పుడు అవకాశం ఇవ్వబోయిన తనను అలా పక్కనపెట్టెయ్యడాన్ని పకపకా నవ్వుతూ తేలిగ్గా తీసుకోగలగడం తప్పకుండా విశేషమే.

ఇంతే కాదు, రామారావు 1972-73 నాటికి బాగా వెనుకబడిపోయాడు. దానికి తోడు బడిపంతులు (1972), తాతమ్మకల (1974) వంటి సినిమాల్లో పెద్ద వయసు హీరో పాత్రలు వేయడం కూడా మొదలుపెట్టాడు. ఆ సమయంలో 1973లో రామారావుతో దేవుడు చేసిన మనుషులు వంటి మల్టీస్టారర్ చేసాడు కృష్ణ. (తర్వాత ఏడాది రామారావు కెరీర్ మరో మలుపు తిప్పిన నిప్పులాంటి మనిషి రావడం, ఆనక కృష్ణ-ఎన్టీఆర్ వివాదం మొదలుకావడం వేరే కథ)

తన మొహమాటం, మంచితనం కొద్దీ చాలామంది నిర్మాతలకు, దర్శకులకు సినిమాలు చేసిపెట్టి వారిని కాపాడాడు. ఎవరైనా నిర్మాతలు కొత్తగా ఇండస్ట్రీకి రావాలనుకుంటే పెద్ద హీరోల్లో ఎవరు డేట్స్ ఇస్తారని ఆలోచిస్తే కృష్ణే గుర్తొచ్చేలా ఉండేది పరిస్థితి. అలానే, నిర్మాతలుగా ఎవరైనా దెబ్బతింటూంటే- పనిగట్టుకుని వారి దగ్గరకి వెళ్ళి డేట్స్ ఇచ్చి, అడ్వాన్స్ అక్కరలేదని చెప్పి వారికి ఫైనాన్స్ దొరికి సినిమా చేసి నిలబడేలా చూసేవాడు. 1970లు, 80లు చారిత్రకంగా చూస్తే - వ్యవసాయ సంస్కరణల కారణంగా ఆర్థిక వ్యవస్థలోకి వస్తున్న డబ్బులో ఒక వంతు సినిమాల్లోకి ప్రవహిస్తూ ఎందరినో కొత్తవారిని నిర్మాతలు చేస్తున్న సమయం. అలాంటి దశలో ఇలాంటి నమ్మదగ్గ, మంచివాడు కొత్తవారికి సహజంగానే సరైన ఎంపికగా కనిపించేవాడు. అదొక బలం.

మరో వైపు, స్వంతంగా గొప్ప నటనా బలం లేకపోవడంతో మల్టీస్టారర్లు, చాలా సినిమాల్లో తన పాత్రతో సమవుజ్జీ లాంటి పాత్రలు పెద్ద క్యారెక్టర్ ఆర్టిస్టులకు ఇచ్చి వారి మద్దతు సంపాదించడం కృష్ణకి కలసివచ్చింది. ఇలా అతని మంచితనం అతని ఎదుగుదలకు పనికివచ్చింది. ఈ ముక్క నేనే కాదు ఓ సందర్భంలో కైకాల సత్యానారాయణే అన్నారు.




*ఐడ్రీమ్స్, 14 రీల్స్ ఎంటర్టైన్‌మెంట్ వాళ్ళు కూడా చెప్పారిక్కడ ఈ పాయింటు. :)*

## స్టార్‌డమ్ సాధించాలన్న గాఢమైన కోరిక

వీటన్నిటికన్నా ముఖ్యమైన దినుసు తానేం కావాలో తనకి తెలిసివుండడం. మన భావి కథానాయకుడు శివరామకృష్ణ ఏలూరులో డిగ్రీ చదువుతున్న రోజుల్లో నాగేశ్వరరావు ఏలూరు వచ్చాడు. ఆయనకి అక్కడ సన్మానం. అప్పటిదాకా తీవ్రమైన రామారావు అభిమాని అయిన కృష్ణ ఈ విషయానికి పెద్దగా ఎగ్జైట్ అయివుండడు. ఒక బయటిమనిషిగా జరుగుతున్న సన్మానాన్ని, సంరంభాన్ని, జనసందోహాన్ని పరిశీలిస్తున్న క్రమంలో సినిమా హీరోకి ఇంతటి అభిమానమా అన్న ప్రశ్న వచ్చింది. తానూ అలానే హీరో అయి విపరీతమైన జనాదరణ పొందాలన్న కోరిక కలిగింది. అదీ పునాది.

విశేషమేంటంటే కృష్ణ ఏం కావాలనుకున్నాడో అదే అయ్యాడు. హీరో అవ్వాలి, స్టార్ అవ్వాలి అనుకున్నాడు సూపర్ స్టార్ అయ్యాడు. నటుడు అవ్వాలనుకోలేదు, అవ్వనూ లేదు. (కృష్ణ అభిమానులు నన్ను తిట్టుకోవద్దు, నాకు ఆయనంటే గౌరవమూ, అభిమానమూను. ప్రత్యేకించి ఆయన సాధించిన ఫీట్ అంటే చాలా గౌరవం.)

స్టార్ అయ్యే క్రమంలో రోజుకు 20 గంటలు పనిచేయాల్సివస్తే పనిచేసాడు, నెలకు పది పద్నాలుగు సినిమాలు చేసాడు. ఒక దశలో నిర్మాతలు కృష్ణ నిద్రపోతూంటే తమ సినిమాలో హీరో నిద్రపోయే సన్నివేశాలు అతని మీద చిత్రీకరించేంత బిజీ. సెలవు తీసుకోవడం కుదరక ప్రతీ ఏటా వేసవికాలం ఓ నెలా, నెలన్నర ఊటీలో షెడ్యూల్స్ వచ్చేలా ప్లాన్ చేసుకుని, కుటుంబంతో పాటు వెళ్ళి మమ అనిపించేంత బిజీ. అయినా భరించి తాననుకున్నది సాధించాడు.

అతను స్టార్ అవ్వాలనుకున్న క్రమంలో ఎంత స్పష్టతతో, ఎంత కాలిక్యులేటెడ్‌గా ముందుకువెళ్ళాడో తెలియడానికి ఇంకో చిన్న ఉదాహరణ. 1971 నాటికి కృష్ణ ఇండస్ట్రీకి వచ్చి సరిగ్గా నాలుగైదు సంవత్సరాలు. అయితే అప్పటికే 60 సినిమాలు, బోలెడన్ని హిట్లు. అయితే కృష్ణ ఆలోచించిందేంటంటే - ఎన్ని విజయాలు దక్కినా తాను నటుడిగానే ఉన్నాడని. స్టార్‌డమ్ సాధించాలన్న లక్ష్యంతో తన తమ్ముళ్ళను నిర్మాతలుగా పెట్టి మోసగాళ్ళకు మోసగాడు తీసాడు. ఎంత క్లారిటీనో చూడండి.

**చెప్పొచ్చేదేంటంటే -** నాకు తెలిసినంతవరకూ కృష్ణని సూపర్ స్టార్ చేసినవి ముఖ్యంగా ఈ లక్షణాలే. నేర్చుకోవాలని ఉండాలే కానీ అతని కెరీర్ నుంచి మనం నేర్చుకోదగ్గ సంగతులు చాలానే ఉన్నాయి.

పవన్ సంతోష్ సూరంపూడి

https://qr.ae/pyik0N

## విలక్షణ దర్శకుడు సింగీతం శ్రీనివాసరావు గారికి రావాల్సిన పేరు రాలేదు. ఎందుకు?

నిజమే! సింగీతం శ్రీనివాసరావు గారికి తెలుగులో రావలసినంత పేరు రాలేదు. ఆయన ముందు తరానికి చెందిన కె.వి.రెడ్డి, బి.ఎన్.రెడ్డి, ఆదుర్తి తరువాతి తరానికి చెందిన విశ్వనాథ్, రాఘవేంద్రరావు, దాసరి, బాపు, 80 లకు చెందిన జంధ్యాల, కోదండరామిరెడ్డి, కోడి రామకృష్ణ,వంశీ, వర్మ - కనీసం బాలచందర్, మణిరత్నం, శంకర్ వంటి తమిళ దర్శకులకు ఇచ్చిన ప్రాముఖ్యత ఆయనకివ్వలేదు.

కేవలం ఆదిత్య 369, భైరవద్వీపం, మహా అయితే మయూరి, విచిత్ర సోదరులు దర్శకుడుగా తెలుసు అంతే. నిజంగా గర్వించాల్సిన విషయమిది. ఆయన సినిమాలకి, ఆయనకి అభిమానిగా ఇది నేను చాలా బాధ పడే విషయం. నిజం చెప్పాలంటే కోరాలో నాకిష్టమైన తెలుగు దర్శకుల సమాధానం వ్రాసినపుడు నేను సింగీతం గారి పేరు మర్చిపోయాను. అసలైతే నా లిస్టులో జంధ్యాల, వంశీ, వర్మ కన్నా ముందుంటారు ఆయన.

ఒకసారి కొన్నేళ్ళ కిందట నేను ఒక వయోలిన్ కన్సర్టు వింటుంటే అన్నయ్య “ఇదే సినిమాలోది?” అనడిగాడు. అమావాస్య చంద్రుడు అంటే ఆ సినిమా తెలీదు అని ఆశ్చర్యంగా చెప్పాడు. ప్రపంచ సినిమాలు చూసే తను సింగీతం గారి సినిమాలు గమనించలేకపోయినందుకు తరువాత బాధపడ్డాడు. ఇక ఆయనకి అంత పేరు రాకపోవడానికి కొన్ని కారణాలు -

- నేను గమనించినంత వరకు 1970 వ దశకంలో పనిచేసినవారు గొప్ప దర్శకులైనా అప్పుడు పేరున్నా 90ల తర్వాత కొంచెం తెరమరుగు అయిపోయారు. ఉదాహరణకు విఠలాచార్య, బాపయ్య, వి. మధుసూదనరావు, డూండీ, కమలాకర కామేశ్వరరావు, కె.ఎస్.ఆర్.దాస్ - తెలుగు టాప్ దర్శకులు అంటే వీరి పేర్లు ఎక్కువ మందికి తట్టవు. ఎందుకో కె.వి.రెడ్డి - దాసరి మధ్య దర్శకుల తరం మధ్యతరం అంతగా జనుల మదిలో లేరు, అప్పటి అభిమానులకు తప్ప.
- 70లలో మంచి హిట్ సినిమాలు (పంతులమ్మ, జమీందారు గారి అమ్మాయి, రామచిలక) తీసినా అవి ఎన్టీయార్-ఏఎన్నార్ లాగా పెద్ద హీరోలతో కాకుండటం.
- దర్శకుడుగా పీక్లో ఉన్నప్పుడు కన్నడలో ఎక్కువ సినిమాలు తీయడం. అక్కడ రాజ్ కుమార్ వంటి సూపర్ స్టారుతో తీసినా మనవారికి ఆనలేదు. చివరికి రామోజీరావుగారు మయూరి వంటి సబ్జక్టు ఆయనే డీల్ చేయగలడని పిలిస్తే తప్ప.
- ఆయన శైలి మన తెలుగు పరిశ్రమకీ, అభిమానుల అభిరుచి కన్నా అప్పటి తమిళ దర్శకులైన బాలూ మహేంద్ర, మణిరత్నం, భారతీరాజా వంటివారికి దగ్గరగా ఉండడం, ముఖ్యంగా ‘సొమ్మొకడిది సోకొకరిది’ తరువాత కమల్ హాసనుతో కలవడం, మార్కెట్ దృష్ట్యా తమిళంలో కమల్‌తో ఎక్కువ చిత్రాలు తీయడానికి ఇష్టపడ్డారు. రాజా పార్వై

(అమావాస్య చంద్రుడు), పుష్పక విమానం లాంటివి. అలాగే క్రేజీ మోహను పరిచయం అయ్యాక మంచి కామెడీ టీం తయారయ్యింది - అలా వచ్చినవే విచిత్ర సోదరులు, మైకేల్ మదన కామరాజ్ లాంటి సినిమాలు. బాధాకరమైన విషయమేమిటంటే వీటి క్రెడిట్ కమల్ - క్రేజీ మోహనులకిచ్చినంతగా తమిళులు సింగీతంగారికివ్వలేదు.

- 90లలో ఆదిత్య 369, భైరవద్వీపం, మేడమ్ వంటి హిట్ సినిమాలు తీసినా కమర్షియల్ చిత్రాలు తీసే మన తెలుగువారు అంత ఆసక్తి చూపించలేదు. దానికి తోడు ఆకాశవీధిలో, రాజహంస, విజయం వంటివి ఆయన స్థాయిలో లేవు. దీనితో నా తరానికీ (80లలో పుట్టినవారు), నా తరువాతి తరానికి (90-2000లలో పుట్టిన వారు) ఆయన పేరు అంతగా తెలియలేదు.

క్లుప్తంగా చెప్పాలంటే, పెద్ద హీరోలతో మాస్ మసాల సినిమాలు తీయకపోవడం, హైదరాబాదుకి మారకుండా మద్రాసులో స్థిరపడిపోవడం, తెలుగు కన్నా కన్నడ-తమిళంలో ఎక్కువ తీయడం, ఆయన శైలి-విలక్షణతని ఆస్వాదించే, ఆదరించే స్థాయి లేని దౌర్భాగ్య స్థితిలో తెలుగు పరిశ్రమ, అభిమానులలో ఎక్కువ శాతం మంది ఉండడం.

ఆయన గురించి కొన్ని -

- మాయాబజార్ బృందంలో మిగిలిన అతి తక్కువ మందిలో ఒక్కరు
- ఆయన తీసిన సినిమాల వైవిధ్యత - గుడ్డివాడైన హీరో, కాలు పోగట్టుకుని కృతిమ కాలుతో ప్రసిద్ధమైన ఒక నర్తకి, మరుగుజ్జ అయిన హీరో, మూకీ సినిమా, టైం ట్రావెల్, 90లలో జానపదం, పౌరాణికం, 77 ఏళ్ళ వయసులో యానిమేషన్, సర్రోగసీ పైన, 70లలో అమెరికా క్రాస్-ఓవర్ సినిమా, లిటిల్ జాన్ అని ఇంగ్లీషు ఫాంటసీ సినిమా
- రెండు జాతీయ పురస్కారాలు ఆయన చిత్రాలకు, అలాగే ఆరు నంది పురస్కారాలు పొందారు.

జ్యోతి బాసు యేటూరి

https://qr.ae/pyiMnR

## చంద్రముఖి సినిమా మూలం ఏమిటి ? అది ఎన్ని భాషల్లో విడుదల అయ్యింది?

మనకందరికీ చంద్రముఖి అంటేనే రెండు విషయాలు ఠక్కుమని గుర్తొస్తాయి. ఒకటి జ్యోతిక రారా(వారాయి) అని పిలవడం, రెండోది రజనీ లకలకలక డైలాగు. ఈ సినిమాకి రజనీ మానరిజం, స్టార్‌డంతో పాటు జ్యోతిక నటన తోడవడం ఒక ఎత్తు అయితే, నయనతార గ్లామర్ కూడా ప్లస్ అయి సినిమాను సూపర్ డూపర్ హిట్ చేసింది.

**మణిచిత్రతాళు:**

అసలీ కథ మొత్తం 'అలమ్ముట్టిల్ తరవాడ్' అనే మలయాళీ నాయర్ల (కాయంకుళంకి చెందిన ఎజ్హవ కులానికి చెందిన మడంపల్లి కథని జనాలకు నప్పుతుందని, నాయర్ కులంగా మార్చారని, చాలా చోట్ల చదివాను) ఇళ్ళలో జరిగిన ఒక యదార్ధగాథకు సినిమా రూపం. నాయర్‌లు మాతృస్వామ్యం పాటించేవాళ్ళు. అంటే తల్లి ఇంటికి పెద్ద. ఒక ఇంటిలో ఉమ్మడి కుటుంబం ఉంటుంది. ఇంచుమించు మన జమిందార్ల కుటుంబంలాగ బోల్డన్ని ఆస్తులు ఉంటాయి. చిన్న సైజ రాజులు వీళ్ళు.

అలాంటి ఓ నాయర్, తన ఆస్థానంలో రాజనర్తకిగా, ఒక తమిళ తంజావూరు పిల్ల, 'నాగవల్లి'ని పిలిపించి, ఉద్యోగం ఇస్తాడు. ఆయనకు తెలియని విషయం ఏంటంటే, నాగవల్లికి ఒక ప్రియుడు ఉంటాడు. ఆమెతో పాటు నాట్యం చేస్తూ ఆమె పక్కనే ఉండే అతనితో నాగవల్లి పారిపోవాలని చూసినప్పుడు నాయర్ నాగవల్లిని, ఆమె ప్రియుడిని చంపేస్తాడు. నాగవల్లి ఆత్మ నాయర్‌ని చంపాలని ప్రయత్నించి విఫలం అవుతుంది. ఓ గదిలో నాగవల్లి బంధించబడి, ప్రతీకారం తీర్చుకోవడం కోసం ఎదురు చూస్తుంటుంది.

ఈ కథను మధుముట్టం అనే రచయిత, ఫాజిల్ అనే దర్శకుడు పదును పెట్టి మొదటిసారి కేరళలో 1993లో 'మణిచిత్రతాళు' అనే పేరుతో విడుదలై కనీవినీ ఎరుగని కలెక్షన్లతో పెద్ద హిట్ అయి, ఆల్ టైమ్ బెస్ట్ సినిమాగా ప్రేక్షకుల గుండెల్లో నిలిచింది.

దీనిలో నాగవల్లి/గంగ గా శోభన, ఆమె భర్తగా సురేశ్ గోపి, భర్త స్నేహితుడిగా మోహన్‌లాల్ నటించారు. మోహన్‌లాల్ సరసన ఇంకో హీరోయిన్‌గా వినయ ప్రకాష్ నటించారు. ఈ వినయ ప్రకాష్ మన తెలుగు సినిమాల్లో కొన్ని తల్లి పాత్రలు వేసారు. ఈ సినిమాకు నేషనల్ ఫిలింఫేర్ అవార్డులు వచ్చాయి. నటి శోభనకు ఉత్తమ నటి అవార్డు వచ్చింది.

అయితే ఇది తొలి ప్రయత్నం కనుక, ఒరిజినల్ కథను అనుకరిస్తూ పెద్ద మార్పులు లేకుండా, సాదాసీదాగా ఓ ఇంట్లో జరిగే స్టోరీలా ఉంటుంది. మోహన్‌లాల్ (రజనీకాంత్ నటించిన సైకియాట్రిస్ట్) పాత్ర ఇంటర్వెల్ దాకా కథలోకి ప్రవేశించదు.

గంగ మానసిక వ్యాధి పేరు 'మల్టిపుల్ పర్సనాలిటి డిసార్డర్/డిసోసియేటివ్ ఐడెంటిటీ డిసార్డర్'. ఇది ఉన్నవాళ్ళు తమ జీవితంలో ఎదురైన మానసిక వ్యథలను, గాయాలను మర్చిపోవడానికి తమకి తాము ఏర్పరుచుకొనే ప్రతిక్రియగా భావించవచ్చు. ఈ వ్యాధి ఎస్టాబ్లిష్ అయ్యే విధంగా ఆమె బాల్యంలో

ఎదుర్కొన్న సంఘటనలను వివరంగా చూపించారు. ఇలాంటి కాన్సెప్టుతో మంచి హిట్ అయిన ఇంకో సినిమా అపరిచితుడు.

అలా గంగ, నాగవల్లి ఆత్మ బంధించి ఉన్న గదిలోకి వెళ్ళి, నాగవల్లి స్థానంలో తనను ఊహించుకొని, తనకు తెలియకుండా, ఆమెలా నటించడం మొదలు పెడుతుంది. ఈ మలయాళ వెర్షన్‌లో, గంగ జమిందారు(రాజు)గా ఊహించి చంపాలనుకునేది సైకియాట్రిస్ట్ ని కాదు, తన భర్తనే. అది కూడా, కాల్చి చంపడం కాదు, ముక్కలు ముక్కలుగా నరికి, రక్తం తాగుతానంటుంది. ఇది చాలా భీకరంగా ఉంటుందేమోనని, తర్వాత రీమేక్ లలో, కొంచెం తక్కువ వైలెంట్‌గా, కాల్చి చంపటంగా మార్చారు.

మోహన్‌లాల్ జంటగా నటించిన వినయ ప్రకాష్ (తెలుగులో నయనతార/దుర్గా) అదుర్స్ సినిమాలో జూనియర్ యన్.టి.ఆర్ తల్లిగా నటించినావిడ. ఈ పాత్ర ఇందులో వాచ్‌మెన్ కూతురు కాదు. గంగ భర్తకు మేనత్త కూతురు. ఒక వితంతువు. ఈ సినిమాలో, మోహన్‌లాల్కు పెద్దగా మానరిజం పెట్టలేదు. ఈ సినిమా తొలి షాట్ మద్రాసులో వాసన్ అనే నిర్మాత ఇంట్లో జరిగితే, శోభన వాళ్లమ్మ సెంటిమెంట్‌గా, అక్కడ తీసిన సినిమాలు అన్ని ఫ్లాపులని చాలా బెట్టు చేసారట. దర్శకుడు ఫాజిల్‌కి, ఆ ఇంట్లో చెక్క తలుపులు, వాటి నగిషీ చెక్కడాలు, కేరళ పాతకాలపు ఇళ్ళలా ఉన్నాయని ఇష్టపడ్డట్టు ఒక వ్యాసంలో వ్రాసాడు.

క్లైమాక్స్ దృశ్యాలు పద్మనాభపురం పాలస్‌లోని నవరాత్రి మండపంలో తీసాడు. తనకి నృత్యంలో ప్రవేశం లేకపోవడంతో, ఆ దృశ్యం తీసేటప్పుడు శోభన సహాయం తీసుకున్నానని చెప్పాడు. శోభన తనకి డాన్సు బ్యాక్‌గ్రౌండ్ ఉన్నా, దానిని తక్కువగా వాడింది ఈ సినిమాలోనే అని చెప్పింది.

గంగని, భర్త క్లైమాక్స్‌కి ముందు తన ఇష్టానికి విరుద్ధంగా పెళ్లి నగల షాపింగుకి తీసుకెళ్తానంటే, నాగవల్లి సడన్‌గా ప్రవేశించి "విడమాటియా నాయి" (వదిలి పెట్టవా, రే కుక్కా) అనే సీనులో, అమాయకమైన గంగ నుంచి, క్రూరమైన నాగవల్లిగా మారే నటన చేయడానికి, శోభన చాలా శ్రమించిందట. నిజంగా తెలుగు, తమిళ, కన్నడ గంగలలోకి, మొదట శోభన, తర్వాత జ్యోతిక బాగా నటించారని నా అభిప్రాయం. నాగవల్లిగా సౌందర్య నటన భయపెట్టలేదు.

ఈ సినిమాకి అసిస్టెంట్ డైరెక్టర్లుగా పనిచేసిన ప్రియదర్శన్, సిద్దికి, లాల్ తర్వాత కాలంలో పెద్ద డైరెక్టర్లు అయ్యారు.

ఇక ఈ సినిమా నుంచి తర్వాత రీమేక్ ఆప్తమిత్రకు వెళ్ళే ముందు ఒక మాట. దీన్ని మలయాళీలు ఒక గొప్ప అద్భుతంగా భావిస్తారు. దీన్ని రీమేక్ చేసి, దీనికున్న విలువను ఘోరంగా నాశనం చేసారని భావిస్తారు. ప్రాథమికంగా మణిచిత్రతాళుని సైకలాజికల్ థ్రిల్లర్‌గా తీసారు కాని, కమర్షియల్ దయ్యం సినిమాగా కాదు. అందుకే తర్వాతి వర్షన్లు వారికి నచ్చలేదు. రెండోది, మలయాళీలలో అక్షరాస్యత ఎక్కువ కాబట్టి, కథలోని మానసిక సమస్యను, గంగ మానసిక సంఘర్షణను బాగా అర్థం చేసుకున్నారు. ఎప్పుడైతే పెద్ద హీరో ప్రవేశాన్ని బట్టి కథ మారిందో, అది వారికి నచ్చలేదు.

**ఆప్తమిత్ర:**
మొదటి సినిమా వచ్చిన 11 ఏళ్ళకు, వాసు అనే దర్శకుడు (ఇతను కూడా మలయాళీ) 2004లో ఈ కథను, కన్నడ హీరో విష్ణువర్ధన్‌తో తీయాలని సంకల్పించాడు. ఇంకేం, గంగగా సౌందర్య, ఆమె భర్తగా రమేశ్ అరవింద్, సైకియాట్రిస్ట్‌గా విష్ణు, అతని జోడిగా ప్రేమతో సినిమాను ప్లాను చేసారు. అయితే ఈ సినిమా మరీ సింపుల్‌గా ఉందనుకుని, కన్నడంలో విష్ణు ఫాలోయింగ్ దృష్టిలో ఉంచుకొని, కథలో కొంచెం మసాలా జోడించి, అక్కడక్కడ మార్పులు చేసాడు. ఇవేమిటో ఇప్పుడు చూద్దాము.

దీనిలో సైకియాట్రిస్ట్ సినిమా మొదటి నుంచి ఉండటమే కాక, ఈ కథను తానే ముందుండి నడిపిస్తాడు. కథలో దుష్ట జమీందారు/రాజా కూడా అతనే. గంగ చంపాలనుకునేది అతన్నే. అంటే, కథలో ఇతివృత్తంతో పాటు సమానంగా హీరో సైకియాట్రిస్ట్ పాత్రని పెంచారన్నమాట. కథకు కామెడి ట్రాక్, ఫైటు, పాటలు అన్నీ వచ్చి చేరాయి. సినిమా ఎంట్రీలోనే హీరో ఫైటు చేస్తాడు.

మధ్యలో వచ్చే గాలిపటాల పాట కన్నడ సినిమాలోని కల్పనే(పట..పట..గాలిపట అనే పాట). ఇంకా కొన్ని సన్నివేశాలు, వగైరా వగైరా. ఇది సౌందర్య చివరి సినిమా. తర్వాత ఆమె హెలికాప్టర్ ప్రమాదంలో చనిపోయింది.

క్లైమాక్స్ ఇంతకుముందే చెప్పుకున్నట్లు, హీరో విష్ణు వర్ధన్‌ను హైలైట్ చేస్తూ ఉంటుంది. ఇందులో విష్ణు "సుమ్మగే"(తమిళ్ "సుమ్మా") అంటూ ఉంటాడు. ఈ సినిమాలో విష్ణువర్ధన్ ముఖంలో వయసు తెలుస్తూ ఉంటుంది. మలయాళంలో అందరు యువ పాత్రలుగా ఉంటే, ఇందులో రమేశ్ స్నేహితుడు అయిన విష్ణు, అతనికి అంకుల్‌లా అనిపించాడు. కానీ బాగా చలాకిగా ఉన్నాడు. సౌందర్య గంగగా బాగా ఉన్నా, నాగవల్లిగా అంత భయానకంగా లేదు. బహుశా మన తెలుగు సినిమాలలో ఆమెని సాఫ్ట్‌గా ఉండే పాత్రలలో చూసి అలా అనిపించి ఉండవచ్చు.

**చంద్రముఖి:**
చివరిగా 2005లో తీసిన చంద్రముఖి, తెలుగు, తమిళాలలో ఒకేసారి నిర్మించారు. దీన్ని రజనీకాంత్ తనకెంతో ఇష్టమైన నటుడు శివాజీ కొడుకులకు ఏదైనా హెల్ప్ చేద్దామని, శివాజీ ప్రొడక్షన్స్‌లో 50వ చిత్రానికి ఒక కొడుకు రామ్‌కుమార్‌ను నిర్మాతగా, ఇంకో కొడుకు ప్రభుతో గంగ భర్త పాత్ర వేయించి, గంగగా జ్యోతికను, సైకియాట్రిస్ట్ పాత్ర తానూ వేసి సూపర్ డూపర్ హిట్ కొట్టాడు.

ఇందులో రజనీకి జోడీ నయనతార. మొదట గంగ పాత్రకు సౌందర్యను అనుకుంటే, ఒక ప్రమాదంలో ఆమె మరణించగా, తర్వాత ఆ పాత్రకు సిమ్రాన్ ఎంపిక అయ్యింది కానీ, ఆమె కడుపుతో ఉందని కాన్సిల్ చేసుకుంటే, ఐశ్వర్యరాయ్, ఇంకా సదా, రీమాసేన్‌ను సంప్రదించినా చివరకు ఆ పాత్ర జ్యోతికకు దక్కింది.

దర్శకుడుగా కన్నడ ఆప్తమిత్ర దర్శకుడినే ఎంచుకున్నారు. కన్నడ సినిమాకి కొన్ని పాటలు, ఇంకొన్ని ముతక హాస్య సన్నివేశాలు జత చేర్చి, స్క్రిప్ట్ తయారు చేసారు. దయ్యం పేరు నాగవల్లి అంత సూట్ కాలేదని 'చంద్రముఖి'గా రజని సలహాతో మార్చారు.

ఈ సినిమాలో ఇంకో ప్రత్యేకత, దీనిలో పాటలు. విద్యాసాగర్ సంగీతంలో వచ్చిన పాటలన్నీ మంచి ప్రజాదరణ పొందాయి. బాగా చెప్పుకోవలసిన పాట 'కొంతకాలం కొంతకాలం'. ఇది, శ్రీరంజని రాగంలో చేసిన మెలోడీ. చాలా బాగా ప్రాచుర్యం పొందిన పాట.

ఈ సినిమాని భోజ్‌పురి, బెంగాలీ, టర్కీ, జర్మన్ భాషల్లోకి డబ్ చేసారు. జర్మనీ భాషలోకి డబ్ అయిన తొలి భారత సినిమా ఇదే. కొంతకాలం పాట టర్కీలో తీసారు.

రజనీకాంత్‌కి ఈ సినిమా వరుస పరాజయాల నుంచి బయటకు తీసి నటుడిగా ఒక కొత్త ఇన్నింగ్స్‌కి సహాయపడింది.

**భూల్ భులయ్యా:**

మరో మలయాళీ దర్శకుడు ప్రియదర్శన్ హిందీలో టీ సిరీస్ గుల్షన్‌కుమార్ సంస్థ నిర్మాణంలో ఇదే సినిమాను తీసాడు. ఇక్కడ చంద్రముఖి పేరు 'మంజులిక'గా మారింది. గంగను అవనిగా మార్చారు. ఈ పాత్రను విద్యబాలన్(ఇంకో మలయాళీ) పోషించగా గంగ భర్తగా షైనీ అహుజా, సైకియాట్రిస్ట్‌గా అక్షయ్ కుమార్, అతని జోడీగా అమీషా పటేల్ నటించారు.

సాటి మలయాళీగా ముందు ఈ సినిమాలో అసిస్టెంట్‌గా పనిచేసాడు కాబట్టి ప్రియదర్శన్ సినిమా నిర్మాణంలో తన గురువు ఫాజిల్‌ను దాదాపు ఫాలో అయ్యాడు. అంటే అక్షయ్ కుమార్ పాత్ర మధ్యలో కానీ రాదు. అతని పాత్ర దాదాపు మోహన్ లాల్ పాత్రను అనుకరణ చేస్తుంది. హాస్యం కూడా దాదాపు మలయాళ కథను అనుసరిస్తుంది.

ఇక్కడ కూడా, దయ్యం పగబట్టేది గంగ(అవని) భర్తపైనే. కాబట్టి ఇది మలయాళ 'మణిచిత్రతాళు' కి హిందీ నకలులాగ ఉంటుంది. కాకపోతే, నేటివిటీ కోసం దయ్యం (ఆత్మ) బెంగాలీ భాష మాట్లాడుతుంది, కథక్ డాన్సు చేస్తుంది. షైనీ అహుజా, అక్షయ్ ఇద్దరూ ఒకే వయసులో ఉండటం వల్ల స్నేహితులలాగానే అనిపించారు. అక్షయ్ ఇలాంటి చిలిపి పాత్రలు బాగా చేస్తాడు కనుక పాత్రకు సరిపోయాడు. సినిమా షూటింగులో జైపూర్ చోము ప్యాలస్‌ని, అక్కడి మీరా టెంపుల్‌ను కొన్ని సన్నివేశాల్లో బ్యాక్ గ్రౌండ్ కింద వాడారు.

బెంగాలీ, భోజపురి భాషలు తప్ప అన్ని వెర్షనులు చూసేసాం.

ఫైనల్‌గా నా ఉద్దేశ్యం ఏమంటే ఇది సినిమా కోసం డబ్బులిచ్చి కొన్న కథ. కొనుక్కున్న వాడు ఎలా అయినా తీయవచ్చు కదా! వ్యాపారంలో లాభం ఉందా లేదా అనేదే అసలు పాయింట్. కాబట్టి తీసేవాళ్ళు, చూసే ప్రేక్షకుల భావాలకు అనుగుణంగా కథకు వారు చేసిన మార్పులు ప్రజలు మెచ్చి

ఆదరించి కోట్లు సంపాదించినప్పుడు బాగా లేదు అనో, ఉందనో మనం సింపుల్‌గా చెప్పటం భావ్యం కాదు.

అప్పారావు ముప్పాళ్ల
https://qr.ae/pyMMEn

## అకిరా కురసావా దర్శకత్వంలో 'సెవెన్ సమురాయ్'  సినిమా ఎందుకు గొప్ప సినిమాల్లో ఒకటి అయ్యింది?

ఇది చాలా పాత సినిమా, బ్లాక్ అండ్ వైట్ కాలం అంటే 1954లో రిలీజైన సినిమా. దర్శకుడి పేరు అకిరా కురసావా, జపనీయుడు. అకిరా కురసావా జపాన్ సినిమా చరిత్రలో ఒక ప్రభంజనం. ఆయన్ని వాళ్ళు ముద్దుగా 'ఎంపరర్'(emperor) అని పిలుచుకుంటారు. కొందరేమో అది అయన ప్రతిభకి బిరుదు అని అంటే, ఇంకొందరు అది అయన తనతో పనిచేసే వారితో నిరంకుశంగా, నిర్దాక్షిణ్యంగా ప్రవర్తిస్తాడు, అందుకే అలా నిందాస్తుతిగా అంటారట.

అయన తన కెరీర్‌లో ఐదు దశాబ్దాల కాలంలో ముప్పై సినిమాలు తీసాడు. అందులో రాషోమన్ (1951 వెనిస్ ఫిలిం ఫెస్టివల్‌లో బంగారు సింహం గెలుచుకుంది), సెవెన్ సమురాయ్, ఇకిరు, త్రోన్ ఆఫ్ బ్లడ్, యోజింబో వంటి సినిమాల వల్లే ప్రఖ్యాత దర్శకుడిగా ప్రపంచ వ్యాప్తంగా అభిమానులను సంపాదించుకున్నాడు. 1990 అకాడమీ తరపున లైఫ్ టైం అచీవ్మెంట్ అవార్డ్ తీసుకున్నాడు.

**సంక్షిప్తంగా కథ**:
పదహారో శతాబ్దంలో ఒక చిన్న గ్రామం బందిపోటు ముఠాతో ఇక్కట్లు పడుతూ ఉంటుంది. అందరూ కలిసి ఎదుర్కొని పోరాడాలని అనుకున్నా, తమకున్న పరిమిత బలం సరిపోదని మానుకుని, ఊరి పెద్దని సలహా అడగబోతారు. అతను వారికి ఈ పని కోసం ఒక సమురాయ్‌ని నియమించుకోమని చెప్తాడు. వాళ్ళకున్న కాస్త డబ్బులకి ఎవరు వస్తారు? కేవలం అన్నం మాత్రమే పెట్టగలరు.

అలాంటి పరిస్థితి లో 'కాంబే' అనే ఒక మంచి మనసున్న సమురాయ్ దొరుకుతాడు. తానే ఇంకా ఆరుగురిని కూడగట్టి వారి ఊరికి వస్తారు. అయితే పల్లె వాసులకి సమురాయ్‌లన్నా భయమే. ఇంతకు మునుపు వారే పల్లెల్ని దోచుకున్న సంఘటనలు కూడా ఉన్నాయి. ఇలాంటి సందేహాల నడుమ సమురాయ్‌లు, పల్లెవారు కలిసి దోపిడీ ముఠాని ఎలా మట్టికరిపించారు అనేది సినిమా ఇతివృత్తం.

**కొంత నేపథ్యం**:
ఈ సినిమా వచ్చే నాటికి జపాన్ రెండో ప్రపంచ యుద్ధం గాయాలను ఎదుర్కొని, నెమ్మదిగా గాటన పడుతూ ఉంది. పాతది అంతా మంచిదనే వాదన ఒక వైపు, కొత్తది మేలు అన్న వాదన ఇంకో వైపు నడుస్తున్నాయి. ఈ సినిమాలో ఇతరుల కోసం త్యాగం చెయ్యడం అనే ఇతివృత్తం ఎక్కువ ప్రతిఫలించడం చూస్తాం. మనలను అనుమానిస్తున్నా సరే, ఇచ్చిన మాటకి కట్టుబడి, చావుకి ఎదురొడ్డి, సహాయ పడటం ఒక వైపు, అలాగే రైతులు ఎందుకు సమురాయ్‌లని అనుమానిస్తున్నారు అని, సమురాయ్‌లలో ఒకడు విప్పి చెప్పడం ఇంకో వైపు. ఇలా కథ మాత్రమే కాకుండా వివరణ కూడా కనిపిస్తుంది.

సమురాయ్‌లంటే యుద్ధ నిపుణులు. వీరు పన్నెండవ శతాబ్దం నుంచి జపాన్ లో ఉండేవారు. కొన్ని చోట్ల వీరే అధికారులుగా, ఇంకా సంపన్నులుగా కూడా కనిపిస్తారు. పదహారో శతాబ్దిలో జపాన్‌లో

చక్రవర్తి పాలన నామమాత్రమే.  నిజానికి 'షోగన్' లనే మిలిటరీ నాయకుల చేతిలో మొత్తం పాలన ఉండేది. వీరు తమ అధికారం కోసం 'డైమ్యో' అనే భూస్వాముల పై ఆధారపడే వారు. వీళ్ళు మన జమీందార్లలా రాజుల కింద లెక్క. అయితే ఈ డైమ్యోలు ఆస్తుల రక్షణ , ప్రాణ రక్షణ, అధికారం కోసం, ఆయుధ విద్య నేర్చిన సమురాయ్‌లను పనిలో పెట్టుకునే వారు. ప్రతి సమురాయ్ కూడా అస్త్ర విద్య నేర్చి ఉండాలి. సమురాయ్ అంటే అర్థం 'సేవకుడు' అనే.

మళ్ళీ ఈ సమురాయ్‌లలో కూడా తేడాలు ఉన్నాయి. సమురాయ్ ఒక అగ్ర తరగతి కి చెందిన వాడు. కొంచెం మధ్యమ తరగతి వాళ్ళు 'నింజా'లు(paid assassin). చివరి అతి తక్కువ రకం 'ఆషిగారు' .

సమురాయ్ తన యజమాని కోసం ఏమైనా చేయాలి. అడిగితే తన ప్రాణం కూడా తీసేసుకోవాలి. ఆత్మహత్యని  'సెప్పుకు'(హరాకిరి) అంటారు . యజమాని వదిలేసినా, చనిపోయినా అటువంటి సమురాయ్‌ని 'రోనిన్' అంటారు. రోనిన్ తిండి కోసం చిన్న పనులు చేసుకుని, యుద్ధవిద్యని బోధించి జీవించవచ్చు. అయితే యజమాని లేకపోడం వల్ల దేశదిమ్మరుల్లా తిరుగుతూ ఉంటారు.

సమురాయ్‌లంతా నియమబద్ధ జీవనశైలి పాటించాలి. దీన్నే 'బుషిడో'(యుద్ధవీరుని పద్ధతి) అంటారు. సమురాయ్‌లకి స్వంత యజమాని తప్ప వేరేవారి అజ్ఞ నిషిద్ధం. రోనిన్‌లు ఆ ఒప్పందం నుంచి విడివడిన వారు కనుక వారిష్టం వచ్చినట్టు ఉంటారు.

**ఇప్పుడు పై కథకి నేపథ్యం అన్వయం**:
సెవెన్ సమురాయ్ కథలో వారిని ఎలా చిత్రించారనేది చాలా హృద్యంగా ఉంటుంది. మొత్తం ఏడుగురు సమురాయ్‌లు అన్నాం కదా! వీళ్ళు పైన చెప్పుకున్న వివరాల ప్రకారం రోనిన్‌లే కాని సమురాయ్‌లు కారు. ఒక్కొక్కడిది ఒక్కో రకం కథ. అసలు తమకి సమురాయ్ కావాలి కానీ, అన్నం తప్ప డబ్బు ఏమీ ఇవ్వలేం అని అంటే అందరు విసుక్కుంటారు. ఇక ఆశ చచ్చిపోయి వెళ్లిపోదాం అనుకుంటున్న సమయంలో వారికి '**కాంబే**' కనపడతాడు.

మాములుగా సినిమాల్లో హీరో చిన్న వయసువాడు ఉంటాడు. కానీ ఇతడు రిటైర్మెంట్ వయసు దగ్గరున్న హీరో. ఈ కథకి సర్వం  తానే అయిన పాత్ర ఇతనిది. అందుకే కురసావా అతని పాత్రని ఇలా పరిచయం చేస్తాడు.

రైతులు వెతుకుతూ తిరుగుతూ ఉన్నప్పుడు, ఒక చోట ఒక సమురాయ్ తన నెత్తిన ఉన్న ముడి తీసి , గుండు చేయించుకోవటం చూస్తారు. సమురాయ్‌కి నెత్తిన ముడి ఉన్న జట్టు, గౌరవ సూచకం. అది తీసేయడం అతనికిచ్చే శిక్ష. అంటే సమురాయ్ ఓడిపోయినప్పుడు, యజమానికి నచ్చనప్పుడు ముడి గొరిగేస్తారన్నమాట. చాలా సంస్కృతులలో ముండనం ఒక శిక్ష, లేదా అగౌరవం అని తెలుసు కద!

ఒక దొంగ, దొంగతనం కోసం వెళ్ళి, అక్కడ ఇంట్లో చంటి బిడ్డని అపహరించి ఎవరినీ దగ్గరికి రానీయక బెదిరిస్తూ ఉంటాడు .సమురాయ్‌లా వెళ్తే అతను భయంతో బిడ్డను చంపేస్తాడని, బౌద్ధ భిక్షువు

అయితే అనుమానించడని, కాంబే అగౌరవం అయినా సరే తన జట్టుని త్యాగం చేసి దొంగని పట్టుకుంటాడు. అది చూసి రైతులు, ఇతనే మన ఆశా కిరణం అని ఫిక్స్ అయిపోతారు. తర్వాత వారి పరిస్థితి విని సహాయం చేయడానికి కాంబే సిద్ధపడటమే కాకుండా, తనకి తోడుగా ఇంకో ఆరుగురిని తానే ఎంపిక చేస్తాడు.

ఒకరు తనతో, యుద్ధాలలో పనిచేసిన యోధుడు(సిచిరోజి ), కాంబే నైతికత నచ్చిన యోధుడు (గోరొబే), ఒక యువకుడు-కట్సుషిరో( ఇతనికి రైతు కూతురితో ప్రేమ కథ నడుస్తుంది ), కట్టెలు కొట్టుకునే 'హయశిడ' , కత్తియుద్ధ నిపుణుడు 'క్యూజ', చివరగా సమురాయ్‌లా నటించే రైతుబిడ్డ 'కికుచియో'. ఈ కికుచియో వేష భాషలు పైకి హాస్యాన్ని, లోతుగా పదునైన ఆలోచనలని ఇస్తాయి. నిజానికి ఇతన్ని వారు చేర్చుకోకపోయినా వెంటపడి మరీ సహాయ పడతాడు. ఈ పాత్ర వల్ల దాన్ని వేసిన మిఫునె ఎంతో ప్రాచుర్యం పొందాడట.

ఇలా ఒక మంచి పనికోసం వరుసగా కొందరు కిరాయి హంతకులని (paid assassins ) ఎంపిక చేసి చేర్చుకుంటూ పోయే పద్ధతి తర్వాత ఎన్నో సినిమాల్లో మన చూసి ఉన్నాం. ఉదాహరణగా మాగ్నిఫిసెంట్ సెవెన్(The Magnificent Seven), బగ్స్ లైఫ్, గన్స్ ఆఫ్ నవరోన్, షోలే సినిమాలు చెప్పుకోవచ్చు. ఇంకా దీని నుంచి ప్రేరణ పొందిన స్టార్ వార్స్ నుంచి అన్ని ఆక్షన్ సన్నివేశాలు ఉన్న సినిమాలు అంతో ఇంతో కాపీలా అనిపించక మానవు(Mad Max - Fury Road). డైలాగులతో సహా అలానే దింపేసిన సినిమాలు ఉన్నాయట.

జార్జ్ లూకాస్, క్విన్టిన్ టరంటినో లాంటి గొప్ప దర్శకులే ఈ సినిమా తమని ఎంతో ప్రభావితం చేసిందని చెప్పుకున్నారు. ఇంగ్మర్ బెర్గమన్, ఫెల్లిని, స్పిల్ బెర్గ్, సత్యజిత్ రే, రోమన్ పోలన్స్కి , బెర్తోలూసి, వీళ్ళంతా ఈయన గారి ఫ్యాన్సే మరి.

**సినిమాలో కథా పరంగా ఆకట్టుకునే అంశాలు:**
కథ మొదలయ్యేటప్పుడు కాంబే జట్టు తీసేస్తే గుండు అవుతుంది. మళ్ళీ కథ చివర్లో జట్టు పెరుగుతుంది. అంటే మొత్తం 360 డిగ్రీలు పూర్తై మొదటికి వచ్చింది అని గుర్తు చేస్తాడు. ఆ జట్టు నిమురుకుంటూ 'మనం గెలవలేదు, రైతులే గెలిచారు' అని అతను చెప్పే డైలాగుతో, సినిమా ముగుస్తుంది.

రైతులెలా గెలిచారు? అనేదానికి బోలెడు అర్థాలు వెతుక్కోవచ్చు. వారి పంట కాపుకొచ్చింది. చనిపోయింది కూడా నలుగురు సమురాయ్‌లే కాబట్టి రైతులకి ఇబ్బంది లేదు. పైగా, దోపిడీ ముఠా బాధ వదిలింది. సినిమా పల్లె గట్టు మీద మొదలై అక్కడే ముగుస్తుంది. ఇదో కొత్త కోణం.

కథలో పోరాట దృశ్యాల్లో చావులు అతి సహజంగా ఉంటాయి. రైతుల ముఖాల్లో దైన్యమే అడుగడుగునా కనిపిస్తుంది. వారంతా ఎక్కడ చూసినా గుంపుగానే కదులుతూ ఉంటారు - మూక మనస్తత్వం.

క్యుజ సినిమా అంతటా సీరియస్‌గానే ఉంటాడు. ఎక్కడా పెద్దగా హావభావ ప్రదర్శన చేయడు. మొదట్లో కత్తియుద్ధం ముఖాముఖిలో అతి తక్కువ కదలికల్లో చాకచక్యంగా ప్రత్యర్ధిని పొడిచేస్తాడు. ఇది తర్వాతి సినిమాల్లో ఒక అడుగుజాడలా కనిపిస్తుంది. కాంబే చనిపోయిన దోపిడీ దొంగల చిట్టా వేసి ఒక్కోటి కొట్టి వేయడం, ప్రణాళిక ప్రకారం దారి మళ్ళించి ఒంటరిలా చేసి హతమార్చటం చదరంగపు ఎత్తుల్లా అనిపిస్తాయి.

ఇంకో ఆకట్టుకునే అంశం ఏమంటే, చనిపోయిన నలుగురు సమురాయ్‌లంతా తుపాకీ దెబ్బకి గుర్రై మరణిస్తారు. అంటే, సమురాయ్ ఇంకొకరి చేతిలో చావడం అంత సులభం కాదు అని అర్ధం వచ్చేలా కథ అల్లారు. నిజానికి తుపాకి యంత్రమే కదా! అలా కత్తి, మల్లయుద్ధాలు నేర్చిన వారిని ఒక్క నిముషంలో దూరం నుంచి చటుక్కున చంపేయడం వీరత్వం కాదు అని అంతరార్థం కావచ్చు.

**టెక్నిక్ పరంగా ఆకట్టుకునే అంశాలు:**
కురసావా తన సినిమాల్లో డీప్ ఫోకస్ పద్ధతి వాడతాడు(బ్యాక్‌గ్రౌండ్ బ్లర్ లేకుండా ). అందువల్ల ముందు, మధ్య, వెనుక అన్నీ బాగా స్పష్టంగా కనిపిస్తాయి. మాములుగా ఆ కాలంలో ఒక కెమేరానే వాడేవారు. ఈయన ఒకేసారి మూడు నాలుగు కెమేరాలు వాడేవాడట. అందువల్ల ఒకే దృశ్యం నాలుగైదు కోణాల్లో ఒకేసారి రికార్డై విభిన్నత చూపటానికి పనికొచ్చేదట. చావు దృశ్యాల్లో స్లోమోషన్ వాడటం ఈయన ప్రత్యేకత.

కురసావ సినిమాల్లో ఇంకో ముఖ్య టెక్నిక్ బ్యాక్‌గ్రౌండ్. ముందు ఫ్రేములో ఏమి కథ జరుగుతూ ఉన్నా, వర్షమో, గాలో, మంటో,మబ్బులో, ఇలా కదిలి ఆకట్టుకుంటూ కథకి ఊతం ఇచ్చే బ్యాక్‌గ్రౌండ్ వాడతారు. అలానే ప్రతి ఫ్రేంలో కదలికలు ఒక నియమిత కోణంలో ముందో వెనుకో కనిపిస్తూనే ఉంటాయి. ఆఖరి పోరాట దృశ్యాల్లో వాన, బురద సినిమాకి ఒక గంభీరతని తెచ్చి పెట్టిందని చూస్తే తెలుస్తుంది. ఇలా నీడబొమ్మలని (silhoutte) వాడుకోవడం, కొండవాలుల్లో మనుషులు, గుర్రాలు నెమ్మదిగా పైకి తేలడం, దూరం నుంచి చూపే కెమెరా కన్ను వల్ల మనం పై నుంచి అన్నీ చూస్తున్న అనుభూతి కలగజేయడం, ఇవన్నీ టెక్నాలజీ లేని ఆ రోజుల్లో గొప్ప ప్రతిభా విశేషాలే. ప్రతి ఫ్రేమూ ఒక పెయింటింగ్‌లా కంపోజిషన్, లైటింగ్, నటుల భావప్రకటన, ఇవన్నీ అడుగడుగునా అనిపించేలా తీయడం గొప్పే మరి.

అసలు మూడు గంటలు తీసిన సినిమాని, పాశ్చాత్యుల కోసం రెండు గంటలకు కుదించి వదిలారట. ఇంకెందుకు ఆలస్యం నెట్ లో వెతికి ఈ సినిమా చూసేయండి.

అప్పారావు ముప్పాళ్ల
https://qr.ae/pyVxK1

## జోజో ర్యాబిట్ సినిమా గురించి వివరించగలరా?

*ఏ దేశచరిత్ర చూసినా ఏమున్నది గర్వకారణం*
*నరజాతి చరిత్ర సమస్తం పరపీడన పరాయణత్వం.* ~శ్రీశ్రీ

మానవజాతి చరిత్ర నిండా ఒకడు మరొకడిని పీడించటమో, పాలించటమో. అసలు మానవుడికి ఘర్షణ పట్ల ఉన్న ఆకర్షణ తనివి తీరనిది.

థోర్: రాగ్నరోక్ చిత్ర దర్శకుడు టైకా వైటిటి నటించి, దర్శకత్వం వహించిన చిత్రం. 2004లో క్రిస్టీన్ ల్యూనెన్స్ రచించిన *కేజింగ్ స్కైస్* ఆధారంగా 2019లో వచ్చిన చిత్రమిది. 2020లో అత్యుత్తమ అడాప్టెడ్ స్క్రీన్‌ప్లేగా ఆస్కార్ అందుకుంది.

థోర్ చిత్రంలాగే మంచి వినోదాత్మక చిత్రం అయియుంటుందని చూడటం మొదలుపెట్టాను. మొదటి అరగంట నవ్వుల యేరులా సాగిన చిత్రం తరువాత ఉలిక్కిపడేలా మలుపు తిరిగి హృదయం బరువెక్కేలా ముగిసింది.

హిట్లర్ నాయకత్వంలోని జర్మనీలో నాజీ సిద్ధాంతాలకు ప్రభావితుడై యూదులను ద్వేషించే పిల్లవాడు జోజో. రకరకాల పరిస్థితుల్లో తాను అభిమానించే, ఆరాధించే హిట్లర్ ప్రతిస్పందనలు ఎలా ఉంటాయో ఊహించుకుంటూ అలాగే ప్రవర్తిస్తుంటాడు. అతని ఊహల్లో హిట్లర్ కనపడి తమాషా సలహాలివ్వటం వినోదంగా ఉంటుంది. హిట్లర్‌గా దర్శకుడే (టైకా వైటిటి) నటించాడు.

జోజో తండ్రి రెండవ ప్రపంచ యుద్ధంలో పోరాటానికి వెళ్ళి ఉంటే, తల్లి హిట్లర్ సిద్ధాంతాలను వ్యతిరేకించే విప్లవకారులకు మద్దతిస్తూ, తమ ఇంట్లోని ఒక రహస్య గదిలో ఒక యూదు అమ్మాయికి ఆశ్రయమిస్తుంది. ఆ అమ్మాయి ఒకానొక రోజ జోజో కంట పడుతుంది. ఆమెను నాజీలకు అప్పజెప్పాలని ప్రయత్నించబోయిన జోజో అలా చేస్తే తన తల్లి ఇరుకున పడుతుందని ఆగిపోతాడు. కానీ ఆ అమ్మాయిని ఎలాగయినా ఇంటి నుండి తరిమేయాలని చూస్తుంటాడు.

అలా ఒక రోజ హిట్లర్ సిద్ధాంతాల కరపత్రాలను పంచుతూ వెళ్తోన్న జోజోకు ఊళ్ళోని ప్రధాన కూడలిలో దేశద్రోహి అని ఉరి తీయబడి వేలాడుతున్న తల్లి శవం కనబడుతుంది. అది తన తల్లి అని జోజో తెలుసుకునే విధానం, ఆ దృశ్యం దర్శకుడి ప్రతిభకు అత్యుత్తమ నిదర్శనం. ఆ బాలుడిలో చెలరేగిన అలజడి, దుఃఖం అద్భుతంగా చూపాడు దర్శకుడు. బాలుడి నటన అసాధారణం.

యావత్ ప్రపంచం హిట్లర్‌ను ఆపేందుకు చేస్తున్న యుద్ధం తమ ఊరు చేరినప్పుడు అనాధ అయిన జోజో, యూదు అమ్మాయికి సహాయం చెయ్యటానికి పూనుకుంటాడు.

వినోదంగా మొదలై విషాదంగా మారి ప్రతీ మనిషి చెంప ఛెల్లుమనేలా ముగుస్తుంది చిత్రం. నటీనటులందరూ పాత్రలకు ప్రాణం పోసారు. దర్శకుడి ప్రతిభ కథ, కథనం, మాటలు, దృశ్యాల్లో విదితం. వెరసి ఒక మంచి చిత్రమే కాదు, అద్భుతమైన, చూడవలసిన చిత్రం జోజో ర్యాబిట్.

యుద్ధం ప్రతిఫలం ఒక్కడికి దక్కేది కాదు, పర్యవసానం ఒక్క రోజు అనుభవించేసేది కాదు. పిల్లలను, వారి అమాయకత్వాన్ని చిదిమేసే యుద్ధం ఎందుకు వచ్చింది? ఎవడో ఒక్కడి ఉన్మాదం వల్లా లేక ఆ ఉన్మాదిని ప్రేరేపించి, తోడు నడిచే తోడేళ్ళ వల్లా?




అలోక్ నంద ప్రసాద్

https://qr.ae/pyikmr

## ఆంగ్ల సినిమా 'గ్రీన్ మైల్' విశేషాలేమిటి?

'ది షాషాంక్ రిడెంప్షన్' దర్శకుడు ఫ్రాంక్ డారబాంట్ మరొక స్టీఫెన్ కింగ్ నవల ఆధారంగా తీసిన, 1999లో విడుదలైన సినిమా **ది గ్రీన్ మైల్**.

ఒకానొక వృద్ధాశ్రమంలో విశ్రాంతి సమయంలో సినిమా చూస్తూ హఠాత్తుగా ఉద్వేగానికి గురైన పాల్ తన గతంలోని ఒక ఘట్టాన్ని సహచరికి వివరించటం మొదలెడతాడు.

1935లో ఒక జైలులో మరణశిక్ష పడ్డ ఖైదీల విభాగాధికారి పాల్ (టామ్ హ్యాంక్స్). జైలులోని ఆ విభాగం పేరే 'గ్రీన్ మైల్'. మరణశిక్ష అమలు జరిగేంత వరకు ఆ ఖైదీల పర్యవేక్షణ పాల్ కర్తవ్యం.

ఇద్దరు చిన్నారి పాపలను దారుణంగా అత్యాచారం చేసి, హత్య చేసిన నేరానికి మరణ శిక్ష పడిన జాన్ (మైకెల్ డంకన్) ఒక రోజు ఆ జైలుకు తరలింపబడతాడు. ఆ ఆరున్నర అడుగుల నల్లజాతి దృఢకాయుడిని చూసి పాల్ సహా జైలు అధికారులంతా కలవరపడతారు, అతనొక్కడే ఎదురు తిరిగితే వారంతా కలిసి కలబడినా కూల్చలేరని. పైగా నల్లజాతీయులంటే విపరీతమైన వివక్ష ఉన్న కాలమది.

అయితే జాన్ మృదుస్వభావం చూసిన పాల్ ఆశ్చర్యపోయి, అతని ప్రవర్తనను గమనిస్తుంటాడు. నిరతం ప్రార్థనలో గడుపుతూ, వీలైనంత తక్కువ మాటలతో అమాయకుడిలా ఉంటాడు జాన్. అలా ఒకసారి నియంత్రణ తప్పిన జైలు అధికారి పర్సీ రేపిన గొడవ హడావుడిలో జాన్ చేసిన పని పాల్‌ను విపరీతమైన ఆశ్చర్యానికి గురిచేస్తుంది.

తాను చూసింది కలో నిజమో తేల్చుకోలేని స్థితిలో ఉన్న పాల్‌తో తనకు వచ్చీ రాని ఆంగ్లంలో తను చేసిన పనిని వివరిస్తాడు జాన్. మదిలోని అన్నిరకాల వివక్షలను పక్కన పెట్టి జాన్‌ను పాల్ నమ్మగా, ఏళ్ళుగా పాల్ బాధ పడుతున్న మూత్రాశయ ఇన్ఫెక్షన్‌ను నిముషంలో నయం చేస్తాడు జాన్. కేవలం స్పర్శతో ఎంతటి గాయాన్నయినా, ఎలాంటి వ్యాధినయినా నయం చేయగల జాన్ శక్తిసామర్థ్యాలు ప్రత్యక్షంగా చూసిన పాల్ నైతిక సందిగ్ధంలో పడిపోతాడు. పర్సీ మినహా మిగతా అధికారులంతా జాన్ పట్ల సానుభూతి చూపటం మొదలెడతారు.

ఉద్యోగానికి ప్రమాదం అని తెలిసీ, జాన్‌ను రహస్యంగా జైలు బయటకు తీసుకెళ్ళి, క్యాన్సర్ బారిన పడిన జైలు ప్రధానాధికారి భార్యకు రోగం నయం చేయిస్తాడు పాల్. ఆ తరువాత జాన్ తన కథను చెప్పగా, అతడు నిర్దోషి అని తెలుసుకుంటాడు. అయినప్పటికీ అతడిని నిర్దోషిగా నిరూపించటం అసాధ్యమని తెలిసి జైలు నుంచి తప్పిస్తానని, దూరంగా వెళ్ళిపోయి బ్రతకమని చెబుతాడు పాల్.

మనిషి నీటిని, నిప్పును స్పృశించి వాటి నైజం తెలుసుకున్నట్టు మంచిచెడులను స్పృశించే శక్తి కలిగిన జాన్ తాను ఈ లోకంలో బ్రతకదలుచుకోవట్లేదని, చుట్టూ ఉన్న చెడు తనకు ప్రశాంతత లేకుండా

చేస్తోందని, నిజానికి మరణశిక్ష తనకు విడుదల అని చెబుతాడు. అధికారులంతా కలిసి జాన్ ఆఖరు రోజులు సంతోషంగా గడిపేలా చేస్తారు.

జాన్ అంత దాకా అసలు సినిమా అన్నదే చూడలేదని తెలుసుకుని, మరణశిక్షకు ముందు రోజు అతనికి ఒక సినిమా చూపిస్తారు. రిటైర్ అయ్యాక వృద్ధాశ్రమంలో ఉన్న పాల్ ఆ సినిమా చూసినపుడే గత జ్ఞాపకాల్లోకి వెళతాడు.

అద్భుతాలు చేసేడని ఒక మనిషిని రెండు వేల ఏళ్ళకు పైగా దేవుడిగా కొలుస్తున్నవారు, అలాంటి అద్భుతాలనే ఒక నల్లజాతీయుడు చేస్తే ఎలా స్పందిస్తారు అన్న ఆలోచనతో వ్రాసిన కథ ఇది అనిపిస్తుంది.

స్పాయిలర్ లేకుండా కథ చెప్పటం వెనుక కారణం - కథ సాంతం తెలిసినా చూడవలసిన సినిమా కాబట్టి, ఈ సినిమా కథపై కాక కథనం, భావోద్వేగాలు, మానవ సహజమైన నైతిక సంశయాలపై నడుస్తుంది కాబట్టి. ప్రేక్షకుడిలో పలు భావనలను ఘాటుగా కలుగజేస్తుంది. మానవత్వానికి, దైవత్వానికి నిర్వచనాన్ని చూపుతుంది.

ఏ వివక్ష లేకుండా శిక్ష విధించే చట్టాలుంటాయా?

మనిషి రాసుకున్న చట్టాలు మానవాతీతులకు వర్తిస్తాయా?

ఒకరి నమ్మకం నలుగురి ఉన్మాదంగా మారవలసిందేనా?

మంచి వ్యక్తులకు లోకం పంచేది వంచనేనా?

కథనం, దర్శకత్వం, నటన, నేపథ్య సంగీతం అన్నీ బాగా కుదిరిన ఈ సినిమా హిట్ అయ్యి విమర్శకుల ప్రశంసలు అందుకున్నా, అసౌకర్యాన్ని, వ్యాకులతను మిగిల్చిపోయేది కావటంతో మళ్ళీ చూడాలన్నా మది చూడనివ్వదు. ముఖ్యంగా ఆఖరున జాన్ కళ్ళు, హావభావాలు రెండు మూడు రోజుల దాకా వెంటాడతాయి.

సినిమాలు సాధారణంగా సంతృప్తినో అసంతృప్తినో మిగిల్చిపోతాయి. కొన్ని సినిమాలు మాత్రం అనుభూతిని మిగిల్చిపోతాయి. ఆ అనుభూతి ప్రేరణ కలిగించేది అయి ఉండవచ్చు (ఉదా: ది షాషాంక్ రిడెంప్షన్) లేదా **ది గ్రీన్ మైల్**లా విచారాన్ని కలిగించేది అయి ఉండవచ్చు. అయినప్పటికీ ఒక సగటు ప్రేక్షకుడిగా ఇది అద్భుతమైన సినిమా అనకుండా, తప్పక చూడమని సిఫార్సు చెయ్యకుండా ఉండలేను.

అలోక్ నంద ప్రసాద్
https://qr.ae/pyVxYV

## తప్పకుండా చూడాల్సిన కొన్ని యానిమేషన్ సినిమాలు ఏమిటి?

ముందుగా మన పురాణ ఆధారిత చిత్రాలు రెండు:

**రామాయణ - ది లెజెండ్ ఆఫ్ ప్రిన్స్ రామ్**



ఈ చిత్రం భారత ప్రభుత్వం, జపాన్ వారి సంయుక్త ప్రయత్నం.
ఆంగ్లంలో రాముడి పాత్రకు బ్రయన్ క్రాన్స్టన్, హిందీలో రావణుడి పాత్రకు అమ్రీష్ పురి డబ్బింగ్ చెప్పారు. పాత చిత్రమైనా ఎక్కువ కల్పితాలకు పోకుండా తీయటం వల్ల నేటికీ చూట్టానికి బాగుంటుంది.

**అర్జున్ - ది వారియర్ ప్రిన్స్**




ఈ చిత్ర కథనం చాలా బాగుంటుంది. అర్జునుడు ఒక యువరాజు నుండి మహాయోధుడిగా మారే క్రమం, అందుకు దారితీసిన పరిస్థితులను అద్భుతంగా చూపారు.
బాలపాండవులు రాజ్యానికి తిరిగొచ్చి ద్రోణుడి వద్ద శిష్యులుగా చేరటంతో కథ మొదలై, పాండవుల అజ్ఞాతవాసం పూర్తయ్యే గోహరణ పర్వంతో చిత్రం ముగుస్తుంది. హింస పాళ్ళు కాస్త ఎక్కువైనందున మరీ చిన్నపిల్లలకు చూపవద్దు.

ఇవి కాక నాకెంతగానో నచ్చే ఆనిమేషన్ చిత్రాలు స్టూడియో గిబ్లి వారివి. దురదృష్టవశాత్తూ చాలా మందికి వీటి గురించి తెలియదు. నా స్నేహితులందరికీ వారి పిల్లలకు ఈ చిత్రాలు చూపమని (గట్టిగా) సలహా ఇచ్చా. చూపిన పిమ్మట ప్రతి ఒక్కరు కృతజ్ఞతలు తెలిపారు. వీటిలో నా పిల్లలకు బాగా నచ్చినవి:

**మై నైబర్ టొటోరో**




ఇద్దరు బుజ్జి తల్లులు వారి నాన్నతో ఓ పల్లెలో నివాసానికి వస్తారు (ఎందుకు అనేది సినిమాలో చూస్తే బాగుంటుంది). అక్కడ ఆ పిల్లలకు టొటోరో పరిచయం, తద్వారా వారి జీవితం ఎలా మారింది అన్నది ఖచ్చితంగా చూడాలి.

**స్పిరిటెడ్ అవే**




ఇది ఆస్కార్ గెలుచుకున్న మొట్టమొదటి ఆనిమేటెడ్ చిత్రం.
కాస్త గారాబంగా పెరిగిన పాప తన తల్లిదండ్రులను కాపాడుకోటానికి భయం, గుబులును వదిలి, పడిన కష్టం, ఆ కష్టంలోనూ మంచిని వదలని వైనం చూడముచ్చటగా ఉంటుంది.

**కికీస్ డెలివరీ సర్వీస్**




ఒక బుల్లి మాంత్రికురాలు కొత్త ఊరిలో తన కాళ్ళపై నిలబడటానికి నిజాయితీగా చేసిన ప్రయత్నం ఎంతో ఆహ్లాదకరంగా చూపించారు.

వారి చిత్రాల్లో రమణీయ ప్రకృతి దృశ్యాలు, తల్లిదండ్రుల వ్యవహార శైలి, నైతిక విలువలు (ఉపదేశాలేవీ లేకుండానే) అత్యద్భుతంగా ఉంటాయి.

అలోక్ నంద ప్రసాద్<br>https://qr.ae/pGdsh8

యానిమేషన్ చిత్రాలు తీయడంలో ఎక్కువగా జపాన్‌లోని స్టూడియో గిబ్లీ, అమెరికాలోని డిస్నీ, పిక్సార్ సంస్థల వారు ముందంజలో ఉన్నారని నా అభిప్రాయం. వారు తీసిన వాటిలో నాకు బాగా నచ్చినవి, తప్పక చూడవలసినవి:

**బిగ్ హీరో 6**

హీరో హమాడా హై స్కూల్ గ్రాడ్యుయేషన్ పూర్తి చేసిన ఒక పద్నాలుగేళ్ళ కుర్రాడు. అతనికి రోబోటిక్ ప్రోగ్రామింగ్ లో మంచి పట్టు ఉంటుంది. అయితే అతను తాను తయారు చేసిన రోబోతో చట్టవిరుద్ధమైన రోబో ఫైట్లలో పాల్గొంటూ సమయాన్ని వృథా చేస్తూ ఉంటాడు.




హీరో అన్న టడాషి హమాడా ఇలాంటి జూదాల నుండి తమ్ముడి దృష్టి మరల్చడానికి హీరోని తాను పనిచేస్తున్న ఇనిస్టిట్యూట్ రీసర్చ్ లాబ్ కి తీసుకెళ్ళి తాను తయారు చేసిన బే మ్యాక్స్ అనే ఒక రోబో నర్సుని చూపిస్తాడు. చూడటానికి ముద్దుగా బొద్దుగా ఉన్న ఆ రోబోలో పదివేల మెడికల్ ప్రొసీజర్లు ప్రోగ్రాం చేయబడి ఉంటాయి.

టడాషి ప్రేరణతో హీరో మైక్రోబాట్ అనే చిన్న చిన్న అద్భుతమైన మ్యాగ్నెటిక్ రోబోట్స్ తయారు చేస్తాడు.

వాటిని చూసి ఇనిస్టిట్యూట్ ప్రొఫెసర్ హీరోకి ఇనిస్టిట్యూట్లో అడ్మిషన్ ఇస్తాడు. అయితే అప్పుడే ఆ లాబ్లో అగ్ని ప్రమాదం జరగడం, అందులో టడాషి చనిపోవడం జరుగుతుంది. అది ఆక్సిడెంట్ కాదని, ఎవరో కావాలని ఆ పని చేసారని తెలుసుకున్న హీరో ఆ తరువాత బే మ్యాక్స్, టడాషి స్నేహితులతో కలిసి ఏం చేసాడో చాలా ఆసక్తికరంగా ఉంటుంది. ఇందులో బే మ్యాక్స్ అనే రోబోటిక్ నర్సుని చూస్తే ఇలాంటి రోబోలు నిజంగా ఉంటే బాగుణ్ణు అనిపిస్తుంది.

**ఇన్ సైడ్ ఔట్**




ఇది ఒక విచిత్రమైన యానిమేషన్ సినిమా. ఎక్కడైనా సినిమాలో ఎమోషన్స్ ఉంటాయి, ఎమోషన్స్‌తో సినిమా నడుస్తుంది. ఈ ఎమోషన్స్ అనేవి పాత్రలు పలికించేవి. కానీ ఇక్కడ ఏమోషన్సే పాత్రలు. ప్రతి మనిషిలోనూ ఉండే ఆనందం, కోపం, భయం, చిరాకు, బాధ అనే ఎమోషన్స్ కి రూపాలు ఉంటే వాటి ప్రవర్తన తీరు ఎలా ఉంటుందో చూపిస్తారు. ఒక కుటుంబంలో తల్లి, తండ్రి, కూతురు ఉంటారు. 11 ఏళ్ళ రిలే అనే ఆ పాప బుర్రలో నడిచే రక రకాల ఎమోషన్స్ గురించి ఉంటుంది ఈ సినిమాలో.

**జటోపియా**




జటోపియా అనే పట్టణంలో సాధు జంతువులు, క్రూర జంతువులు కలిసిమెలిసి పక్కపక్కనే నివసిస్తూ ఉంటాయి. ఏ జంతువూ సాటి జంతువుకు హాని చేయదు.

జ్యూడీ హాప్స్ అని కుందేలు చిన్నప్పటి నుండి పోలీస్ ఆఫీసర్ అవ్వాలని కలలు కంటుంది. కష్టపడి జటోపియాలో పోలీస్ ఆఫీసర్‌గా చేరుతుంది.

ఒక రోజ తన భర్త తప్పిపోయాడనీ ఎప్పటినుండో బాధపడుతున్న ఒట్టర్ (నీటి కుక్క) కేసు తాను సాల్వ్ చేస్తానని వాళ్ళ ఆఫీసర్ని అడిగి ఇన్వెస్టిగేట్ చేస్తుంది. ఒక నక్కతో కలిసి దర్యాప్తు చేస్తున్న హాప్స్ ఒక దారుణమైన విషయం తెలుసుకుంటుంది. ఆ తరువాత కథ సుఖాంతం అవటానికి హాప్స్ చేసిన సాహసాలు వినోదంగా, సందేశాత్మకంగా ఉంటాయి.

ఈ సినిమాని మనుషుల్ని కాకుండా జంతువుల్ని పెట్టి తీయడంతోనే మనకు చేరవలసిన సందేశం చేరేలా చేసాడు దర్శకుడు. రకరకాల జంతువులు ఒకే సిటీలో కలిసిమెలిసి ఉన్నా అవి ఎంత సఖ్యంగా ఉన్నాయో చూపిస్తూ, సమాజంలోని కొన్ని దుష్టశక్తులు ఆ సఖ్యతను పాడుచేసి ఆ జంతువులను రెండు వర్గాలుగా వేరు చేసి, ఒక వర్గంపై పట్టు సాధిద్దామని చేసిన దుర్మార్గపు ఆలోచనలు ఏ విధంగా బెడిసి కొట్టాయో చూపించాడు.

## గ్రేవ్ ఆఫ్ ది ఫైర్ ఫ్లైస్

ఇది చాలా చాలా విషాదభరిత సినిమా. సున్నిత మనస్కులైతే ఏడ్చేస్తారు. రాయి లాంటి గుండెకైనా, ఈ సినిమా చూస్తే కన్నీరు ఆగదు. యుద్ధం ఎంత మంది జీవితాలని ఏ విధంగా నాశనం చేస్తుందో ఎంతో హృద్యంగా చూపించిన సినిమా.




జపాన్‌లో కోబ్ అనే ఊరిలో ఒక కుటుంబం - తండ్రి నావికా దళంలో పని చేస్తే తల్లి ఒక గృహిణి. వారికి 15 ఏళ్ల అబ్బాయి సీట, 5 ఏళ్ళ పాప సెత్సుకో. ఇంతలో రెండో ప్రపంచ యుద్ధం వస్తుంది. తండ్రియుద్ధంలో పాల్గొంటుంటే పిల్లలిద్దరినీ తీసుకుని తల్లి బాంబ్ షెల్టర్ కి వెళ్తుండగా విమానాలు బాంబుల వర్షం కురిపించడంతో ఊరంతా ధ్వంసం అయిపోతుంది. ఆ దాడిలో అన్నా చెల్లెలు క్షేమంగా బయట పడతారు కానీ తల్లి చనిపోతుంది. చెల్లికి తన బాధ తెలీకుండా, కష్టం కలగకుండా ఎంతో బాధ్యతని మీద వేసుకుని ఆ పాపను తల్లి తండ్రి తానే అయి సంరక్షిస్తూటాడు. అయితే యుద్ధ పరిస్థితుల్లో తలదాచుకోడానికి నీడ లేక తినటానికి తిండి దొరక్క ఎన్నో ఇక్కట్లు పడతారు. కొన్ని రోజులకి ఆకలితో సెత్సుకో చనిపోతుంది.

ఇలా యుద్ధం ఒక కుటుంబాన్ని ఏ విధంగా చిన్నాభిన్నం చేసిందో చూస్తే కన్నీరు ఆగదు. ఇందులో మనం చూసేది కేవలం ఒక కుటుంబం కథ. కానీ దర్శకుడు మనకు సినిమాలో సూటిగా చూపించకుండా ముఖ్యపాత్రల వెనుక అనేక కుటుంబాలు పడుతున్న బాధలను చూపిస్తాడు. ఇలా ఒక దేశం మొత్తం ఏ విధంగా ఇన్ని రకాల బాధలు అనుభవించిందా అని ఆలోచిస్తే నిద్ర పట్టదు. మంచో చెడో యుద్ధాలు ఎందుకు? ధనం కోసమా, దర్పం కోసమా, అధికారం కోసమా? ఒక చిన్న పిల్ల

ఆకలి తీర్చలేని ఇవన్నీ ఎందుకు, దేశ ప్రజల ప్రాణాలు నిలిపే శక్తి లేనప్పుడు ఇవన్నీ ఎందుకు అనే ప్రశ్న మనసును తొలిచేస్తుంది. అలా చూస్తుండగానే సీట కూడా ఆకలితో చనిపోతాడు.

పై వన్నీ పిల్లలతో చూడదగిన సినిమాలే. ఒక్క గ్రేవ్ ఆఫ్ ది ఫైర్ ఫ్లైస్ మాత్రం కన్నీటిని  తట్టుకునే శక్తి ఉంటే చూడవచ్చు.

రామ్ కొత్తపల్లి

https://qr.ae/pK8frZ

## ప్రపంచంలో ఆస్కార్ గెలిచిన మొదటి ఆంగ్లేతర ఆనిమేటెడ్ సినిమా ఏది?

అభిమానులు ఆనిమేటెడ్ ప్రపంచంలో ఈ సినిమాను G.O.A.T (అన్నిటిలో గొప్పది) అంటే, అభిమానులు కాని వారు సైతం చూసినంత సేపు ఈ సినీలోకంలో మైమరచిపోక ఉండలేరు. ఇంతదాకా ఈ సినిమా సిఫార్సు చేస్తే చూసినవారంతా వారి పిల్లల్లో కాస్తో కూస్తో మంచి మార్పు తెచ్చిందని మెచ్చుకున్నవారే.

కళ్ళను కట్టిపడేసే దృశ్యాలు, మనసును హత్తుకునే సన్నివేశాలు ఈ సినిమాలో బోలెడు. అయితే ఇవి స్టూడియో ఘిబ్లి ప్రతి సినిమాలో ఉండేవే. మరి ప్రపంచవ్యాప్తంగా ప్రేక్షకులను విశేషంగా ఆకట్టుకునేంత ఏముంది? పైగా అప్పటికి అమెరికాలో డిస్నీకి సైతం సిద్ధించని ఆస్కార్ ఘనత ఈ పరదేశీ సినిమాకు ఎలా దక్కింది?

కొవ్వొత్తి వెలుగు, పిడికిలి బిగింపు, ముఖంపై చిటపటలాడే వాన చినుకులు, పొగమంచులోంచి తొంగిచూసే విమానం వంటి దృశ్యాలు మామూలు సినిమాల్లో అవసరమైనా పెద్దగా గమనికకు రానివి. వీటిని ఆనిమేట్ చెయ్యటం కష్టం. అందుకే కొందరు దర్శకులు ఆనిమేటెడ్ సినిమాల్లో ఇలాంటి దృశ్యాలను అధునాతన సాంకేతికతతో చూపటమో, లేదంటే లాఘవంగా వీటిపై దృష్టి పడకుండా చెయ్యటమో చేస్తారు. కానీ, '*ఆనిమేషన్ కొరకు కంప్యూటర్ గ్రాఫిక్స్ వాడటమంటే జీవితాన్ని ఎగతాళి చెయ్యటమే*' అని ఒకానొక సందర్భంలో ఘాటుగా జవాబిచ్చారు ఈ సినిమా దర్శకులు హయావో మియాజాకి. ఒక ఆనిమేటర్ ఉపకరణాలు పెన్సిల్, సాధన మాత్రమేనని పలుమార్లు నొక్కివక్కాణించారు.

తాను పెరిగిన పరిసరాల అందాన్ని, మనుషులతో బంధాన్ని హృద్యంగా, దృశ్యకావ్యంగా చూపగల మేధావి హయావో మియాజాకి. పైగా ఇదంతా ఆనిమేటెడ్ సినిమాల ద్వారానే చెయ్యటం ఆయన మేధస్సుకు అపురూపమైన తార్కాణం. ప్రకృతి దృశ్యాలు, గదుల్లో అలంకరణలు, వస్త్రాలు, పాత్రల ముఖకవళికలు సూక్ష్మ వివరాలతో సినిమాలో లీనమయేలా చేస్తాయి, ఖచ్చితంగా.

మియజాకి స్థాపించిన స్టూడియో ఘిబ్లి నిర్మించిన సినిమాలన్నీ 8 అరల్లో చేత గీయబడ్డ బొమ్మలతో సెకనుకు 24 ఫ్రేములతో ఆనిమేట్ చేయబడ్డవే. మియాజాకి ఇలా గీసిన ప్రతి ఒక్క బొమ్మను పరిశీలించి ఆమోదించాకే ఆ బొమ్మ సినిమాలో దృశ్యంగా తర్జుమా అవుతుంది. సినిమాలోని ఒక నిముషం వ్యవధి గల దృశ్యాలను ఇలా ఆనిమేట్ చెయ్యటానికి సుమారు నెల రోజులు తీసుకుంటారు. అందుకే వారి సినిమాలను ఎక్కడ పాజ్ చేసినా ఆ దృశ్యం వాల్‌పేపర్‌గా వాడుకునేలా ఉంటుంది.

మదిలోని చింతలు, భయాలు కళ్ళెదుట నిలువెత్తున సాక్షాత్కారమైతే? మార్పును ప్రతిఘటించే మనసుకు క్షణక్షణానికి బృహత్‌మలుపులు ఎదురైతే? నిలబడి కలబడగలమా... తలబడి ఎదురీదగలమా... వంటి సంశయాలను దాటి పరమావధి వైపు పయనం సాగించగలమా?

అంతటి అలజడిని మొక్కవోని దీక్షతో, లొంగిపోని నీతితో ఢీకొన్న బాలిక ప్రయాణమే **స్పిరిటెడ్ అవే**. టూకీగా, గారాబంగా పెరిగిన అమ్మాయి తన తల్లిదండ్రులను కాపాడుకునేందుకు మంత్రతంత్రాలు, ఆత్మలు, భూతాల నడుమ వెట్టి చాకిరీ చేస్తూ కూడా విలువలను విడువక, చెడును కూడా మంచిగా మారుస్తూ చేసే ప్రయాణానికి ఆస్కార్ సైతం దాసోహం అయింది.




The Pursuit Of Happyness, Forrest Gump వంటి సినిమాలు ప్రపంచవ్యాప్త ప్రేక్షకులకు ప్రేరణనందించిన సినిమాలుగా కీర్తి గడించాయి. ఓ సగటు వ్యక్తి అసాధారణ కష్టాలు, ప్రతికూలతలను దాటిన ప్రయాణం చూపిన సినిమాలకు అమెరికన్ ప్రజలు పట్టంగట్టటం సాధారణంగా జరిగేదే. అయితే ఆ సినిమాలు ఒక వ్యక్తి తనకు మించిన గమ్యాన్ని అందుకోటానికి తన సామర్థ్యాన్ని పెంచుకోవటంపై దృష్టి పెడితే **స్పిరిటెడ్ అవే** సినిమా ప్రతి వ్యక్తిలో సహజంగా ఉన్న బలాలను, చిత్తశుద్ధిని వెలికితీసి ఉపయోగించేలా ప్రోత్సహించటమే కాక, దాని పర్యవసానాన్ని కూడా హృద్యంగా చూపుతుంది.

ప్రపంచంలోని మాయ, సమాజపు డొల్లతనం కంటే తల్లిదండ్రుల గారాబమే లోకంగా పెరుగుతున్న ఓ పదేళ్ళ పాప ఆ తల్లిదండ్రులనే కాపాడుకోవలసిన పరిస్థితి వస్తే బేలగా ఉండిపోక తనకే తెలియని బలాన్ని తనలో వెతుక్కుని పోరాడటం అద్భుతమే అనిపిస్తుంది. అనుకోకుండా బందీ అయిపోయిన మాయా ప్రపంచంలోంచి తాను బయట పడటమే కాక తన తల్లిదండ్రులనూ రక్షించుకున్న తీరు సాహో అనేలా చేస్తుంది. ఎప్పటికప్పుడు ఎదురవుతున్న భీతికర పరిస్థితులు, చిత్రవిచిత్ర జీవులకు భయపడుతున్నా గమ్యం వైపు చెరగని ఏకాగ్రతతో, చెదరని నైతికతతో ఆ పాప చేసే ప్రయాణం అబ్బురపరుస్తుంది.

సినిమాలో చూపిన ప్రేతాలు, భూతాలు, చిదాత్మలు అన్నీ ఆ మర్మలోకాన్ని మించి భౌతిక ప్రపంచంలోని అడ్డంకులు, అవరోధాలు, చేయూతలకు సంకేతాలు. ప్రతీకవాదస్తులకు ఈ సినిమాలో దొరికే సాదృశ్య ఉపమానాలు కోకొల్లలు. అయితే, ఈ సినిమా విశేషంగా ప్రజాదరణ పొందటానికి కారణాలు కథలోని

బాహుళ్యం, కథనంలోని నిజాయితీ. పిల్లలకు పాప సాహసాలు కనిపించే దృశ్యాల్లోనే పెద్దలకు సమాజపు అతిశయాలు, అతిశయోక్తులకు బానిసలై బ్రతకటం కనపడుతుంది.

తన ప్రతి సినిమాలాగే ఇందులోనూ కొన్ని నిముషాలపాటు ఏమీ జరగని సన్నివేశాల నిశ్శబ్ద స్తబ్ధతలో అద్భుతమైన భావావేశాలు పండించారు దర్శకులు హయావో మియజాకి. తన మరో ఆణిముత్యమైన Princess Mononokeలో మనిషి దురాశకు పర్యావరణం బలవుతున్న వైనాన్ని నిర్మొహమాటంగా, ఏ మాత్రం దాపరికం లేకుండా చూపిన దర్శకులు ఇందులోనూ ఆ అంశాలను సున్నితంగా స్పృశించారు. ఇలాంటి సున్నితాంశాలు, సందేశాలు ఉన్నందున పెద్దలకు ఇది ఒకింత సందేశాత్మక చిత్రంగా అగుపడితే పిల్లలకు ఫ్యాంటసీ సాహసగాథగా గుర్తుండిపోతుంది.

అలోక్ నంద ప్రసాద్

https://qr.ae/pvx7DF

## 'నిదురించే తోటలోకి' (ముత్యాల ముగ్గు) పాట గొప్పతనం ఏమిటి?

కొన్ని పాటలు ఎదలో రొద పెడతాయి. పాటలో పదాలు అర్థం వెదకమని వెంటబడతాయి. పదే పదే ఆ పదాలు మనసులో రంగులరాట్నంలా గిరగిరా తిప్పి మెలిపెడతాయి. అలాంటి పాటే ఇది. ఈ పాట ముత్యాల ముగ్గు (1975) సినిమాలోది. దీన్ని వ్రాసింది గుంటూరు శేషేంద్రశర్మ. ఆయనది కాశ్మీర్ నుంచి వలస వచ్చి స్థిరపడ్డ కుటుంబం. ఇక ఈ పాట నేపథ్యం అందరికీ తెలుసు.

ముత్యాల ముగ్గు సినిమాలో పేదింటి పిల్ల పెళ్లి హఠాత్తుగా పీటల మీద ఆగిపోతే, పెళ్ళి చూట్టానికి వచ్చిన ఆమె అన్న స్నేహితుడు ఆమెని ఆదర్శంగా పెళ్ళి చేసుకుంటాడు . కానీ తన మేనమామ పన్నిన పన్నాగంలో చిక్కుకుని, భార్యను అనుమానిస్తాడు. అందుకు ఆమె ఇంట్లోంచి వచ్చి, ఒంటరిగా ఒక చోట పిల్లలతో పాటు ఉంటుంది. అనుకోకుండా అక్కడికి వచ్చిన భర్త పిల్లల్ని చూసినా గుర్తు పట్టడు. ఆమె చూడక ముందే వెళ్ళి పోతాడు. అలా పోతున్న భర్తను దూరం నుంచి చూసి వగచే దృశ్యంలో వచ్చే పాట ఇది.

పాట మొదలే గమ్మత్తైన పదాలు ఆకట్టుకుని నిలబెట్టేస్తాయి.

'నిదురించే తోటలోకి పాట ఒకటి వచ్చింది కన్నుల్లో నీరు తుడిచి కమ్మటి కల ఇచ్చింది'

తోట నిదురిస్తున్నదట. నిదురించేందుకు అది మనిషా, జీవమున్న జంతువా? సరే అలాగే అనుకుందాం. అందులోకి పాట రావడం ఏమిటి? వచ్చిందే పో, కన్నుల్లో నీరు తుడిచి, కమ్మని కల ఇవ్వడం ఏమిటి. ఎవరికి ఇచ్చింది తోటకా?

దీన్ని ఇలా అర్థం చేసుకుందాం. తోట అంటే నాయిక మనస్సు, వచ్చిన పాట ఆమె భర్త. ఎందుకంటే, కన్నుల్లో నీరున్నది ఎవరికి? నాయికకే కదా!

'రమ్యంగా కుటీరాన రంగవల్లులల్లింది, దీనురాలి గూటిలోన దీపంగా వెలిగింది. శూన్యమైన వేణువులో ఒక స్వరం కలిపి నిలిపింది, ఆకురాలు అడవికి ఒక ఆమని దయ చేసింది'

గుడిసెలో అందమైన ముగ్గులేసిందట, నిజానికి నాయిక ముగ్గులే సినిమా నిండా కనిపిస్తాయి. అలాంటిది ఆమె ఇంటికి, పాట వచ్చి ముగ్గులేసిందట. అలాగే దీనురాలి ఇంట్లో, కాదు.. కాదు.. గూట్లో దీపం అయిందట. ఇవన్నీ ఊహాత్మకంగా, భర్త జ్ఞాపకం తనను ప్రభావితం చేసిందని చెప్పటం. నిజానికి ఆమె పేదరాలు. భర్త డబ్బున్నవాడు. ఆమె కోసం చేయి చాచి పెళ్లి చేసుకోవడం ఆమెకు వెలుగునివ్వడమే కదా! శూన్యం అయిన వేణువులో స్వరం కలిపి నిలపడం అంటే, వేణువులో స్వరాలు మాయం అయితే మళ్ళీ అందులో అతని ఊహ స్వరంలా మారిందని ఇంకో భావం.

అసలా చివరి పదం ఈ పదాలన్నిటికి మకుటాయమానం.
'ఆకురాలు అడవికి ఒక ఆమని దయ చేసింది'

ఆకురాలు కాలంలో చిగురులు రావడం అనే భావం ఒక గమ్మత్తైన ప్రయోగం. అది కూడా ఆమని దయచేసింది అనే మాట పాదాన్ని ఇంకో అంతస్తుకి తీసుకెళ్లింది. దయ చేయటం అంటేనే గౌరవం ఇవ్వడం (ఇప్పటి వెటకారపు దయచేయండి కాదు).

ఇక దీని కంటే మించిన పదాలు, భావాలు చివర్లో మనకు కనిపిస్తాయి.
'విఫలమైన నా కోర్కెలు వేలాడే గుమ్మంలో ఆశల అడుగులు వినపడి అంతలో పోయాయి'

కోరికలు గుర్రాలవటం చూసాం. కానీ అవి గుమ్మంలో వేళ్ళాడటం ఆలోచింప చేసే పదచిత్రం. గుమ్మంలో నించుని బయటకు నిరాశగా చూసే చూపు వల్ల, ఆ కోర్కెలు గుమ్మంలో తాడుకు కట్టే మామిడాకుల్లా వేళ్ళాడుతున్నాయేమో? అవి కూడా విఫలమైన కోర్కెలే అని కవి ముక్తాయింపు. అయితే ఈ కోర్కెలు ఉన్న గుమ్మంలో ఒక్క క్షణం ఆశల అడుగులు వినపడి మళ్ళీ మాయం అయ్యాయి...అంటే ఎవరి అడుగుల కోసమో వెతుకుతూ కళ్ళు కాయలు కాచేట్టు చూస్తుంటే, అడుగులు వినపడి (భర్తవి) మళ్ళీ వెళ్లిపోయాయి. చివర్లో మెరిసే చమక్కు ఏమంటే,
'నది దోచుకు పోతున్న నావను ఆపండి' అనే వాక్యం

దీన్ని మనం 'నదిని దోచుకుపోతున్న నావ' అనుకుంటే అప్పుడు అది ఒక విచిత్ర పదప్రయోగం. నావ ఎక్కడన్నా నదిని తీసుకెళ్తుందా? కాదు, కాదు, దోచుకుపోతుందా? నది పైన నడిచే నావ, నదినే దోచుకోవటం ఏమిటీ. నది ఆమెలోని చైతన్యం, ఆశ. దాన్ని భర్త వెళ్తున్న నావ తీసుకెళ్తూ ఉందని కవి ఆలోచనగా మనం అనుకోవచ్చేమో.

అలా కాకుండా 'నది తానే నావనే దోచుకు పోతున్నది' అనుకుంటే, నది కావాలని తన భర్తను తీసుకెళ్తుందని నాయిక మనతో ఆరోపిస్తూ ఉందని అనుకోవాలి.

తర్వాత వచ్చే పదం చూడండి.
'రేవు బావురుమంటుందని నావకు చెప్పండి'
ఆమె ఆ నదికున్న రేవు లాంటిది. నది ఎండిపోతే పక్కని ఒడ్డు,దాని మీదున్న రేవు నిష్ఫలమే కదా!

ఇది చక్కటి చిక్కటి కవిత్వం. బోలెడు అంతరార్థాలున్న, ఉపమానాలున్న శ్లేషైన, అందమైన కవిత్వం. పాటలోని కవిత్వం మాత్రమే కాదు. చిత్రీకరణలో బాపూగారి ప్రతిభ చూస్తే, పాట మొదట్లోనే లాంగ్ షాట్ లో వెళ్తున్న పడవ, దాని పైన వెనుక భాగం కనిపించే హీరో. నాయిక కళ్ళ ముందు మిగిలిపోయిన, పారేసుకున్న ఫోటో. అదే కదా జ్ఞాపకం. అదే పాటకి మొదలు.

ఇక పాట వస్తున్నంత సేపూ గోదారి నదీతీరం, పడవ, గుడిసె ఇలా పాటలోని పదాలే మనకు కనపడుతుంటాయి. ఒకవేపు హీరో ఒంటరితనం, ఇంకో వేపు హీరోయిన్ ఒంటరితనం, మధ్య మధ్యలో, గతం తాలూకు జ్ఞాపకాలు. అన్ని దృశ్యాలు పాటకు అనుగుణంగా హృద్యంగా, మనసుకి హత్తుకునేట్టు ఉంటాయి. అదీ బాపూ సమ్మోహన మాయాజాలం.

ఇక కవిత్వం విషయానికొస్తే నిరాశగా భర్తకు దూరంగా, చేయని తప్పుకి శిక్ష అనుభవిస్తున్న సంగీత (నాయిక) జీవితంలోకి భర్త రావడం ఇక్కడ పరిణామం. కానీ కవి దాన్ని, ఆమె మనసు గంతులేసింది, పరిగెత్తింది అని వ్రాయలేదు. అమూర్తమైన (శరీరం లేని) వాటికి శరీరం ఊహించి, కొత్త భావాలను తెచ్చారు.

మొత్తం మీద ఈ పాట ఒకసారికి మనసుకెక్కేది కాదు. వినగా వినగా లోపలి భావాలు, కొంచెం కొంచెం విస్తరించి, మనసంతా పరచుకుని,ఎక్కడికో లాక్కెడతాయి.

ఎడబాటులోని గాఢత, ఆర్ద్రత సినిమాలో సంగీత కన్నుల్లో, శేషేంద్ర కవితలో ఎలా ప్రతిఫలిస్తుందంటే, పాట మొదట్లో వచ్చే గోదారి నీళ్ళలో సూర్యుడి కిరణాల లాగా మెరుస్తూ, అచ్చెరువొందేలా , ఆకట్టుకునేలా, మన జ్ఞాపకాల్లో కలకాలం నిలిచిపోయేలా.

అప్పారావు ముప్పాళ్ల
https://qr.ae/py9iMb

## కొండపొలం సినిమా నవలకు ఏ మేరకు న్యాయం చేసింది?

చిన్న సమాధానం :
కొండపొలం సినిమా నవలకు పూర్తి న్యాయం చేయలేదు. కానీ కొండపొలం నవలకు పూర్తిగా న్యాయం చేసే సినిమా తియ్యగలమా? కచ్చితంగా కష్టమే.

పూర్తి సమాధానం :
కొండపొలం నవల చాలా విస్తారమైనది. గొర్రెల కాపరుల జీవిత గాథ. నీళ్లు లేక అల్లాడుతున్న జీవాల్ని బ్రతికించుకోవాలనే తపన, చేసే యజ్ఞం ఈ కొండపొలం. ఆ కొండపొలం లో ఉన్న ప్రతి చిన్న విషయాన్నీ వివరిస్తుంది ఈ మూడు వందల యాభై పేజీల నవల. వాటితో పాటు కొండల్లో ఉన్న జీవానికి, జీవన విధానానికి అద్దం పడుతుంది ఈ నవల. అంత సారాన్ని ఒక రెండు మూడు గంటల సినిమాలో చూపించాలి అంటే కచ్చితంగా అసాధ్యం అనే చెప్పాలి.

**సినిమాలో చెప్పుకోదగ్గ మంచి గొప్ప విషయాలు:**
**సంగీతం:** కీరవాణి సంగీతం ఈ సినిమాకు పెద్ద బలం అనే చెప్పాలి. కథ మాటలు చాలా వరకు పుస్తకాన్ని అనుసరించే వెసులుబాటు ఉంది. కానీ సంగీతం కొత్తగా చేయాలి. 'దారులు దారులు' పాటతో కొండపొలం ప్రక్రియ మొదలు కావడం బాగుంది. హీరో పులిని మొదటిసారి చూసి గుబులు పడే సన్నివేశం నుంచి చివరికి ధైర్యంగా పులికి ఎదురు నిలబడి, పులితో తలబడే సన్నివేశం వరకు నేపధ్య సంగీతం సన్నివేశాలకు సరిగ్గా కుదిరాయి.

**నటీనటులు/సన్నివేశాలు:** కథలో ముఖ్యమైన ఘట్టాలు సన్నివేశాలు, మాటలు నవల నుంచి యథాతథంగా తీసుకున్నా, నటీనటులు సన్నివేశాలకు జీవం పోసారు అనే చెప్పాలి.
మచ్చుకు కొన్ని:
మొదట్లో కోటా శ్రీనివాస రావుగారు తాత పాత్రలో 'మనవడా నీకు ఏదో తట్టు తగిలింది, ఇన్నిసార్లు ఓడిపోకూడదు. నువ్వు కొండపోలం చెయ్యి' అనే సన్నివేశం.
అంకయ్యగా చేసిన రవి ప్రకాష్ రూపాయి ఫోన్ డబ్బా నుంచి వాళ్ళ ఆవిడకు ఫోన్ చేసి బాధపడే సన్నివేశం.
గురప్పగా చేసిన సాయిచంద్ కొండల్లో తప్పి పోయి నీళ్లు లేక గొర్రెలను పక్కకు తోసేసి బాధపడే సన్నివేశం.
వైష్ణవ్ తేజ్ చేస్తున్నది రెండే సినిమా అయినా సరే అతని ముఖంలో హావభావాలు చక్కగా పలికాయి. ఏదో తెలియని భయం, బెదురూ, నిస్సహాయత పులిని మొదటి సారి నేరుగా చూసినప్పుడు గుబులు, గుండెజారుడు లాంటి హావభావాలు భలేగా ప్రకటించాడు కానీ సివిల్స్ ఇంటర్వ్యూ సన్నివేశంలో హీరో ముఖంలో కనిపించాల్సిన ధైర్యం, తెగింపు, ఆత్మస్థైర్యం, హుందాతనానికి బదులుగా కొండపొలానికి వెళ్ళినప్పుడు ఉన్న బెదురూ, భయం, అయోమయమే కనిపించాయి.

**మాండలికం/భాష:** ఇంతకు ముందు చెప్పినట్టే ముఖ్యమైన సన్నివేశాలు, మాటలు నవల నుంచి యథాతథంగా వాడుకున్నారు. అదే మంచిదేమో అనిపించింది. ఈ మాండలికం నాకు కొత్త కాబట్టి సినిమా మొత్తంలో నటీనటులు అందరూ మాండలికాన్ని ఉచ్చారణ దోషాలు లేకుండా బాగానే చెప్పారని అనుకుంటున్నా, నాకు అయితే తప్పులు కానీ వేరే యాస కానీ తారసపడలేదు.

**నేపథ్యం/కొండ ప్రాంతాలు:** నవలలో కొండల గురించి కొండప్రాంతాల గురించి వర్ణన ఇంకా చాలా ఉన్నప్పటికీ సినిమాకు ఉన్న పరిమితులు వరకు అన్ని బాగానే కుదిరాయి. ఇంకా కొద్దిగా అందంగా, నవలలో వర్ణనలు స్పృశించేలా చూపగలిగితే బాగుండేది.

**ఇక సినిమాలో బాగా లేనివి, నవల నుంచి సినిమాలో మాయమైనవి:**
హీరో పాత్ర పరిణామం. నవలలో హీరో పరిణామానికి చాలా అంటే చాలా సమయం పడుతుంది. చాలా సంఘటనలు వల్ల మెల్ల మెల్లగా ఒక్కొక్క విషయం అర్థం కావడం, కొద్ది కొద్దిగా భయాలు పోవడం జరుగుతుంది. ఇక్కడ మొదట్లో మొత్తంగా భయపడిన వాడు రెండో సన్నివేశానికే వడిశతో దాడికి దిగిపోతాడు, ఆ తరువాత పులి నుంచి గొర్రెను కాపాడేస్తాడు (కొంచెం భయపడతూనే) ఇక చివరికి పులికి ఎదురు నిలబడి టెంకె పగలుగొట్టేస్తాడు.

పులితో ఉన్న రెండు సన్నివేశాలు హీరోని ఎలివేట్ చేయడానికి వాడేసుకోవడం దాని వెనక ఉన్న పూర్తి కథను ఎస్టాబ్లిష్ చేయలేకపోవడం, చివరి ఘట్టం అయిన పులిని గొడ్డలితో మోదడం అనేది నవలకు కొంత మార్చి హీరోని ఎలివేట్ చేయడం నవలతో పోల్చుకుంటే అంతగా పండలేదు.

నవలలో ఉన్నది పులి మీద దాడి తరువాత హీరో తన పనికి పశ్చాత్తాపం పడడం సినిమాలో లేకపోవడం, ఆ పశ్చాత్తాపానికి కారణం ఐన మాటలు 'దాని(పులి) ఇలాకాలోకి మనం వచ్చాము, గొర్రెలు పెద్ద నక్క(పులి) నోటి కాడ జీవాలు, మనం పుల్లారి కట్టాలి తప్ప ఎదురు దాడి చేయకూడదు.'

**ఇక సినిమా, నవలతో నా అనుభవాలు, అభిప్రాయాలు:**
సాధారణంగా పుస్తకం చదివిన వారికి సినిమా అంతగా నచ్చదు అనేది నానుడి. అది చాలా వరకు నిజం కూడా. నాకు కొన్ని సినిమాలు & పుస్తకాలతో పూర్వ అనుభవం ఉంది కూడాను. ఈ కొండపొలం విషయంలో అదృష్టమో ఏమో కానీ ముందు నేను సినిమానే చూసాను,  సినిమా నాకు చాలా బాగా నచ్చింది. అప్పటికి నేను తెలుగు పుస్తకాలు చదవడం మొదలు పెట్టలేదు. ఆ తరువాత కోరాలోనే ఈ పుస్తకం గురించి వినడం, ఇప్పటికి ఆ పుస్తకాన్ని కొనడం, చదవడం పూర్తి చేయడం జరిగింది. ఈ సమాధానానికి పూర్తి న్యాయం చేయడానికి మళ్ళీ సినిమాను తాజాగా పూర్తిగా చూసాను.

ఇదొక ఫ్లాప్ సినిమా, నాకు నచ్చింది అంటే వింతగా చూసారు. ఈ పుస్తకం చదువుతున్నానంటే ఇదే పేరుతో సినిమా ఉంది అదేనా అని అడిగిన వాళ్ళు కొందరు, సినిమా చూడలేదా అన్నవాళ్ళు కొంత మంది, చూసా అంటే మరి ఇంకెందుకు చదవడం అన్నవాళ్ళు, సినిమాయే ఫ్లాప్ మళ్ళీ దాని పుస్తకం కూడానా అన్నవాళ్ళు ఇంకొంతమంది.

ఈ మాండలికం నాకు కొంత కొత్త కావడం వల్ల సరాసరి పుస్తకం చదివి ఉండి ఉంటే కొంత ఇబ్బంది పడేవాడిని అనిపించింది. అప్పటికి చాలా పదాలు, ప్రయోగాలు సందర్భానుసారం అర్థం చేసుకున్నవే కానీ పూర్తిగా అర్థమయినవి కాదు. మొదట్లోనే disconnect అయ్యి చదవడం ఆపేసేవాడిని ఏమో.

సినిమాలో కొన్ని మాటలు భలే అనిపించాయి. వాటిలో కొన్ని:
'ఇన్ని సార్లు ఓడిపోకూడదు నాయినా... పొట్టేలు తగిలినట్టు తగలాల. తలకాయ పగిలినా కానీ ఎనక్కి రాకూడదు. నువ్వు అంత లావు గాయాపన్నేట్టు నేనెపుడు సూడలా. కొండపోలం సేసి పోయిరా నాయినా వంద జీవాల పానాలు నిలిపినవాడివి అవుతావు.'

'అన్నా ఇదీ, మనలో ఒకడు సగం ఆకలితో మాడుతున్నాడు అని తెలియడానికి ఇన్ని రోజులు పట్టింది'

'అన్నా, మీరెవరో నాకు తెలీదు, మీ వెనక మా గొర్రెలు ఎందుకు వస్తాయో అంతకన్నా అర్థం కాలేదు. మా గొర్రెలు కాదు కదా వాటి బొచ్చు కూడా రాదు'

ఇక సినిమాలో మొదటి సారి చూసినప్పుడే కళ్ళ వెంబడి నీళ్ళు తెప్పించిన సన్నివేశం అంకయ్య వాళ్ళ ఆవిడతో ఫోన్లో మాట్లాడిన సన్నివేశం. వాళ్ళ భార్యని ఎంత ప్రేమించాడో నోరు లేని ఆ జీవాలను కూడా అంతే ప్రేమగా చూసుకుంటున్న విషయం తెలియ చెప్పిన సన్నివేశం. సినిమా చూసేప్పుడు ఆ ఐదు నిముషాలు ఏడిస్తే, పుస్తకం చదివేప్పుడు ఆ సన్నివేశం మొదలైన దగ్గర నుండీ పూర్తయ్యేవరకూ అంటే దాదాపు ఒక అరగంట పాటు కన్నీటి ధార ఆగలేదు.

ఆడెవడో అన్నేట్టు నవలలో పెద్ద పుల్లయ్య పాత్రకి ఎంతో అనుభవం జ్ఞానంతో పాటు అంతే చతురత కూడా ఉంది. సినిమాలో ఆ కోణం అసలు లేకపోవడం కొంత లోటుగా అనిపించింది.

నవలలో ఉన్న అన్ని పాత్రలు సినిమాలో ఇమడ్చలేక కొన్ని పాత్రలను, కొన్ని స్వభావాలను కలుపుకుని పరిమిత సంఖ్యలో పాత్రలు పెట్టేసారు. భాస్కర్ పాత్ర ఉన్నప్పటికీ కొంత భాగం వేరు చేసి హీరోయిన్ పాత్ర సృష్టించి దాంట్లో కలిపేసినట్లుగా అనిపించింది కొంత వరకు.

కానీ హీరోయిన్ పాత్ర పెట్టడం నా వరకు బాగానే అనిపించింది. ఎంత అనుకున్నా సినిమాగా తీసినప్పుడు కొన్ని లెక్కలు వేసుకోవాలి. ఆ హీరోయిన్ పాత్ర కూడా లేకపోతే ఫలితం ఇంకా పేలవంగా ఉండేది. అలానే హీరోయిన్ పాత్రను ఏదో నామమాత్రంగా పెట్టలేదు. హీరో వ్యక్తిత్వ పరిణామంలో ఒక కీలక భూమిక పోషించే విధంగా ఉంటుంది.

ఇదివరకే చెప్పినట్టు పుస్తకం చదివాక ముగింపులో ఉన్న మార్పులు అంతగా మింగుడు పడలేదు. పులి ఇలాక అయిన అడవికి వచ్చినప్పుడు, అన్ని జీవాల ప్రాణాల బాధ్యత తమ మీద ఉన్నప్పుడు గొర్రెలను కాపాడాలి, ఏవైనా క్రూర మృగాలు వస్తే అదిలించి, బెదిరించాలి, ఒక వేళా పులి దాడి చేస్తే ఒక జీవాన్ని పట్టుకు పోతాది వదిలేయాలి. అది మనం కట్టే పుల్లారి అంతే గాని పులి మీద దాడి చేయడం, దాన్ని రెచ్చగొట్టడం చేయకూడదు అది అడవి న్యాయం అని చెప్పడం వల్ల హీరోలో ఒక

అపరాధభావన వస్తుంది నవలలో. కానీ సినిమాలో పులికి ఎదురుబడి నిలిచే ధైర్యం సంపాదించడం వల్ల తరువాత అంతే ధైర్యంగా సివిల్స్ ఇంటర్వ్యూలో ఉత్తీర్ణుడు అయినట్టు చూపిస్తారు.

ఇది కూడా సినిమా కోసంలే అని సరిపెట్టుకోవచ్చు కానీ అక్కడ వదిలేసింది ఏదో పాత్ర లేక చిన్న సన్నివేశం కాదు, అతి ముఖ్యమైన విలువలు, అడవి నియమాలు. అది కూడా ఉండి ఉంటే చాలా బాగుండేది. నిడివి మరి ఎక్కువ అయ్యింది అనుకోవడానికి కూడా లేదు సినిమా 2 గంటల 15 నిముషాలే.

ఇక నా వరకు సినిమా నవలకు పూర్తి న్యాయం చేయకపోయినా, నవలలో ముఖ్య ఘట్టాలను, కథను కలుపుకుంటూ సినిమా హంగులతో ఒక మంచి నవలను పరిచయం చేసింది అంతే! ఆ అనుభూతిని ఆస్వాదిస్తూ కొండపోలం నవల చదువుకోవడమే. అప్పటికే నవల చదివేసిన వారు అయితే కీరవాణి సంగీతాన్ని ఆస్వాదిస్తూ మళ్ళీ కొండపొలంలో ముఖ్యఘట్టాలు సినిమాలో చూసుకుంటూ నెమరు వేసుకోవడమే.
కొండపొలం ఒక సినిమాగా న్యాయం చేసింది. ఒక పుస్తక పరిచయంగా న్యాయం చేసింది. కొండపొలం సినిమా ఒక నవలకు న్యాయం చేయాలి అనుకోవడం కష్టం, అసాధ్యం కూడా.

శ్రీమల కిషోర్

https://qr.ae/py9cbH

# హాస్యం

## మీకు గోరింటాకు పెట్టుకోవడం అంటే ఇష్టమా? మీకు గోరింటాకుతో ఉన్న అనుభవాలు ఏమిటి?

గోరింటాకుతో అనుభవాలు అంటే సాధారణంగా అందరికీ పెట్టుకోవడంలో బోలెడన్ని జ్ఞాపకాలు ఉంటాయి కానీ నా జీవితంలో ఒకసారి గోరింటాకు తీయవలసి వచ్చింది. ఏంటో ఇదో వెరైటీ.

గమనిక - విదేశాలకు వెళ్లాలనుకున్న ఆడపడుచులు ఇది తప్పక చదవాలి.

మా పెళ్లయిన రెండో రోజు నుంచి నేను, మా ఆయన ఇంగ్లాండ్ వెళ్ళడానికి కావలసిన డాక్యుమెంట్లు, మ్యారేజ్ సర్టిఫికెట్ లాంటి పేపర్ వర్క్ చూసుకుంటూ బిజీగా ఉన్నాము. అవన్నీ తీసుకుని హైదరాబాదు జూబిలీహిల్స్‌లో ఉన్న VFS (వీసా ప్రాసెస్ చేసే కన్సల్టెన్సీ) ఆఫీసుకు వెళ్ళాం. పేపర్లన్నీ పర్ఫెక్టుగా ఉండడంతో ఆఫీసు వాళ్లు ఓకే చెప్పి బయోమెట్రిక్ ఫింగర్‌ప్రింట్స్ కావాలని ఒక చిన్న మెషిన్ మీద నా రెండు బొటన వేళ్ళు పెట్టమన్నారు. ఆ తర్వాత వేలిముద్రలు తీసుకుందామని కుడిచేతి నాలుగు వేళ్ళు పెట్టమన్నారు.

నా వేలిముద్రలు పడలేదు. చెమట ఉందేమో అనుకుని చేయి తుడుచుకుని పెట్టమంది అక్కడి ఆఫీసరి. అలా చేసినా ముద్రలు పడలేదు. మెషిన్ మార్చి ట్రై చేసాం. ఊఁహూ...ఎడమచేతికి కూడా ఇలానే అయింది. నా వేళ్ళు చూసుకున్నాను. బానే ఉన్నాయే వేలిముద్రలు కనపడుతున్నాయి కూడానూ. ఇదేంటబ్బా...

ఆఫీసర్ నా చేతులు చూపించమంది. "గోరింటాకు ఉంది కదండీ అందుకే ఫింగర్‌ప్రింట్స్ తీసుకోవట్లేదు" అంది ఆవిడ.

'అదేంటి, గోరింటాకున్నంత మాత్రాన వేలిముద్రలు ఎలా పడవు? ఒక పక్కన క్లియర్‌గా నా కంటికి కనపడుతోంటే?' అనుకున్నాను.

"మళ్ళీ ఓ నాల్రోజుల్లో అపాయింట్మెంట్ బుక్ చేస్తాను, ఈ లోపల గోరింటాకు పోతుందేమో కదా!" అని చెప్పి పంపేసింది. ఇది వినగానే మాకు ఆశ్చర్యమనిపించింది. మనకు తెలిసిన వాళ్ళు చాలామంది వెళ్లారు. విదేశాలకు వీసా రిజెక్ట్ అవ్వడం విన్నాం కానీ ఇదెక్కడి గోల అనుకున్నాము.

ఈ విషయం మా నాన్నగారు చుట్టాలకి చెప్పగానే నన్ను బ్యూటీపార్లరుకి వెళ్లి గోరింటాకు ఎలా తీసేయాలో కనుక్కుని రమ్మన్నారు.

ఈ అమ్మాయేంటి ఫారెన్ వెళ్లిపోవాలని ఇంత కంగారు పడిపోతోంది? ఇంకో నాలుగు రోజుల్లో గోరింటాకు పోకపోతే మళ్ళీ అప్పాయింట్మెంట్ తీసుకోవచ్చు కదా అని మీరనుకోవచ్చు. కానీ కంగారు నాకు కాదు మా నాన్నగారికి.

'ఈ వీసాలవీ మనకు తెలియవు. అల్లుడు ఇక్కడ ఉండగా అయితే అన్నీ అతనే చూసుకుంటాడు. పైగా పిల్ల ఎప్పుడూ విమానం ఎక్కలేదు. అల్లుడితో వెళ్ళిపోతే మనకూ టెన్షన్ ఉండదు' అని మా నాన్నగారి ఉద్దేశం. ఇక చూసుకోండి జూబిలీహిల్స్, బంజారాహిల్స్‌లో ఉన్న హై-ఫై బ్యూటీ పార్లర్లు అన్నీ తిరిగాము. స్కిన్ స్పెషలిస్టులందరి దగ్గరికీ వెళ్ళాము.

గోరింటాకు పోయే మార్గం తెలిస్తే చెబుతారా అని నేను అడగడం. వాళ్ళు, "ఆ! ఏంటి??" అని అడగడం, నేను జరిగిందంతా చెప్పగానే మాకు తెలీదని వాళ్ళనడం. ఎక్కడికెళ్ళినా ఇదే తంతు. విసుగొచ్చేసింది. పొద్దున్న పది గంటలకు వీసా ఆఫీసుకు వెళ్లిన వాళ్ళం మధ్యాహ్నం నాలుగు గంటల వరకూ బ్యూటీ క్లినిక్కుల చుట్టూ తిరగడమే సరిపోయింది. ఇక ఇలా కాదని, చిన్న చిన్న పార్లర్లో వాళ్ళకి బాగా ఐడియా ఉంటుందని అవి కూడా ఒక అరడజను తిరిగినా ప్రయోజనం లేదు. ఈలోగా మా చుట్టాలు ఆయుర్వేదం తెలిసిన వాళ్ళేమైనా సహాయం చేయగలరేమో అని ఆ కోణం నుంచి ప్రయత్నిస్తున్నారు.

ఇంటికొచ్చి కుర్చీలో కూలబడ్డాను. మా పెద్దత్త మాట్లాడుతూ, "ఇంట్లో బోలెడంత పని చేసుకుంటాం కదా అందుకే నాలుగు రోజులపాటు చేతులకు గోరింటాకు చూసుకుందాం అన్నా ఉండదు. నువ్వేమో తీయించుకోడానికి కష్టపడుతున్నావు" అంది. వెంటనే మా అమ్మ, "అయితే దీని చేత అంట్లన్నీ తోమిస్తే సరి. దెబ్బకి పోతుంది " అంది.

'ఎవరు పోయేది? నేనా? గోరింటాకా? 40 మంది ఉన్నారు ఇంట్లో, వీళ్ళ అంట్లు నేను తోమాలా?' అని మనసులో అనుకున్నాను.

కొత్త పెళ్లికూతురి చేత పనేమి చేయిస్తాం అని "అంట్లు తోమక్కర్లేదు కానీ చింతపండేసి ఇత్తడి గిన్నెలు తోమితే ఖచ్చితంగా పోతుంది. నాదీ పూచి" అని మా పిన్ని.

సరే అని మా అమ్మ అటక మీద నించి ఇత్తడి గిన్నెలన్నీ దింపి నా చేత తోమించింది. ఒక గంటసేపు నేను చచ్చేలా, గిన్నెలు మెరిసేలా తోమి చేతులు చూసుకున్నాను. అబ్బే! లాభం లేదు.

ఇంకో పిన్ని "పొద్దున్నే కళ్లాపి చల్లుతాం కదే అందుకే గోరింటాకు పోయేది. అంట్లు తోమితే కాదు" అంది తీరిగ్గా. ఒళ్ళు మండిపోయింది నాకు.

"ఈ విషయం నేను గిన్నెలన్నీ తోమాక గుర్తొచ్చిందా పిన్నీ?" అని కోప్పడ్డాను.

"అక్కా! రేపు పాలు పోసే వాడి దగ్గర పేడ దొరుకుతుందేమో తెప్పించు" అంది మా పిన్ని. అంతే! పొద్దుటికల్లా పేడ రెడీ.

(ఇప్పుడు నా గురించి మీకు కొన్ని విషయాలు చెప్పాలి, తరువాత సీనుకి అవసరం. పెళ్లి కాకముందు వేరే వాళ్ళు వాడిన సబ్బును, తుడుచుకునే తువ్వాళ్ళను అస్సలు ముట్టుకునేదాన్ని కాను. నా చుట్టు పక్కన వాళ్ళు తుమ్మినా, దగ్గినా చాలా చిరాకుగా ఉండేది. బాత్రూం తడిగా ఉన్నా, ఎవరైనా బాత్రూంకి వెళ్లొచ్చినా కూడా నాకు నచ్చేది కాదు. నా చేత సంక్రాంతికి గొబ్బెమ్మలు పెట్టించాలని మా వాళ్ళు పట్టుబడితే మునివేళ్ళతో జస్ట్ అలా అలా టచ్ చేసి పెట్టాననిపించుకునేదాన్ని. అలాంటిది నేను విదేశాలకు వెళ్ళాక మా బాత్రూంలు కడుక్కోడం చాలా అలవోకగా చేసేస్తున్నాను. పిల్లలు పుట్టాక డైపర్లు మార్చడం, వాళ్ళ బాత్రూంలు వంటివి అసహ్యం లేకుండా చేసేస్తున్నా అన్నమాట. పదేళ్ళ ముందు, ఇప్పటికి మీలో మీరు చూసిన మార్పులేంటి అని ఎవరైనా ప్రశ్న అడిగితే ఇదే మొదట చెప్తా).

అలాంటి నేను ముప్పావు గంట సేపు ముక్కు మూసుకుని చిరాకుగా పేడను పిసికి పిసికి పెట్టాను. దీనికి రోగం కుదిరింది అన్నట్టు మా చుట్టాల నవ్వులు. యాసిడ్‌తో కడుక్కుంటే చేయి పోతుందని సబ్బుతో పేడ వాసన పోయేలా నాలుగుసార్లు కడిగాను. చేయి చూసుకున్నా గోరింటాకు రంగు ఏ మాత్రం తగ్గలేదు.

ఇప్పుడెలా??

జరిగేది జరుగుతుందిలే అని మేమందరం చివరికి వదిలేసాము. అప్పుడొక మహానుభావుడికి ఒక ఐడియా వచ్చింది. చెబితే ఇంట్లో చంపేస్తారు. ఎలా? ఏదైతేనేమిలే నా మంచి కోసమే కదా అన్నట్టు ఐడియా వదిలాడు. అది వినగానే ఛీ, ఛీ అంటూ ఇంట్లో అందరూ పిచ్చి తిట్లు తిట్టినా చివరికి ఒప్పించాడు.

మందు షాపుకి వెళ్లి బీర్ బాటిల్ కొని ఇంటికి తెచ్చి ఒక గిన్నెలో పోసి చేతులు ముంచి అలానే ఉంచమన్నాడు. ఇల్లంతా బీరు కంపు. నాకు ముక్కు మూసుకునే స్వేచ్ఛ కూడా లేదు, రెండు చేతులు బీరులో ఉన్నాయిగా. ఒక అరగంట పోయాక చేతులు చూసుకున్నా. సక్సెస్! గ్రాండ్ సక్సెస్!! గోరింటాకు చాలా మటుకు పోయింది. "పోతే పోయింది వెధవది ఇంటికి ఎప్పుడూ మందు బాటిల్ తెచ్చి ఎరగం నీ పుణ్యమా అని ఈ రకంగా అందరం దాని వాసన చూసాం" అన్నారు ఇంట్లో వాళ్లు.

అంతే! వీసా ఆఫీసులో ఫింగర్‌ప్రింట్స్ తీసేసుకున్నారు.

గమనిక - విదేశాలకు వెళ్లాలనుకునే వాళ్లు తెలుసుకోవల్సింది ఏంటంటే గోరింటాకు పెట్టుకోండి కానీ మునివేళ్ళకి caps పెట్టుకోకండి. డిజైన్ త్వరగానే పోతుంది కానీ ముద్దగా caps పెట్టుకుంటే పోదు.

ఇదంతా విని ఒక పెద్దాయన  "నువ్వు మన సంస్కృతిని వదిలి వెళ్దాం అనుకున్నావు కానీ అది నిన్ను వదల్లేదు" అన్నారు.

పుష్యమి

https://qr.ae/pyMo8L

---

## పెళ్ళిచూపులకు సంబంధించి మీ అనుభవాలు ఏమిటి?

నాది ప్రేమ వివాహం మరి పెళ్ళిచూపులతో పనేమిటి అంటే ఈ పెళ్ళిచూపులు మాకు కాదండి! మా పెద్దవాళ్ళకి. కష్టమో నష్టమో ఇష్టపడ్డాక తప్పదు కదా... భాష వేరయితే ఏముంది, భావాలు అర్థమవుతున్నాయిగా చాల్లే అని ఇద్దరం పెళ్ళి కోసం ఎదురుచూస్తూ కాలం గడుపుతున్న రోజులవి. అదీ ఇదీ చెప్పి ఒప్పించాక కలవడానికి ఇష్టపడ్డారు మా ఇద్దరి తల్లిదండ్రులు.

అయితే అతని కుటుంబం కొన్ని తరాల కిందట తెలుగు రాష్ట్రం నుండి తమిళనాడుకి తరలి వెళ్ళి అక్కడే స్థిరపడ్డ కుటుంబాల్లో ఒకటి. అందుచేత వాళ్ళు ఇంట్లో మాట్లాడే తెలుగు చాలా వరకు తమిళంతో కలిసి, ఆంధ్ర రాష్ట్రంలో ఇంటీరియర్‌గా (నూతిలో కప్పలం అనేసుకోండి) ఉన్న పల్లెటూరి తెలుగు జనాలకి 'తెగులు' లాగా వినపడుతుంది.

నమ్మనంటారా?

అమ్మ నాన్న, అటూ ఇటూ పెదనాన్న గారి అబ్బాయిలని తీసుకుని బెంగళూరులోనే ఉంటున్న అబ్బాయి వాళ్ళ ఇంటికి బయలుదేరాం. దారిలో పళ్ళు అవి కొనుక్కుని ఇంటి తలుపు తట్టంగానే మా ఆయన (అప్పటికి ఇంకా కాలేదులెండి) మా నాన్న గారిని చూసి నవ్వుతూ "వళ్ళెలా ఉంది?" అన్నాడు. అది వినగానే నాన్నగారి ముఖం గంభీరంగా మారింది. ఇంకా చెప్పులు కూడా విప్పలేదు, వెళ్లిపోదామా అన్నట్టు చూసారు అన్నయ్యలు.

"అదే ట్రైన్ జర్నీ, కోల్డ్ ..." అని నీళ్లు నములుతున్న అతన్ని చూసి విషయం అర్థమయిన నేను "ప్రయాణం చేసి వచ్చారు కదా ఒంట్లో ఎలా ఉంది" అని అడుగుతున్నారు డాడీ!" అని సర్ది చెప్పా. ఆదిలోనే హంస పాదు అంటే ఇదేనేమో...

అందరు నమస్కారాలు పెట్టి సంస్కారాలు తెలుపుకుని కుశల ప్రశ్నలయ్యాక కుర్చీల్లో, సోఫాలో కూలబడి, అక్కడా ఇక్కడా సర్దుకున్నాం. ఇంతలో మా ఆడపడుచు ఏవో స్వీట్లు హాట్లు ప్లేట్‌లో సర్ది తెచ్చింది. ఏం మాట్లాడాలా అని ఒకళ్ళ మొహాలు ఒకళ్ళు చూసుకుంటున్నారు పెద్దవాళ్ళు.

ఇంతలో మా అత్తగారు (అప్పటికింకా కాలేదు లెండి) మా నాన్న గారిని ఉద్దేశించి "ఎత్తుకోండి అన్నయ్య!" అనేసారు. మరోసారి రసాభాసం జరిగింది.

'ఇదేం వింతే? ఇదేం ఆచారమే?' అన్నట్టు చూసారు మా అన్నయ్యలు నా వైపు. ఫలహారాల పళ్లెం వైపు చేయి చూపిస్తూ అత్తగారు మరో సారి "ఎత్తుకోండి అన్నయ్య" అనేసరికి అందరికీ అర్థమయింది ఇది వరపరీక్షే కానీ బలపరీక్ష కాదని.

ఊరి నుండి అమ్మా వాళ్ళు తెచ్చిన స్వీట్లు కూడా ఒక పళ్లెంలో పెట్టించారు, 'ఆంధ్ర స్పెషల్ పూతరేకులు' అని ఒక వాణిజ్య ప్రకటన మళ్ళీ. 'తీసుకోండి' 'తీసుకోండి' అని మా భాషలో మేము కూడా వాళ్ళని

బలవంతం చేయడంతో మా మావగారు ఒకటి తీసుకుని పై పొర చింపడం మొదలు పెట్టారు. వాళ్ళు పెట్టిన పాల స్వీట్ తినడంలో నిమగ్నం అయిన నేను ఇది పట్టించుకోలేదు.

"అది అలా కాదు అన్నయ్య గారూ!" అని కంగారు పడి పోయింది అమ్మ కంఠం. "అది మొత్తం అలాగే తినేసెయ్యాలి, పైనది రేపర్ కాదండీ!" నేను పూర్తి చేసాను అమ్మ వాక్యాన్ని.

మా అమ్మ-నాన్న, వాళ్ళ అమ్మ-నాన్న వాళ్ళ అన్నదమ్ములు అక్కాచెల్లెళ్లు వాళ్ళ పిల్లలు ఏ ఊర్లో ఉంటారు, వాళ్లకి పిల్లలున్నారా? వాళ్ళే స్కూల్లో చదువుతారు ఇలాంటి కబుర్లన్నీ అవుతూ ఉన్నాయి. ఇదెప్పుడవుతుందా, ఇది సుఖాంతం అవుతుందా అని ఎదురుచూస్తున్నాయి మా కళ్ళు .

ఇంతలో మా అన్నయ్యని చూస్తూ మా మావగారు "మా అబ్బాయి పెట్టాడా?" అన్నారు.

"మా వైపు పెళ్ళి కుదుర్చుకున్నాక పెట్టిపోతలు. అప్పటిదాకా ఏం పెట్టమని అడగరండీ!", సమాధానం ఇచ్చారు మా నాన్న. ఇది నాకు గతంలో ఒకసారి అనుభవమైన విషయమే. హరీ పోటర్ సినిమా చూసి వచ్చాక "నీకు ఇది పెట్టిందా" అని మా ఆయన(అప్పటికింకా పెళ్ళవలేదు లెండి) నన్ను అడిగాడు.

'కోడి గుడ్లు పెడుతుంది, నెమలీక పిల్ల నెమలీకలు పెడుతుంది, హరీ పోటర్ సినిమా ఏం పెట్టాలబ్బా?' అని ఆశ్చర్యపోయిన నా మొహం చూసి "డిడ్ యు లైక్ ఇట్?" అని ఇంగ్లీష్‌లో డబ్బింగ్ చెప్పాడు.

"వాళ్ళు అబ్బాయి నచ్చాడా అని అడుగుతున్నారు" అని ఈ సారి నేను చెప్పాను డబ్బింగ్.

"ఓహ్ అలాగా! ఆ బాగానే ఉన్నాడు" అని అన్నయ్య సమాధానం ఇవ్వడంతో 'హమ్మయ్య' అనుకున్నానా...

"మరి మీకు మా అమ్మాయి నచ్చిందా?" అని అన్నయ్య అడిగేసాడు. వెటకారమో, నిజమో తెలీదు కానీ అడ్డంగా తలూపింది అత్తగారు కాని అత్తగారు.

'పెళ్లయ్యాక చెప్తాన్లే నీ సంగతి' అని మనసులో అనుకుని, బయలుదేరుదామా అని మా వాళ్ళతో చెప్పి ఇంటికి వచ్చేసాం.

కొన్ని నెలల తరువాత:
పెళ్లయిన కొన్ని రోజులకి ఆఫీస్‌కి మళ్ళీ వెళ్ళాలా అబ్బా అనుకుంటూ బాగ్ తగిలించుకుంటుంటే, మా ఆయన షూ లేస్ కట్టుకోడం ముగించి ఒక చేత్తో లంచ్ బాక్స్‌తో 'నేను కేళంబేను మమ్మీ' అనడం విని ఒక్క వాక్యంతో ఇన్ని భాషల్ని హతమార్చచ్చా ( తెలుగు (నేను), తమిళం (కేళంబు), ఇంగ్లీష్ (మమ్మీ)) అని అవాక్కయ్యాను నేను.

లలిత నిగేష్

https://qr.ae/pympcD

## గ్రహాంతరవాసులు మీరున్న చోటికి దగ్గరలో దిగి, మీ ఇంటి తలుపు తడితే, మీరు వాళ్ళతో మొదట ఏం మాట్లాడతారు లేదా (ఏదో విధంగా) ఏం తెలియజేస్తారు? ఎందుకు?



మూలం: https://halloween-haven.com/avatar-costumes/

"రండి బాబు రండి... లోనకి రండి.."

"కూకోండమ్మా.. కుర్సీ కాంత అదుము.. సూసుకుని కూకోండి.."

"ఏ బండికొచ్చేరు? గౌతమా, గోదావరా?"

"ఓహో! .. మీ బండి మీదే ఒచ్చేహేరా...!"

"బానే వచ్చేరు లెండి. మా ఇల్లెలా తెలిసింది?"

"ఓహో..! సెంటర్లో సుందర్రావుని అడ్రసడిగితే తీసుకొచ్చేహేడా? ఆడంతేనండి మా ఇంటి సుట్టూనే తిరుగుతుంటాడు"

"యావే.. సుట్టాలొచ్చేరు.. గలాసులో మజ్జికట్టుకురా.."

"ఇదిగోండమ్మా మాంచి ఎండలో ఒచ్చేరు.. సల్లగా ఉంటాది మజ్జిగ తాగండి"

**యావండోయ్.. ఓ సారిలా రండని లోపల్నుండి పిలుపు.**

"బాబూ ఇప్పుడే వత్తానండే..!"

'ఏండీ! ఇంటో సరుకులు నిండుకున్నాయి. ఆళ్ళు సేనా దూరం నుండి ఒచ్చినట్టున్నారు. ఇంటికొచ్చినోళ్ళకి అందంగా పెట్టుకోవాలి కదా.. అలా సెంటర్లోకెల్లి కూరా, సరుకులు పట్రండి' అంది నాగేంద్రం భార్య.

"అలాగేనేవే అన్నీ తెత్తాను. జేబులో వంద కాయితం ఉందిలే ఇంకా ఎక్కువైతే ముత్యాలు కొట్టుకాడ కాతాలో రాయింతాను... బాబూ! మీరు నీసు తింటారు కదా.. పర్లేదు వారాలేవీ లేవు కదా.. తింటారు కదా.. మీరు మాటాడుకోండి, అలాగెల్లొత్తాన"ని నాగేంద్రం సెంటర్లోకొచ్చాడు.

మాసం కొట్టు దగ్గర సత్తియ్య దుంగకేసి కత్తి నూరతన్నాడు.

"ఎవర్నండీ ఇందాక సుందర్రావు మీ ఇంటేపు తీసుకొచ్చేడు! ఆ తోకలు, రంగులు మా గొప్పగా ఉన్నార్లెండి.."

"ఆళ్లు మా సుట్టాలు ... గెహాంతర వాసులంటార్లే ఆళ్ళని. ఓ కేజీ కోడిమాంసం సుభ్రంగా సామాన్లన్నీ ఏసి కొట్టుంచు. ఈలోపు సరుకులు కట్టించుకునొత్తాను."

"ఎవరొచ్చేర్రా నాగేంద్రా..! ఎవరో గెహాంతర వాసులు మీ ఇంటికొచ్చేరంట.. ఏ ఊరాళ్ళది?" అంటూ మిఠాయికొట్టు గంగరాజు పలకరించేడు.

"ఆళ్ళది ఈ గెహం కాదెహే.. రోజకో గెహం తిరుగుతుంటారాళ్లు. బుధారం బుధ గెహం, లచ్చివారం గురుడు, శుక్రవారం శుక్రుడు, శనారం శని.. ఇయాల ఆదివారం మనింటికొచ్చేరన్నమాట!"

"ఓహో.. ఆల్లు మన తిండి తింటారంటావా?"

"తింటార్లేరా... ఇందాక దాహానికి మజ్జిగిత్తే చెరో రెండు చెంబులు గటగటా తాగేసేరు."

"ఓరినీ.. పాపం ఆకలిమీద ఉన్నారేమో! వంటలన్నీ అయ్యేసరికి లేటవుతాది మరి.. ఈలోపు తింటాకి స్వీటూ, హాటూ అట్టుకెళ్తావేంటి?"

"ఆ బానే గుర్తు చేసేవు.. కట్టించు.."

"ఏట్రోయ్ నాగేంద్రా మీ ఇంటికి గెహాంతరవాసులొచ్చేరంట? ఏం పని మీదొచ్చేరో ..!! మనల్నేవన్నా చేత్తారంటావా?"అని కిరాణా కొట్టు ముత్యాలు అడిగాడు.

"ఏమోరా.. ఎందుకొచ్చేరో సావకాశంగా అడుగుదాం లే.. ఆళ్ళూ మనలాంటి మనుషులేరా.. ఆ మాటకొత్తే మనం కూడా ఆళ్ళకి గెహాంతర వాసులే.. ఆళ్ళు మనల్ని ఏం చేయనప్పుడు మనమెందుకు బయపడ్డం?"

"అదీ నిజవేలేరా.. ఇంగో పలావు సామానం, ఎల్లుల్లిపాయలు, పలావు బియ్యం, సరుకులు కట్టేహేను."

"ఆళ్ళు కుదురుబడ్డాక సాయంత్రం పలకరించడానికి వద్దూగాని కానీ ఎంతైందో కాతాలో రాసేయ్" అని నాగేంద్రం అనగానే

"కాతాలేదు గీతా లేదు.. .ఈ ఇంటికి సుట్టాలొత్తే మా ఇంటికొచ్చినట్టు కాదా ఎల్లెల్లు" అని పంపేసాడు.

నాగేంద్రం సామాన్లన్నీ పట్టుకుని ఇంటికి చేరాడు.

"ఏమే.. సామాన్లన్నీ తెచ్చాను. మాసం కూరొండేసి, పలావు తాలింపెట్టెయ్.. తొరగా అయిపోతాయి.. ఈలోపు తింటాకి గంగరాజు స్వీటూ హాటూ కట్టేడు."

"బాబూ.. పలారం తీసుకొండమ్మా... మా గంగరాజు కొట్టుకాడ గట్టిపకోడీ, గొట్టం కాజా చాలా బోంటాయి.. తినండి. ఇయాల బోయినాలు కూడా ఇక్కడే. కడుపునిండా తినండి."

నాగేంద్రం వంట గది వేపు అలా తల పక్కకి తిప్పేడో లేదో ప్లేట్లు ఖాళీ. మళ్లీ ప్లేటు నిండా బూంది నింపి పెట్టాడు.

గుర్నాదంగారు ఈళ్ల కోసం అమర్తపాని అరిటి గెల, చెట్టున ముగ్గిన పనస కాయి తొనలు పంపేరని అరుగు మీద పడేసి ఎల్లిపోయాడు మణియ్య. అయ్యి కూడా ఊదేసేరు.

ఈలోపు వంటలు పూర్తయ్యాయని నాగేంద్రం భార్య కేకేసింది. అసలేమాత్రం మొహమాటం లేకుండా లొట్టలేసుకుంటూ అన్నీ అడిగి మరీ పెట్టించుకుంటూ వండిందంతా పూర్తి చేసేసేరు. ఆళ్ల తిండి చూసి నాగేంద్రానికి ముచ్చటేసింది.

తిండి కార్యక్రమం అయ్యాక చాప మీద దొర్లుతూ కునికిపాట్లు పడుతున్న ఇద్దర్నీ చూసి, "ఆ.. ఇప్పుడు చెప్పండమ్మా... ఏ పని మీద ఒచ్చేరు! నాల్రోజులు ఉంటారు కదా! ఇక్కడంతా బానే ఉందా మీకు?"

"అయ్యా..! మేవు పగటేషగాళ్లమండయ్యా..! కాకినాడ నుంచి ఒత్తన్నాము. ఎరైటీగా ఉంటాదని ఈ ఏడాది గెహాంతర వాసుల గెటప్పేసమండి. అంతర్వేది తీత్తానికి ఎల్తన్నాము. ఎల్తా ఎల్తా ఈ ఊరొచ్చి నీళ్లు తాగనాకి నుయ్యెక్కడుందడని అడిగితే ఒకాయన నీళ్ళేం ఖర్మ మా బావ ఇంట్లో విందు భోజనం పెట్టింతానని చెరో పాతికా తీసుకుని ఇక్కడికట్టుకొచ్చేరండయ్యా...

పాతిక రూపాయిలైనా జెన్మలో మర్చిపోలేని తిండి పెట్టేరు. ముందే చెప్దామంటే మీరసలు మాట్లాడనిత్తేనా! వచ్చినప్పటి నుండి నోరు ఆటతానే ఉంది.

అమ్మా.. ఏం వంటలు వండేవే తల్లీ.. అద్భుతం.. సచ్చి నీ కడుపున పుడతామమ్మా... ఇంక మేము వెళ్ళొత్తామండి మరి బస్సు లేటైపోతంది" అంటూ చక్కా పోయారు.

***

పడక్కుర్చీలో కూలబడ్డ నాగేంద్రం...

"ఒరే... సుందర్రావా..!! తాగుబోతెదవా..!!!"

ప్రసాదరాజు

https://qr.ae/pyMo2P

## మీరు చేసిన కొత్త వంట ప్రయోగాల్లో బాగా వచ్చినవి ఏమిటి?

ప్రశ్నలో 'రుచి బాగా వచ్చిన' అని చేర్చలేదు కాబట్టి నా సమాధానం సరిపోతుంది. 'మరింకేమిటి బాగా వచ్చింది' అంటే చదవండి మీకే తెలుస్తుంది...

***

దోశల్లోకి సాంబారు పోసుకుని తినాలన్న కోరికతో మా ఆయన బయట హోటల్ నుండి సాంబారు తెచ్చి అది ఫ్రిడ్జ్ లో దాచుకుని మరీ, రెండో రోజు ఉదయం వాడటం చూసిన నాకు కాస్త జాలి కలిగింది.

ఆ రోజు మధ్యాహ్న భోజనంలోకి వండిన బచ్చలికూర పప్పు కొంచెం మిగిలిపోయింది. దీపావళికి ఇంటికి వెళ్ళినపుడు తెచ్చుకున్న బచ్చలకూర అది. పుట్టింటి దొడ్లో రేపో మాపో పడిపోవటానికి సిద్ధంగా ఉన్న పందిరి మీద, అంట్ల నీళ్లన్నీ పీల్చుకుని పాకిన బచ్చల తీగ ఆకులు. ప్రేమగా అమ్మ కోసిస్తే పాలిథీను కవరులో దాచుకుని బెంగళూరుకి తెచ్చి రెండు వారాలు ఫ్రిడ్జ్‌లో ఉంచి మూడో విడతకు మిగిలిన ఆకులతో వండిన అపురూపమయిన పప్పుని ఎలా పారేయడం?

ఈ మధ్యే నేను కూడా పాకశాస్త్రంలో సరిగమలు నేర్చేసుకుని వంటలు చేస్తున్నాననే ధృడనమ్మకంతో నా బుర్రలో ఒక కొత్త వంటకి బీజం పడింది. ఆ బీజం అంతింతై పెరిగి సాయంకాలం ఏడు గంటలకి నన్ను వంట దగ్గరికి నడిపించింది.

ముందుగా ఒక ఉల్లిపాయని పీల్ చేసి కళ్ళల్లో నుండి వస్తున్న నీళ్ళని లెక్క చేయకుండా ముక్కలు చేసేసి బాణలిలో నూనె పోసి వేయించాను చాలా పదార్థాలు వండినట్టుగా.

ఉల్లిపాయలు దోరగా వేగాక ఆ మిగిలిపోయిన పప్పుని బాణలిలో వేసేసాను. దీనికి కొంచెం నీరు జత చేసాను. కాసేపు వేడి చేసాక రుచి చూస్తే అది నీళ్ల లాగే అనిపించింది. ఓహో ఇందులో పులుపు లేదు కదా అని కొంచెం ఎండబెట్టిన మామిడి పొడి కలిపాను. పడుంటుందిలే అని పక్కనే ఉన్న గరం మసాలా కూడా కాస్త దట్టించా. మరోసారి రుచి చూసాను. లాభం లేదు.

అంతకుముందు చూసుకున్న పచ్చిపులుసు తయారీ విధానం గుర్తు తెచ్చుకుని, ఇందులో కారం లేదు కదా అని, పచ్చిమిరపకాయ ముక్కలైతే పులుసులో కలవవు, మిక్సీ వేసే టైము లేదు అని పిచ్చి పిచ్చిగా కోసేసి మళ్ళీ వేళ్ళతో నలిపేసి ఆ మిశ్రమంలో వేసేసాను. (ఇది గుర్తుంచుకోండి)

కొంచెం ఉప్పు, పులుపు ఇంకా చాలలేదు అని కాస్త నిమ్మకాయ పిండా. అయినా అనుమానమొచ్చి చిటికెడు చింతపండు కూడా వేసా.

అయినా రుచి మెరుగుపడలేదు. ఇక లాభం లేదని కొంచెం బెల్లం కూడా వాడేసా. అన్నీ కలిపేసాక పర్వాలేదనిపించింది.

ఎంతయినా ఇది నాకొక యురేఖాకకమిస సందర్భం కదా అని ఏదో సాధించి అలసిన హీరో లాగ వెళ్లి మొహం మీద నీళ్లు చల్లుకుని చేత్తో తుడిచా. పైన చేత్తో చిదిమిన పచ్చిమిర్చి, అది నా మీద పగ తీర్చేసుకుంది.

కొత్త వంట కనిపెట్టబోయి కొత్త మంట కనిపెట్టినట్టయింది.

గట్టిగా ఏడవాలనిపిస్తుంది కానీ కన్నీళ్లు ఉల్లిపాయ తరిగేసరికి అరిగిపోయాయయ్యే!

'నీ మొహం మండ' అంటే ఇదే కాబోలు.

సరే వంట అన్నాక మంట లేకుండా ఎలా? అని దోశలు పోయడానికి సిద్ధమయ్యా.

ఈ బచ్చలికూర పులుసు/ సాంబారు మా ఆయనకి వడ్డించి ఎలా ఉంది అని అడిగా, 'పర్లేదు' అన్నాడు అతగాడు.

'మరోసారి చేయచ్చా' అన్నా ముఖ కవళికలు పరీక్షిస్తూ...వద్దన్నాడు. కొంచెం పుల్లగా ఉందన్నాడు.

అసలే మొహం మండుతున్న నాకు ఈ మాటలు మనసుని కూడా మండించాయి. కాసేపు పోట్లాడితే,

'నీ దోశ వద్దు నీ పులుసు అంతకన్నా వద్దు' అని తినడం మానేసాడు నా వంట 'భరించలేని' భర్త.

పంతం కొద్దీ ఆ మిగిలిన పులుసు/సాంబారు నేనే పోసుకు తినేసాను (రోజూ కన్నా ఎక్కువగానే).

కాసేపయ్యాక పోట్లాటలు సద్దుమణిగి అలా చల్లగాలికి నడవడానికి బయలుదేరాం.

ఆ పచ్చిమిర్చి కారమో
చింతపండు పులుపో
ఎండిన మామిడి ప్రభావమో
అన్నీ కలిపి చేసిన హాహాకారమో
ఈసారి మంట కడుపులో మొదలయింది. పొట్ట పట్టుకుని నడవలేక, ఆ పదార్థం బాలేదని బయటకు చెప్పలేక అలాగే ఇంకో నాలుగు అడుగులేసి 'నా వల్ల కాదు మహానుభావా' అని ఇంటి వైపు పరుగుతీసా.

అదండీ, అదేదో సినిమా లో శ్రీలక్ష్మిగారు 'బంగాళా భౌ భౌ' వండినట్టు నేను ఇలా 'బచ్చలికూర రచ్చ' చేసా. ఎంత రచ్చంటే ఇలా రాస్తుంటే నా బుర్ర ఆ జ్ఞాపకాలు జాగృతిలోకి తెచ్చి మళ్ళీ నా పొట్టని మండిస్తోంది.

లలిత నిగేష్<br>https://qr.ae/pympVu

---

## మీ నాన్నగారితో మీకున్న అనుభవాల్లో ఎప్పుడూ గుర్తుచేసుకునే అనుభవం ఏమిటి?

అది ఒక చీకటి రాత్రి ....

రాత్రి ఎప్పుడు చీకటిగానే ఉంటుంది, ఈ చీకటి రాత్రి ఏంటి బాబు అని నన్ను అపార్థం చేసుకోకండి!

విషయం ఏంటంటే, మరుసటి రోజ నాకు అర్థంకాని హిందీ పదో తరగతి ఫైనల్లింగ్ పరీక్ష అనమాట. మన హిందీ లేవులు "ఏక్ గావ్ మె కిసాన్ రెహత్తాత" మాదిరి! అందుకే అది చీకటి రాత్రి అని వర్ణించాను. అసలు మా వమి(శ్యంలో హిందీ పాసు అయినట్టు చరిత్రలోనే లేదు. మాది చరిత్ర తెలుసుకోవాల్సినంత వమి(శ్యం కూడా ఏమి కాదు అనుకోండి అది వేరే ఇషయం !

అసలే భయంతో నిద్ర రాక చస్తుంటే, మా కాలనీ చర్చి స్పీకర్లు నుండి 'ప్రభు యేసు నా రక్షకా ...ఎంత గొప్పవాడు' అని మోతాదుకు మించిన శబ్దాలతో భజన స్తోత్రాలు వినపడసాగాయి. ఏమిటి నాకు ఈ కర్మ అని అలా ఆలోచిస్తూ ఉండిపోయాను. నా బాధను గమనించిన మా నాయన, తలుపులు, కిటికీలు వేసుకుని పడుకో, రేపు పొద్దునే మరలా ఒకసారి హిందీ పుస్తకాన్ని తిరగెద్దువు అని చెప్పి, గుడ్ నైట్ చెప్పాడు.

తిరిగి పొద్దున్నే నాలుగు గంటలకు మా నాయన నన్ను చదుకో అని నిద్రలేపాడు. పుస్తకం తీసిన పది నిముషాలకే మరలా మా కాలనీ చర్చి స్పీకర్లు నుండి 'తప్పిపోయిన కుమారుడి-' అనే బైబిల్‌లోని కథ మోగింది. ఆ బైబిల్‌లోని కుమారుడు తప్పిపోవడం సంగతి పక్కనపెడితే, రేపు హిందీ పరీక్ష తప్పితే నేను మా కాలనీ నుండి తప్పిపోవాల్సివస్తుంది!

'పంతులుగారి కొడుకు పది తప్పాడహో!' అని అదే చర్చిలో అనుకుంటే మన లేవులు ఏం గావాలె ? అసలే మనం మన కాలనీలో పేమస్సు వూత్తు ! పైపెచ్చు మా కాలనీ చర్చి యవ్వన ఆడపడుచులు రూతు, ఎస్తేరు, మార్తా ముందు మన లేవులు తగ్గిపోదూ?

పొద్దునే చర్చిలో పాటలు పెట్టి పిల్లల్ని పదో తరగతి పరీక్షలకు చదవనివ్వకుండా చేస్తున్నందుకు మా నాయనకు చిర్రెత్తుత్తుకొచ్చింది. ఒకసారి కోపంతో లుంగీ ఎగేసి చర్చి పాస్టర్ బ్రదర్ సామ్యేలు, బ్రదర్ వరం మీద గొడవకు పోయాడు మా నాయన. పొద్దు పొద్దునే నాకు ఒక్కటి పడింది. మొత్తానికి ఏమి మాటాడాడో గాని చర్చి నుండి పాటలు ఆగిపోయాయి. సాయంత్రం మా పంచాయితీ గంట కొట్టి మా నాయన్ను పిలిపించారు సంఘపెద్దలు. నాకు ఈ సారి రెండు వచ్చేసింది!

పెద్దలందరూ ఇక్కడ చేరారు గనుక, పంచాయితి గంట కొట్టడానికి కారణం ఏంది సెక్రటరీగారూ అని అడిగాడు మా కాలనీ పెసిడెంటుగారు. మన మాస్టారు చర్చి మీదకు పెందలాడే గొడవకుపోయి,

పాటలు ఆపకపోతే టేప్రికార్డర్లో క్యాసెట్ ఎత్తుకుపోతానని బెదిరించాడు అని సెక్రటరీ మా పెసిడెంటుతో మొత్తుకున్నాడు.

సుమారు గంట వాదోపవాదాలు ఇన్న మా పెసిడెంటుగారు, కాలనీలో ముసలోళ్ళు చర్చికి రాలేరు, వారికి వినపడడం కోసం పాటలు ఆపే ప్రసక్తే లేదు, కానీ పరీక్షలప్పుడు కొంత సౌండ్ తగ్గిస్తామని పంచాయితీ ముగించారు! మా ఊరోళ్లంతా టీచర్‌గారు చర్చికి పోడు, పిల్లల్ని కూడా పోనీయడు, అంతా నాస్తిక ఎవ్వారంలాగా ఉందే అని చెవులు కొరుక్కున్నారు!

నా పరీక్ష ఫలితాలు విడుదలయ్యాయి, మనం హిందీ పరీక్ష పాసు, పైపెచ్చు పదో తరగతి ఫస్టుక్లాసులో పాస్సింగు అయ్యాం. మా కాలనీలో ఆ వారం కలరింగ్ అంతా మనమే!! నేను ఫస్టుక్లాసులో పాస్సింగు అయినందుకు మా నాన్న మరుసటి రోజు ఒక కొత్త టేప్రికార్డరు కొని చర్చిలో గిఫ్టుగా ఇస్తూ చెప్పిన మాట నాకు ఇప్పటికీ గుర్తే, “నేను, నా పిల్లలు అన్ని మతాలని గౌరవిస్తాం, కానీ తప్పు చేస్తే ఆ దేవుడినైనా ప్రశ్నిస్తాం”.

ప్రవీణ్

https://qr.ae/pyH8b9

## మీరు కలలు కన్న ఉద్యోగం ఏమిటి?

తాత ముత్తాతలు సంపాదించిన ఆస్తేమైనా సంక్రమిస్తే ఓ రెండెకరాల భూమి అట్టే పెట్టుకుని దాని మీద వచ్చే ఆదాయంతో ఇలాంటి బడ్డీ కొట్టు పెట్టుకుని చక్కగా కాలక్షేపం చేసుకోవచ్చనుకుంటాను. చిన్నప్పుడు ఇలాంటి కొట్టే మా ఇంటి పక్కన ఉంటే రోజంతా అక్కడే కూర్చుని ఆడుకుంటూ నేనే ఆ కొట్టు అమ్మేసేవాడ్ని.



*చిత్రం: I Love West godavari ఫేస్‌బుక్ పేజీ*

పెద్దగా పనేం ఉండదు. రోజుకోసారి సంతకెళ్ళి కావాల్సిన సామాన్లు తెచ్చుకుని గోలీ షోడాలు పట్టడం, అరటి పళ్ళు ముగ్గేయడం ఇంతే. పిల్లలకు ఇష్టమైన నారింజ మిఠాయిలు, పిప్పర మింట్లు, తాతా మామ ప్యాకెట్లు, బల్లిగుడ్లు, బబ్బులు కొమ్ములు, జీళ్ళు, జంతికలు, చేగోడీలు, బిస్కెట్లు అమ్ముతాను. బయట అరటి గెల తగిలించి ఉంటుంది.

నా కొట్టులో కలర్ షోడా ఫేమస్. ఒకసారి తాగేరంటే నాలిక మీద నుండి రుచి అసలు పోదంటే నమ్మండి. ఇంకా కాజాలు, కజ్జికాయలు నేనే సొంతంగా తయారు చేసి గాజు సీసాల్లో పెట్టి అమ్ముతాను. మీ అదృష్టం బావుంటే ఒక్కోసారి అప్పుడే చేసి పాకం కారుతూ ఉన్నవి పట్టుకెళ్ళచ్చు.

కొనేవాడు కొంటాడు, కొనకపోయినా పెద్దగా నష్టమేమీ ఉండదు. బడ్డీ పక్కన చిన్న సిమెంటు దిమ్మ ఏసేనంటే వచ్చే పోయే ఒళ్ళని కూర్చోబెట్టి కబుర్లు చెప్పుకోవచ్చు.

"బూపయ్యా.. నీ కొడుకు సదువైపోయిందా...?"

“సత్తెమ్మో.. నీ కూతుర్ని కాపురానికి ఎప్పుడంపుతావు?”

“ఇస్సనాదంగారు పోయేరంట.. ఎంత గొప్ప మడిసో..!!”

“దత్తుడిగారి పెద్దబ్బాయి అమెరికా నుండి దిగేడంట..!!”

ఇదేదీ రిటర్మెంటు ప్లాను అనుకునేరు.

నిజంగా అలా బ్రతకాలన్నా హైలీ ఓవర్ క్వాలిఫైడ్ అయిపోయింది జీవితం.

ఏదో అవ్వాలనుకుని ఇంకేదో అయిపోయి మరేదో చేస్తున్నాననేగానీ అసలు కలల ఉద్యోగం అంటే ఒక క్రికెటర్, ఒక మ్యుజీషియన్, ఆర్కెస్ట్రా సింగర్. వీళ్ళు ఆడుతుంటే జనాలు పూనకాలు వచ్చినట్టు ఊగిపోతారు.

నా ఊహాలన్నీ ఇలానే ఉండేవి. 360 పరుగుల లక్ష్యాన్ని ఛేదిస్తూ 129 కి 9 వికెట్లు కోల్పోయిన భారత జట్టుని సహచర ఆటగాడు వీరన్న కోహ్లీతో కలిసి విజయ తీరాలకు చేర్చింది నేనే. మొదట బ్యాటింగ్ చేసినప్పుడు ఓపెనర్ గా దిగి నాన్ స్ట్రైకర్ సింగరాజు ధావన్ నేను కలిసి యాభై ఓవర్లు అన్నీ సిక్సులు బాదేసి 1800/0 స్కోరుతో ప్రపంచ రికార్డుని నెలకొల్పాను. అలాగే ఒకే ఓవర్లో 6 వికెట్లు తీసింది కూడా నేనే.

ఈ స్టంట్లన్నీ ఏఆ క్రికెట్లోనే గానీ నిజ జీవితంలో మన ఆటకి జోకర్ గా కూడా ఎవడూ చేర్చుకోలేదు. 'ఆకాశంలో ఒక తార..' అని పాడుతూ డ్యాన్సులైనా వేద్దామని బయల్దేరినప్పుడు చెయ్యి విరిగింది. ఇంక బయట అడుగు పెడితే ఇంట్లో వాళ్ళు కాళ్లు విరగ్గొడతామన్నారు.

పదోతరగతి తరవాత జీవితమెటు అని గట్టిగా ఆలోచన చేసినప్పుడు నాకు సైన్సులో ఆసక్తి ఉందని ఆ దిశగా అడుగులు వెయ్యాలనిపించింది. మొదట ఉపాధ్యాయడవుదామనే చిన్న లక్ష్యంగా మొదలై అస్థిరంగా సాగుతూ ఎన్నో మలుపులు తీసుకుని ఇప్పటికి ఒక స్థిరమైన లక్ష్యంతో ఉన్నాను.

మూడేళ్ళ క్రితం ఉద్యోగం గురించి ఈ విధంగా అనుకున్నా..

మనకి బయటి ఉరుకుల పరుగుల ప్రపంచంతో అంతగా కుదరదు. ట్రాఫిక్, రొదా అసలే పడదు. చుట్టూ చెట్లు, పచ్చదనం ఉండాలి. ఆఫీసు నడచేంత దూరంలో ఉండాలి. వారాంతాలు సెలవులు కావాలి. ఆ సమయంలో పర్యటనలు, ట్రెక్కింగ్లు, పుస్తక పఠనం, అభిరుచుల్ని సానబెట్టడం, నచ్చింది వండుకుని తినడం. ఉద్యోగం ఆసక్తిగా ఉన్నా లేకపోయినా ఉద్యోగం బయటి జీవనం అయినా ఆసక్తిగా మలుచుకోవాలనే ప్రయత్నం. ఇన్ని సాధ్యపడచ్చు, పడకపోవచ్చు.

ప్రసాదరాజు

https://qr.ae/pyMufs

---

## తెలుగు సినిమాల్లో మీకు 'అతి' అనిపించేది ఏది?

హీరోల అతి గురించి చాలా చోట్ల ప్రస్తావిస్తారు కాబట్టి హీరోయిన్ల అతి చూద్దాం.

మన సినిమా హీరోయిన్ల వ్యక్తిత్వం....
ఎవరెస్ట్ అంత ఎత్తైనది...పసిఫిక్ కన్నా లోతైనది....

ఇరవై ఏళ్లకే వృద్ధాశ్రమాలు నడుపుతారు, పర్యావరణ పరిరక్షణ ఉద్యమాలు చేస్తారు. అనాథ పిల్లల ఆకలి తీర్చేస్తారు. ఒక చేత్తో జుట్టు సరిచేసుకుంటూ మరో చేత్తో గుడ్డి వాళ్ళని రోడ్లు దాటించగలిగే సవ్యసాచులు.

అంతకు మించి ఎక్కువ ఊహించుకోకండి. ఓకే ఓకే కొంచెం చిలిపిదనం కూడా జోడించాలి. అంతే.

ఆ మంచితనానికి సరైన జోడీ వారి అందం. ఆ అందాన్ని మరింత శోభితం చేసే వస్త్రధారణలో కూడా వీళ్ళు నిపుణులు. కానీ బల్లంటే భయం, చీమంటే హడలు. అన్నిటి నుండి ఆ హీరో మహానుభావుడే రక్షించాలి.

అన్నట్టు వీళ్ళకి నాట్యం కూడా తెలుసు. ఏ విధమైన తొట్రుపాటు లేకుండా లయబద్ధంగా హీరో పక్కన స్టెప్పులు వేసేస్తారు. ఇక వీళ్ళకి దేవుడంటే కూడా ఎనలేని భక్తి. అందుకే వీళ్ళని మెచ్చి దేవుడు అపూర్వ గాత్రం ఇస్తాడు. అదేసుకుని గుడిలో, బడిలో, మడిలో తెగ పాటలు పాడేస్తారు. ఆఖరికి ముగ్గులు కూడా అందంగా వేసేసే అద్వితీయ ప్రతిభావంతులు మన హీరోయిన్లు.

అమావాస్య నుండి కృష్ణ పక్ష చతుర్దశి దాకా, సోమ వారం నుండి ఆదివారం దాకా, సమయమేదైనా, స్థలమేదైనా వీరి వంటి మీద ఒక్క వెంట్రుక కూడా కనపడదు చికెన్ పకోడి బోర్డు పక్కన వేలాడదీసిన చచ్చిన కోడి లాగా. అదీ మాంసం ముద్దే, ఇదీ మాంసం ముద్దే. కాదంటారా!!!

అలా అని అసలు జుట్టు లేదని కాదు, నెత్తి మీద బోలెడంత ఉంటుంది లెండి. అదికూడా ఊరికే కూర్చోదు. గాలి వీచకున్నా ఎగిరే జుట్టు, కొవ్వు లేని పొట్ట వీళ్లకే సొంతం.

పేదరికంలో మగ్గుతూ, ఓ పూట అన్నం తిని సరిపెట్టుకున్నా, కన్నీళ్లకి కరగని వాటర్ ప్రూఫ్ మస్కార, ఒంటి రంగుకు నప్పే లిప్‌స్టిక్లు వీరింట్లో తప్పనిసరి వస్తువులు.

నాన్న ప్రకాష్ రాజైనా, కోటా శ్రీనివాసరావు అయినా వీళ్ళు మాత్రం హిమాచల్ నుండి దిగుమతి చేసుకున్న ఆపిల్ బ్యూటీలే.

ఇక వీరి దరహాసం గురించి చెప్పాలంటే .....
హోరున వీచే తుఫాన్ గాలి
భగ్గున మండే వేసవి ఎండ

ఎముకలు కొరికే హిమ పాతం
జోరున కురిసే కుండపోత వర్షం
చెరపలేదేది తెలుగు సినిమా హీరోయిన్ చిరునవ్వుని.

ఇంతలేసి అందగత్తెలు, బంగారు తల్లులు మన హీరో గారిని ప్రేమిస్తే, అతగాడు వాళ్ళమ్మకి ఈ నారీమణిని పరిచయం చేస్తే, ఆవిడ "నువ్వేం చేస్తావో తెలియదు, నాకీ అమ్మాయే కోడలుగా రావాలి" అంటుంటే నాలాంటి సాధారణ స్త్రీల బీపీ పెరుగుతూ పెరుగుతూ 'ఎవరెస్ట్ కన్నా ఎత్తైనది...' అనుకుంటూ అలా పై పైకి పోతుందనమాట.

చాలా సినిమాలలో (పాతవి, కొత్తవి) హీరో గారి కోసం తయారు చేసిన బొమ్మలుగా హీరోయిన్లని చూసి చూసి వచ్చిన విసుగిది. వారికో మెదడు ఉన్నట్టు అనిపించదు. బహుశా డైరెక్టర్లు, కథలు వ్రాసే వారు ఆడవారితో మాట్లాడరేమో, వారికీ రకరకాల వ్యక్తిత్వాలు ఉంటాయని తెలీదేమో!! నిజం చెప్పాలంటే బార్బీ బొమ్మ మీదొచ్చే సినిమాలలో ఆ బొమ్మ కున్న వ్యక్తిత్వం కూడా మన సినిమాలలో కనిపించదు నాకు. మళ్లీ ఈ తొక్కలో యాక్షన్‌ని కాపీ కొట్టి ఖ్యాతి గడించే Instagram తారలు. 🤦🏻‍♀️

లలిత నిగేష్
https://qr.ae/pyjuaL

## పరీక్షల్లో మీకు ఎదురైన విచిత్రమైన అనుభవం ఏమిటి?

అది బీటెక్ మొదటి సంవత్సరం C (C programming language ) ల్యాబ్ పరీక్ష. క్లాసులో ఉన్న 60మందిలో మొదటి 30మందికి పొద్దున్న, తర్వాత 30మందికి మధ్యాహ్నం పరీక్ష. మధ్యాహ్నం పుస్తకాలు బయట పెట్టేసి పరీక్షకి (ల్యాబ్‌కి) వెళ్ళాము. నాకు ఇచ్చిన ప్రోగ్రాం టెస్ట్ టైపు చేసేసి ఇన్విజిలేటర్ కి చూపించేసి కూర్చున్నాను. ఇంతలో ఎవరికో కంప్యూటర్‌లో సమస్య వస్తే నాది ఇచ్చి నన్ను ఎక్కడో ఒక మూల కూర్చోమన్నారు.

నేను వైవా కోసం వేచి చూస్తున్నాను. ఈ లోపల మా క్లాసుమేట్ ఒకడు తనకు ఇచ్చిన క్వశ్చన్ చెప్పి నన్ను ప్రోగ్రాం ఎలా వ్రాయాలో అడిగాడు. నేను నోటితో చెప్తుంటే వాడు టైపు చేసే లాగా. సరేలే పాపం, నేను చేసేది కూడా చేసేది ఏమీ లేదు కదా అని చెప్పడం మొదలెట్టా.

నేను - include stdio.h include conio.h int i for i=0 i<10 i++ printf scanf అని చెప్పుకుంటూ పోతున్నాను.

అతని కంప్యూటర్ స్క్రీన్ వైపు చూస్తే నేను సహాయం చేస్తున్నాని ఇన్విజిలేటరుకి అనుమానం వస్తుందేమో అని నేను ఎటో చూస్తూ గబగబా చెప్పేసి ఎందుకో అతని స్క్రీనుకేసిసి చూసాను. అతను మహాభారతం వ్రాస్తున్నట్టు చక్కగా నేను చెప్పిన ప్రతీ అక్షరం లైనుగా టైపు చేసుకుంటూ వెళ్ళిపోతున్నాడు (పైన నేను వ్రాసిన విధంగా ). నాకు ఫ్యూజులు ఎగిరిపోయాయి.

నేను - అదేంటి అలా టైపు చేసావు?

అతను - ఇదే కదా నువ్వు చెప్పావు.

నేను - నీకు కనీసం syntax కూడా రాదా. ఛీ! నేను చెప్పను పో.

అతను - ప్లీజ్ ప్లీజ్ చెప్పు నేను తర్వాత కోర్సు చేసి నేర్చుకుంటాను.

నేను - (చిరాకుగా ) సరే టైపు చేయి. Hash include angle bracket stdio.h angle bracket close, next line hash include angle bracket conio.h అని ఇంత వివరంగా చెప్పాను.

నా ఉద్దేశంలో  ఇలా ఉండాలి అని:

```
#include <stdio.h>
#include <conio.h>
```

ఈ మధ్యలో flower bracket అని చెప్తూ ఉంటే, “flower bracket ఆ? అంటే ఏంటి?” అని అడిగాడు. ఛీ నా జీవితం ఇలా అయిపోయిందేంటి అని నాకు నేను ఒక 5 తిట్లు, వాడిని ఒక 10 తిట్లు మనసులో తిట్టుకొన్నాను.

Flower bracket అంటే ఇది అని టేబుల్ మీద వేలితో '{' గీసి చూపించాను.

మీలో ఎవరైనా IT వాళ్లు ఉంటే నా బాధ తెలుస్తుంది.

For, మామూలు bracket ఓపెన్ i=0 semi colon i less than 10 semi colon i plus plus మామూలు bracket క్లోజ్. ఈ లెవెల్లో మొత్తం ప్రొగ్రాం చెప్పాను. అది టైపు చేస్తే ఇలా రావాలి

for(i=0;i<10;i++)

చచ్చి చెడి మొత్తం చెప్పడం అయ్యాక,

నేను : రన్ చేసి ఎర్రర్స్ ఉన్నాయేమో చూడు.

అతను : హే నువ్వు చెప్పాక ఎర్రర్ ఉంటుందా! అయినా ఔటపుట్ చూపించనవసరంలే కదా. ఇది చూపిస్తే చాలు కదా. లైట్.

నేను : అబ్బా ఒక సారి చూసుకో!

అతను : యే..... పిచ్చ లైట్.

ఈ లోపల నా వైవా వంతు వచ్చిందని నేను వెళ్ళిపోయాను. ఇన్విజిలేటర్ వచ్చి ప్రోగ్రాం ఔట్‌పుపుట్ చూపించమంది. వాడు షాక్ అయ్యాడు. ఎందుకని? Compile ఎలా చేయాలో రన్ ఎలా చేయాలో వాడికి వస్తే కదా. చాలా మందిని అడగడానికి చాలా ట్రై చేసాడు కానీ గది మూల అయిపోడంతో ఎవరూ అటు పక్కకి చూడలేదు. చివరికి ఔటపుట్ చూపించలేకపోయాడు. ఫెయిల్ అయ్యాడు పరీక్షలో.

వాడిని వీపు మీద నాలుగు బాదేయాలనిపించింది ఆ క్షణం. రక్షకుడు సినిమాలో నాగార్జునకి కోపం వస్తే నరాలు కనిపించినట్టు నాకు కూడా నరాలన్నీ బయటకి కనపడ్డాయి.

ఇక్కడ చాలా నీట్‌గా వ్రాసాను కానీ నాకు ఆ సమయంలో ప్రోగ్రాం బ్రాకెట్లతో సహా next లైన్ తో సహా చెప్పినప్పుడు విసుకొచ్చింది ఇంత వరస్ట్‌గా ఉంటారా జనాలు అని.

పుష్యమి<br>https://qr.ae/pyj5GG

## దీపావళి వేడుకల్లో మీకు జరిగిన హాస్యాస్పదమైన సంఘటన ఏదైనా ఉంటే చెప్పగలరా?

మా చిన్నపుడు ఒక దీపావళి రోజు జరిగిన సంఘటన ఎన్ని దశాబ్దాలు గడచినా ప్రతీ దీపావళికీ నా మదిలో మెదిలి పెదాలపై చిరునవ్వులు పూయిస్తుంది.

***

దీపావళి ముందురోజు సాయంత్రం నాన్నగారితో 'స్టోరు'కి వెళ్ళి టపాకాయలు కొనుక్కొచ్చి వాకిట్లో కాస్త ఎండ తగిలేటట్లుగా పెట్టాము. అలా పెడితే సాయంత్రం అవి తుస్సుమనకుండా బాగా పేల్తాయని అమ్మ చెప్పింది.

మా కాలనీలో(అవిభాజ్య ఆంధ్రపదేశ్‌లో) ఆంధ్రప్రదేశ్ విద్యుత్‌సంస్థ వారి దుకాణం ఒకటి ఉండేది, అందులో పప్పులు, ఉప్పులతో పాటు దీపావళి వస్తే టపాసులు కూడా అమ్మేవారు. ఆ దుకాణమే 'స్టోర్'.

సాయంత్రం ఎప్పుడవుతుందా, అమ్మ ఎప్పుడు దీపం పెట్టి, టపాసులు కాల్చడానికి 'గో' సిగ్నల్ ఇస్తుందా అని ఎదురుచూస్తున్నాను.

మధ్యాహ్న భోజనాలయ్యాయి. నిన్న రాత్రి దీపావళి టపాసులతో పాటు నేను, అక్క చెరొక గన్ను కూడా కొనుక్కున్నాము. గన్ను ఒక్కటే కాదు, అందులోకి చెరి కాసిని ప్యాకెట్ల రీళ్ళు, కేపులు కూడా. కేపులు అంటే మీకు తెలుసా? లేత గులాబీ, ఆరేంజ్ రంగు కలగలిసిన రంగులో గుండ్రంగా ఉండి, మధ్యలో బొడిపెలా ఉంటుంది. ఆ బొడిపె మీద రాయితోనో, లేదా బోల్టుతోనో కొడితే 'ఢాం' అంటుంది.

నా వాటా రీళ్ళన్నీ సినిమా హీరోలాగ 'ఢాం', 'ఢాం' అని వెంటనే కాల్చిపారేసాను. అక్కేమో నక్కి నక్కి కాల్పులు జరిపే ఉగ్రవాదిలాగ కాసిని కాసిని కాల్చుకుంటూ బోలెడు మిగుల్చుకుంది.

"అక్కా!ప్లీజ్, నాకు నీ రీళ్ళు కొన్ని ఇవ్వవా?"

"అంత త్వరగా మరి ఎందుకు అయిపోగొట్టుకున్నావు అన్నీ?"

"ప్లీజ్..."

అక్క ఏమీ మాట్లాడలేదు. సరే, సాయంత్రం కాల్చుకోవడానికి బోలెడు టపాసులున్నాయి కదా అనుకున్నాను కానీ, అక్క నాకు రీళ్ళు ఇవ్వలేదని కోపం వచ్చింది. అక్కని ఎలాగైనా భయపెట్టాలి అనుకుని, శోధించి సాధించిన రీలు ప్యాకెట్టుని నా గన్నులో లోడ్ చేసి పెట్టాను. అది బాత్రూంలోకి వెళ్ళి బయటకి వచ్చేటప్పుడు తలుపు ప్రక్కన నక్కి 'హ్యాండ్సప్' అంటూ భయపెడదామని. అప్పట్లో డీడీలో చూసిన తెలుగు సినిమాల ప్రభావం మరి...

ఇంతలో పెరట్లో బాత్రూం తలుపు చప్పుడయ్యింది. అక్క బాత్రూంలోకి వెళ్ళింది కాబట్టి నేను పొజిషన్ తీసుకోవాలి అని, గన్ను పట్టుకుని బాత్రూం తలుపు ప్రక్కనే నిల్చున్నాను. ఇంక అక్క బాత్రూం తలుపు తీసి కాలు బయట పెట్టడమేమిటి, దాని మీద కాల్పులు జరపాలని నా ప్లాన్.

బాత్రూం తలుపు గడియ తీస్తున్న శబ్దమయ్యింది....నేను అటెన్షన్లో నిల్చున్నాను.

క్రీక్...గడియ తీసింది...ఒక అడుగు ముందుకేసి గన్ను గురిపెట్టాను.

తలుపు తెరుచుకుంది... అంతే... ఢాం ఢాం అంటూ కాల్చాను... ఆ ఢామ్ముల కంటే పెద్ద సౌండుతో నాన్నగారు నా పేరు పిలవడం వినిపించి బిక్కచచ్చిపోయాను.

శంకరాభరణంలో 'శారదా!'కి రెండింతల శబ్దం, కోపంతో నాన్నగారు నా పేరు పలికారు.

వెనకాల నుండి కిసుక్కున నవ్వు.... అంటే... నాన్నగారు బాత్రూంలోకి వెళ్ళడం... అక్క అనుకుని నేను పొరపడటం... నేను పొజిషన్ తీసుకోవడం... ఇదంతా అక్కకి తెలుసు...

హమ్మ అక్కోయ్!

వాత్సల్య గుడిమళ్ళ<br>https://qr.ae/pvIIxB

## మీ కోరిక ఏమిటి? అది తీరిందా?

నేను ఈల వేస్తే గోల్కొండ అదిరిపడక్కర్లేదు, పడచు గుండెలు జారిపడక్కర్లేదు కానీ ఈలెయ్యడం మాత్రం నేర్చుకోవాలని నాకు ఎప్పటినుండో తీరని కోరిక. నోట్లో వేళ్ళు పెట్టుకుని చెవులు 'గుయ్య్' అనేలా ఈల వెయ్యడమంటే నాకెంతిష్టమో!

మూతి సున్నాలా చుట్టి ఏదో పాటలు పాడే ఈల అయితే వచ్చు కానీ(నేను 'చిన్ని చిన్ని ఆశ' అని ఈలతో పాడితే దాన్ని మీరు 'ఒసేయ్ రాములమ్మ' పాటనుకుంటే తప్పు నాది కాదు యువరానర్!) 'సుయ్య్య...' అని సీటీ కొట్టడం మాత్రం రాదు. నాకు వరుసకి కూడా ఎవరూ అన్నయ్యలు లేకపోవడంతో ఈల నేర్పే గురువు లేరు.

చిన్నప్పుడు 30 రోజుల్లో ఫలానా భాష మాట్లాడటమేలా అనో, మాలతీచందూర్ గారి వంటల పుస్తకాలో, సినిమా పాటల పుస్తకాలో దొరికేవి కానీ గేలగేలగా ఈలెయ్యడం ఎలా అనే పుస్తకాలు మాత్రం లేవు. ఇప్పుడు చేతిలోని మాయాపేటికలో ఉన్న 'నీ గొట్టం'(YouTubeకి స్వేచ్ఛానువాదం)లో గొట్టంగాళ్ళు(యూట్యూబర్స్) తమ అభిమానుల మీద వాత్సల్యంతో మంచినీళ్ళు గ్లాసులో ఎలా పొయ్యాలో దగ్గరనుండీ నేర్పించెస్తున్నారు కాబట్టి ఈలెయ్యడం ఎలా అన్న వీడియో కూడా ఉండే ఉంటుందని వెతికితే రకరకాల భాషల్లో బోలెడు వీడియోలు కనపడ్డాయి.

ఓం విఘ్నరాజాయ నమః అనుకుని, వేరెవరిదో ఎందుకని మొట్టమొదటగా తెలుగులో ఉన్న వీడియో చూసాను.ఆ వీడియో చూస్తే అబ్బ!ఈలెయ్యడం ఇంత వీజీయా అనిపించి వెంటనే అద్దం దగ్గరికెళ్ళి ప్రాక్టీసు మొదలెట్టాను. అద్దం నిండా తుంపర్లు పడ్డాయే తప్ప 'స్స్' అనే శబ్దం కూడా రాలేదు.

ఇంకో వీడియో చూసి ప్రాక్టీసు చేస్తే ఏదో శబ్దమైతే నోట్లోంచి బయటికొచ్చింది. నిజ్జం చెప్పాలంటే ఆ శబ్దం ఎలా ఉందంటే, ఏ పిల్లో లేదా కుక్కో ఈనినప్పుడు మనం దగ్గరికెళ్తే ' గుర్ర్'  అంటాయే అలాంటి శబ్దం బయటికొచ్చింది.

'గుర్ర్ శబ్దం కాదు బాబూ నాక్కావల్సింది, వినేవాళ్ల చెవులు గుయ్య్ అనేలా ఈలెయ్యడం' అనుకుని తెల్లతోలు కుర్రాడు నేర్పించిన వీడియో చూసాను. పైన చెప్పిన శబ్దమే వచ్చింది కానీ ఈసారి కాస్త సాఫ్ట్ గుర్ర్ వచ్చింది. అంటే, మొదటి అడుగు పడిందన్నమాట.

అయినా ఇంకో వీడియో ప్రయత్నిద్దామని తమిళ తంబి వీడియో చూసాను. ఈ తంబేమో ఒక వేలి తోటి, రెండు వేళ్ళతోటి, అసలు నోట్లో వేలేసుకోకుండా అవలీలగా ఈలేసెస్తోంటే నేను అతని ప్రతిభ చూసి ముక్కున వేలేసుకున్నాను.

'ప్రజాధనం కాని కళావిలాసం ఏ ప్రయోజనం లేని వృథా వికాసం' అని సిరివెన్నెలగారన్నట్లు మీకు ఎన్ని వేళ్ళతో, ఎన్ని రకాలుగా ఈలెయ్యడం వస్తే ఏమి లాభం బ్రదర్?మాలాంటివాళ్ళకి నేర్పించలేకపోతే?

నా ఈల నేర్చుకోవడం ఎలా ఉందంటే, మనం ఎగ్జిబిషనుకెళ్ళినప్పుడు అక్కడ షాపువాడు అవేవో చాకులు, పీలర్లు ఉపయోగించి కూరలని శ్రీదేవంత అందంగా, త్రిష అంత నాజూగ్గా తరిగేస్తుంటే ఆవేశంతో కొనేసి ఇంటికొచ్చి చూసినప్పుడు, అరే, ఈ చాకుతోనేనా షాపువాడు ఇన్ని విన్యాసాలు చేసింది అని ఆశ్చర్యపోతాము కద!అలాగన్నమాట.

వీడియో చూడటం, 'ఓస్ ఇంతేనా?' అనుకోవడం, ప్రయత్నిస్తే 'ఓస్' కాస్తా 'స్స్స' అవ్వడం.

'ఈలెయ్యడం ఎలా?' అనే వీడియో ఏ భాషలో ఉన్నా అందరూ చెప్పే సూత్రం మాత్రం ఒక్కటే. అదేమిటంటే, నాలుక మడతేసి, రెండు వేళ్ళు గుండ్రంగా చుట్టి లోపల నాలుక మీద పెట్టి, ఆ సందు ద్వారా గొంతులోంచి గాలి బయటకి తీస్తే అదే ఈల అని. కానీ అదే రావట్లేదే... ఎలా? హౌ? కైసే? ఎప్పుడి?

ఎవరెన్ని రకాలుగా నేర్పించినా ప్రక్కటెముకలు అలసిపోయేటట్లు కపాలభాతి వ్యాయామం అవుతోందే తప్ప ఈల మాత్రం నోట్లోంచి ఊడిపడనంటుంటే ఇలా కాదనుకుని మళ్ళీ ఇంకో తెలుగు వీడియో చూడటం మొదలెట్టాను. ఈసారి ఇంకాస్త నయం. హార్డ్ గుర్ర్‌లు, సాఫ్ట్ గుర్ర్‌లు కాకుండా ఏదో ఈల లాంటి శబ్దమేదో నూతిలోంచి వస్తున్నట్లుగా వస్తోంది. నా ప్రోగ్రెస్ మీకు అర్థమయ్యేటట్లుగా వివరించాలి అంటే, డ్రిల్లు మాస్టారి నోట్లో ఉన్న విజిల్ ఒక్కోసారి ఏదో అడ్డం పడ్డట్టు మెల్లిగా శబ్దం చేస్తుందే, అలాగన్నమాట. దీనినే నేను ప్రాక్టీసు చేస్తే నోట్లోంచి ఈల ఊడిపడుతుందంటారా?ఏమో, కొన్ని కొన్ని ప్రశ్నలకి కాలమే సమాధానం చెప్తుంది.

ఇంతకీ ఈల నేర్చుకోవాలనే కోరిక మళ్ళీ ఈ మధ్యే ఎందుకు పుట్టిందంటే, నేను ఇళయరాజా కచేరీకి వెళ్ళాలనుకుని టిక్కెట్లు కొనుక్కున్నాను. ఆ కచేరీలో వన్స్‌మోర్‌లు కొట్టాలంటే విజిల్ వేస్తేనే కదా మజా!

ఇంటి దొంగని ఈశ్వరుడు పట్టలేడు, ఈలరానివాడు వన్స్‌మోర్‌లు కొట్టలేడని నా నమ్మకం కాబట్టి ఈ కార్యక్రమానికి వెళ్ళేలోపు నేర్చేసుకుందామనుకున్నాను కానీ అబ్బే...ఈలెయ్యడం రాలేదు.

ఒకవేళ నేను ఆ కార్యక్రమం చూస్తూ ఉత్సాహంలో నోట్లో వేళ్ళెట్టేసుకుని ఈలెయ్యబోయి 'గుర్ర్' అనే శబ్దం చేస్తే లోపలకి ఏ కుక్కో వచ్చిందనుకుని వాళ్ళు కార్యక్రమం ఆపితే కష్టమని అవసరం తీరడానికి ఓ ప్లాస్టిక్ ఈల కొనుక్కొచ్చాను.

ఇళయరాజా కార్యక్రమం అయిపోయింది కానీ ఈలెయ్యడం మాత్రం ఇంకా రాలేదు. ఎప్పటికి తీరేనో నా ఈ చిన్ని కోరిక.

వాత్సల్య గుడిమళ్ళ<br>https://qr.ae/pyModm

## వాసుదేవోఽభిరక్షతు వంటి పదాల్లో 'ఽ' అనే అక్షరం అర్థం ఏమిటి? దానిని ఎందుకు ఉపయోగిస్తారు? దానిని ఉచ్చరించడం ఎలా?

ఈ 'ఽ' గుర్తును 'అవగ్రహం' అంటారు. ఇది సంస్కృత పదాల మధ్య విసర్గ సంధి జరిగినప్పుడు వస్తుంది. సంధి జరిగి అకారం లోపమైనప్పుడు, 'అక్కడ నిజానికి ఒక 'అ' అన్న అక్షరం ఉండేది, సంధి వలన అది పోయింది కానీ దానిని ఉన్నట్లుగా భావించి ఉచ్చారణలో కలుపుకోవాలి' అని చెప్పడానికి ఈ అవగ్రహ చిహ్నాన్ని ఉంచుతారు.

పై ఉదాహరణలో

"వాసుదేవః + అభిరక్షతు --> వాసుదేవో + అభిరక్షతు -->వాసుదేవోభిరక్షతు" అని వచ్చి విసర్గ 'ఓ' గా మారినప్పుడు దాని ప్రక్కన వచ్చిన అకారం పోయింది. కానీ పలికేటప్పుడు 'వాసుదేవోభిరక్షతు' అని కాక 'వాసుదేవోఅభిరక్షతు' అన్నట్లు అకారాన్ని పూర్తిగా కాక, సగం పలికినట్లు, లేక చివరి 'వో' ను కొంత దీర్ఘంగా పలకడంద్వారా సగం అకారం ధ్వనించేటట్లు ఉచ్చరించాలి. కనుక ఆ కనిపించకుండా పోయిన సగం 'అ' కు గుర్తుగా 'ఽ' ను ఉంచి 'వాసుదేవోఽభిరక్షతు' అని వ్రాస్తారు. అక్కడ సంధి జరిగిందని తెలిసిన వారు ఆ గుర్తు లేకున్నా సరిగానే ఉచ్చరిస్తారు. కానీ ఉచ్చారణా దోషాలను పరిహరించడానికి అవగ్రహం ఉంచడం తప్పనిసరి.

ఇది కేవలం సంస్కృత పదాల్లోనే వస్తుంది.

చంద్రమోహన్
https://qr.ae/pykXoP

## తెలంగాణ మాండలికంలో ప్రాచీన తెలుగు పలుకుబళ్ళు, పద నిర్మాణ శైలి ఇప్పటికీ అలానే నిలబడిందని చెప్తారు కొందరు. ఇందులో వాస్తవం ఎంత? ఉదాహరణ సహితంగా చెప్పగలరా?

ప్రాచీన తెలుగు పదాలు అయితే ఉన్నాయి. మరో మాటకు తావే లేదు.

ఈ విషయంపై ఎందరో పరిశోధన చేసి ఉండవచ్చు. నేను నా వంతుగా సమర్పిస్తున్న ఒక నూలు పోగు..

నేను ఇక్కడ ప్రస్తావించే పదాలు కేవలం తెలంగాణాకే పరిమితం అని అనుకోలేను. ఇంకా పలు మారు మూల గ్రామాల్లో ఉభయ తెలుగు రాష్ట్రాల్లో ఉండే ఉంటాయి. అయినా కూడా పట్టణ జన సామాన్యంలో, శిష్ట ప్రయోగంలో, సినిమాలలో ఎక్కువగా నేను చూడని లేదా అంత విరివిగా వాడడం లేదు అని అనిపించిన పదాలు కొన్ని ఉదాహరణలతో..

నాకు తెలిసి, నేనూ, మా చుట్టు పక్కల గ్రామాల్లో వినబడే, వాడబడే పదాలు పద్దెనిమిదవ శతాబ్దపు వేమన శతకం ఆసరా చేసుకుని చెప్పే ప్రయత్నం.

వేమన శతకం ప్రాచీన వచన తెలుగు క్రింద పరిగణించవచ్చా?

(1) తేట తేట తెలుగులో ఉన్న తేట అంతే స్వచ్ఛంగా నిలిచి ఉంది. చెరువులో నీళ్లు తేటగా ఉంటే అందులో నీలాకాశం, మన నీడ చూస్తుంటే మనసుకు అదో హాయి. బట్టలు తేటగా ఉతికి తొడిగితే మనిషికే వన్నె.

*ఆత్మయందు జ్యోతి యెఱుగుట లింగంబు*
*తెలిసిచూడగాను తేటపడును*
*అదియు గురువులేక యబ్బునా తెలియంగ*
*విశ్వదాభిరామ వినుర వేమ!*

తేటతెల్లం - ఇలాంటిదే తెల్లం కూడా. ఇది తెలుపు అని కాక సవ్యం, స్పష్టం అన్న అర్థంలో వాడుతారు. తెల్లగ చేసినట్టు మా చెప్పొచ్చావులే అన్నట్టు.

(2) నాకు తెలుగు తెలుసు. తెలంగాణ కూడా ఎఱుకనే. కావాలంటే ఇదిగో ఈ వేమన పద్యం చూడండి. పరిపక్వత అంటే ఎవరికీ అర్థం కాదు. పెద్దతనం అంటే మాత్రం సందర్భాన్ని బట్టి పెద్దరికం, కావచ్చు, లేదా పెత్తనం కావచ్చు. చిన్నతనం అంటే లోకువ.

*అంకి లెఱిఁగి మాట లాడనేర్చినపుడె*
*పిన్న పెద్దతనము లెన్నలేల*

*చిన్న చేతిదివ్వె పెద్దగా వెలుఁగదా*
*విశ్వదాభిరామ వినుర వేమ!*

(3) కష్టపడి పనిచేయవచ్చు. ఇష్టంతో కష్టపడి మన్ను మిన్ను ఏకం చేసి ఒక కార్యం సాధించవచ్చు. అలా అనడానికి తెలంగాణా అంతటా వాడుకలో ముప్పతిప్పలు పడి చేసిన అనడం పరిపాటి.

*అంగ మెల్ల వడలి, యటు దంతములు నూడి*
*తనువు ముదిమిచేతఁ దఱుచు వడక*
*ముప్పు తిప్పులఁ బడి మోహంబు విడువడు*
*విశ్వదాభిరామ వినుర వేమ!*

(4) మందలించి అని అందరం వింటాం. కానీ అదిలించు అని ఇప్పుడు ఎక్కువగా పశువులకు మాత్రమే వాడడం చూస్తున్నా. Nudge అనుకోవచ్చు. పిల్లలు అదిలింపు లేక అల్లరి చిల్లరగా తయారు అయినారు అన్నట్టు.

*అంటుముట్టునెంచి యదలించి పడవైచి*
*దూరమందు చేరి దూరుచుంద్రు*
*పుట్టిచచ్చుజనులు పూర్ణంబెరుగక*
*విశ్వదాభిరామ వినుర వేమ!*

(5) ఏదైనా చెల్లితో పంచుకోకుండా ఉంటేనో, ఒకరిని తక్కువ చేసి మాట్లాడితేనో నానమ్మ వెంటనే గుడ్లురిమి ఎందుకు అల్పబుద్ధి/కొంచెపు బుద్ధి అని తిట్టేయడం ఇప్పటికీ గుర్తే. అలా ఆ తిట్టుకు పాత్రమైన పనులు ఏవి ఇప్పుడు కూడా చేసే ధైర్యం చేయలేనంత.

*అంతరాత్మఁ గనక యల్పబుద్ధులతోడ*
*మెలఁగునట్టి ద్విజులు మేదినందు*
*యమునినరకములకు నరుగంగ నది సాక్షి*
*విశ్వదాభిరామ వినుర వేమ!*

(6) చోటు అనే ప్రతి చోటా తావు అని కూడా అనవచ్చు. గుండె తావున లేదు అంటే మనసు మనసులో లేదు అని.

*అంధులైన వారు నందు నిం దనకుండు*
*నన్నితావులందు హరునివలెను*
*తెలియువారి కెల్ల దేవుఁడే కనుపించు*
*విశ్వదాభిరామ వినుర వేమ!*

(7) ఆమోదం, అంగీకారం అనడం కన్నా ఒప్పడం అనే వాడుక విరివిగా కనిపిస్తుంది. నువ్వు చేసే పని బాగాలేదు. నేను ఒప్ప అంటారు. అలాగే డబ్బు బదులు చిల్లి గవ్వ కూడా లేదు అంటారు. నయా పైసా లేదు అనడానికి అసలు సిసలు రూపం.

*అధికుడైనరాజు నల్పును చేపట్టు*
*వానిమాట చెల్లు వసుధలోన*
*గణికు లొప్పియున్న గవ్వలు చెల్లవా*
*విశ్వదాభిరామ వినుర వేమ!*

(8) పరిగెట్టు అనేదానికి ఎక్కువగా ఉరుకు(ఉఱుకు) అనే అంటారు. పరుగు అంటే ఎవరికీ అర్థం కాకపోయినా ఆశ్చర్యం లేదు. రాయల విరచిత ఆముక్త మాల్యదలోనిది ..

*పులు మఖశాలికానికట భూముల మేయుచు నేటి వెంటఁ బె ల్లాలమెడు నీఱముం*
*దఱిసి యామ్యపతాకన ఘర్మదేను వా కెళవున నాడు వాల భుజగిం గని గోండ్రని*
*యంగలార్చుచున్ గళగత ఘంట మ్రోయ నుఱుకం బిడుగుంబలె దాఁకి యుద్ధతిన్.*

(9) బువ్వ గురించి కొత్తగా నేను చెప్పేది ఏముంది. కాకపోతే మోటు అని ఇప్పుడు వాడడం తగ్గింది.

*అన్న మధికమైన నది తనుఁజంపును*
*నన్న మంటకున్న నాత్మ నొచ్చుఁ*
*జంప నొంప బువ్వ చాలదా వెయ్యేల*
*విశ్వదాభిరామ వినుర వేమ!*

(10) చూడు, చూడడం, చూడగా, కనిపించడం బదులుగా ఇదిగో కానొచ్చు (కానవచ్చు), కానరాగా, కానరాదు, కానరాక.. అన్ని క్రియా రూపాలు అలాగే ఉన్నాయి.

*ఆకు కానవచ్చు హరిహరాదులకును*
*కొమ్మ గానరాదు కోరిచూడ*
*కొమ్మగానరాగఁ గొనియాడ కుండురా*
*విశ్వదాభిరామ వినుర వేమ!*

(11) మన్ను, మట్టి అందరికి తెలిసిందే. మంటి ఇంకా ఎక్కువగా వాడుతారు. మంటిల/మంట్ల అడుకోకు అని పిల్లల్ని అజమాయిస్తూ ఉంటాం.

*మంటికుండవంటి మాయ శరీరంబు*
*చచ్చునెన్నడైన, చావదాత్మ*

*ఘటములెన్నియైన గగనమొక్కటేగదా,*
*విశ్వదాభిరామ వినుర వేమ!*

(12) ఇంగలం అంటే నిప్పు. పొయ్యిలో నుండి ఇంగలాలు తెచ్చి, గరిటలో వేసి, అందులో నెయ్యి పోసి నీళ్ళు తిప్పుతూ నైవేద్యం ఆరగింపు చేయడం, ఆ పరిమళం గది, మది నిండా నింపుకోవడం చిన్నప్పటి పండగల్లో ఒక దైవానుభూతి. నింగలం అని కూడా వినిపిస్తుంది.

*ఇంగలంబు తోడ నిల సల్పుతోడను*
*పరుని యాలితోడ పతితుతోడ*
*సరసమాడుటెల్ల చావుకు మూలము*
*విశ్వదాభిరామ వినుర వేమ!*

పోతన చేత మరొక ఉపమానం:

*ఇంగలముతోడి సంగతి*
*బంగారము వన్నె గలుగు భంగిని ద్వత్సే*
*వాంగీకృతుల యఘంబులు*
*భంగంబులఁ బొందు ముక్తి ప్రాపించు హరీ!*

(13) మొండి, పెంకి, మంకు. ఎంత మంకు పట్టు పట్టి ధనం కూడబెట్టినా వెంట కొంచబోయేది ఏమి లేదు. తీసుకెళ్లడం అరుదు. కొంచపో (కొని+పో), కొంచపోతా, కొంచపోయినాడు, కొంచపోలేదు అని వాడుక. కొంచెపోడు అంటే మాత్రం కొంచెపు+వాడు తక్కువ బుద్ధి కలవాడు అని కూడా అర్థం వస్తుంది.

*ఇంటిలోనిధనము నిదినాది యనుచును*
*మంటిలోనఁదాచు మంకుజీవి*
*కొంచఁబోడు వెంట గుల్లకాసును రాదు*
*విశ్వదాభిరామ వినుర వేమ!*

*ఏమి గొంచువచ్చె నేమి తాఁగొనిపోవుఁ*
*బుట్టువేళ నరుఁడు గిట్టువేళ*
*ధనము లెచటి కేఁగు దానేగు నెచటికి*
*విశ్వదాభిరామ వినుర వేమ!*

(14) రోత అంటే తెలిసిందే. కానీ ఇంకా విరివిగా వాడడం కద్దు. రోయక దానం చేస్తారు అంటే అలుపు విసుగు లేక దానం చేస్తారు అని.

*ఇంద్రియములచేత నెగ్గొందుచుండెడు*
*వెఱ్ఱిమనుజుఁ డేల వెదకు శివుని?*
*ఇంద్రియముల రోసి యీశునిఁ జూడరా*
*విశ్వదాభిరామ వినుర వేమ!*

(15) నవ్వడం. నగడం. నగుబాటు కావడం. నగు. ఎలా అయినా నవ్వడమే కదా ముఖ్యం.

*ఎర్రనాడుదాని ఏపారచూచిన*
*వేకిబుట్టు చాల వెర్రిబుట్టు*
*పల్లు తెరచి నగిన పట్టు పెన్భూతంబు*
*విశ్వదాభిరామ వినుర వేమ!*

(16) అవులకు దూడను దగ్గర చెసి పాలు విడిచేలా చేయడమే ఈ చేపడం లేదా సేపడం. పాలు పిండడానకి యంత్రాలు వచ్చాక ఇంకా ఏం మిగిలింది.

*ఎరుకలేని దొరల నెన్నాళ్ళు కొలచినా*
*బ్రతుకలేదు వట్టి బ్రాంతిగాని*
*గొడ్డుటావుపాలు కోరిన చేపునా*
*విశ్వదాభిరామ వినురవేమ!*

(17) ఒల్ల. వద్దు అని ఒక అర్థం. కావాలి అనిపించడం ఇంకో అర్థం. అన్నం ఒల్ల అంటే అన్నం వద్దు అని. అదే అన్నం ఒల్ల బుద్ధి లేదు అంటే కావాలి అనిపించడం లేదు అని.

*ఒల్ల నన్నఁ బోదు నొల్ల ననఁగరాదు*
*తొల్లి చేయునట్టి ధూర్తఫలము*
*ఉల్లమందు వగవకుండుట యోగ్యంబు*
*విశ్వదాభిరామ వినుర వేమ!*

(18) ఓగు-చెడు. బాగోగు అన్న రూపం ఇంకా అంతటా ఉన్నది..

*ఓగుబాగెఱుఁగని యుత్తమూఢజనంబు*
*లిలను ధీ జనముల నెంచుటెల్ల*
*కరినిజూచి కుక్క మొఱిగిన సామ్యమౌ*
*విశ్వదాభిరామ వినుర వేమ!*

(19) కర్రలాగా అచేతనంగా, స్పందన లేకుండా అనే అర్థంలో మనిషి బిర్ర బిగుసుకుని ఉంటే ఇంకా ఏం చేయి అందిస్తాము?

*కడుపు బోరగించి కన్నులు ముకుళించి*
*బిఱ్ఱబిగిసికొన్న బేదయోగి*
*యమునిబాఱిగొఱ్ఱె యతఁ డేమిసేయును*
*విశ్వదాభిరామ వినర వేమ!*

(20) నిరుడు తెలిసిందే. కానీ గత కాలం అని చెప్పడానికి ఇప్పటికీ నిరుడు ముందటేడు అనడం అలాగే ఉంది.

*కన్నులందు మదము గప్పి కానరుగాని*
*నిరుడు మీదటేఁడు నిన్న మొన్న*
*దగ్గులయిన వారు తమకంటెఁ దక్కువా*
*విశ్వదాభిరామ వినుర వేమ!*

(21) అసలు కన్నా కొసరు ముద్దు. మనుమలను గారవం(గారాబం) చేయని అవ్వ తాతలు ఉందురా? వాడుకలో గార్వంలా మిగిలింది.

*నీవు సుభద్రకంటె గడు నెయ్యము గారవముం దలిర్ప సం భావన సేసినట్టి నను*
*బంకజనాభ! యొకండు రాజసూ యావభృదంబునందు శుచియై పెనుబొందిన*
*వేణిబట్టి యీ యెవ్వరు చూడగా సభకు నీడ్చె కులాంగన నిట్లొనర్తురే.* ( ఉద్యోగ. 310)

(22) సంక్రాంతి నాడు తేరు ముగ్గులు ఇంటింటి ముందు దర్శనం ఇస్తాయి. రథం అంటే వ్రతం అనుకుని పొరబడే అవకాశం ఉందేమో కానీ తేరు మాత్రం అందరికీ గురుతే. పోతన విరచిత పద్యంలోనిది ఈ ప్రయోగం.

*ఆ తేరా రథికుండు నా హయము లా యస్త్రాసనం బా శర వ్రాతం బన్యుల దొల్లి*
*జంపును దుదిన్ వ్యర్థంబులై పోయె మ చ్చేతోధీశుడు చక్రిలేమి భసితక్షిప్తాజ్య*
*మాయావి మా యతంత్రోషరభూమి బీజముల మర్యాద న్నిమేషంబునన్.*

ఇలాంటివే ఇంకా ఎన్నో పదాలు ప్రయోగాలు తెలుగు ప్రాంతాల నిండా ఇంకా బ్రతికే ఉన్నాయి. కొంత ఓర్పు, జానపదం మోటు కాదు అన్న చిన్న విశాల హృదయం ఉంటే వీటిని మరుగు కాకుండా నిత్య జీవితంలో ఇంకా కాపాడుకోవచ్చు.

ముక్తాయింపుగా ఈ పద్యం సందర్భోచితం

*ఊరిబావిలోని యుదకమ్ము నిందించి*
*పాదతీర్థమునకు భ్రమయువారు*

*పాదతీర్థములను ఫలమేమి కందురా*
*విశ్వదాభిరామ వినుర వేమ!*

ప్రత్యూష
https://qr.ae/pyMrJg

## పొలిమేర అనే పదంలో పొలి అంటే ఏమిటి?

పొలియన్నము వేయు మేర - పొలిమేర.

పూర్వం తెలుగు ప్రాంతాల్లోని జానపదుల్లో గ్రామ దేవతల కొలుపులు వైదిక దేవతలకంటే ఎక్కువ ఉండేవి. ఈ దేవతల ఆరాధనలో భాగంగా దున్నపోతును బలియిచ్చి 'పొలి/బలి' అన్నంలో ఆ దున్న రక్తాన్ని కలిపి దేవతకు ఆ పొలియన్నాన్ని బోనంగా పెట్టి ఊరి సరిహద్దు మేర ఆ పొలియన్నం (పొలియన్నము వేయుమేర-పొలిమేర) చల్లుతూ మధ్య మధ్యలో గొఱ్ఱెలను, మేకలను, కోళ్ళను కోసి భూతబలి యిచ్చేవారు.

భూతబలిని (పొలియన్నాన్ని) చల్లే వాణ్ణి 'భూతపిల్లిగాడు' అనేవారు. అది 'భూతబలిగాడు' అన్న పదమే, కాకపోతే జానపదుల నోట్లో భూతపిల్లిగాడైంది. వాడు నెత్తినుండి కాలిగోరువరకు కనుబొమ్మలతో సహా శరీరమంతటా ఒక్క వెంట్రుకకూడా వెదకినా కానరానట్లుగా గొరిగించుకుని పూర్తి నగ్నంగా 'పొలి, పొలి' అని పొలికేకలు వేసి పొలియన్నాన్ని చల్లి, రాశినుండి అన్నాన్ని కుండలో పెట్టుకొని ఊరి కావలివారితో సహా ఊరి చుట్టు తిరిగి వచ్చేవాడట.

పూర్వం యుద్ధానికి పోయేవారు శాకినీ ఢాకిన్యాది భూతాలకు పొలియిచ్చి పోయేవారేమోనని, యుద్ధములో గెలిచినవారు శత్రువుల మాంసముతో, రక్తముతో ఉడికించిన అన్నాన్ని కలిపి రణ పిశాచాలకు బలియిచ్చి వచ్చేవారేమోనని, వెలమరాజులు అలా చేసినట్లు వెలుగోటి వారి వంశావళిలో పేర్కొన్నారని సురవరం ప్రతాపరెడ్డిగారు ఆంధ్రుల సాంఘికచరిత్ర పుస్తకంలో ప్రస్తావించారు. దీన్నే రణము కుడుపు / రణంగుడుపు అనేవారట.

మనం చాలా సాధారణంగా వాడేసే ఒక పదం వెనుక ఎంతటి చరిత్రుందోనని ఆలోచిస్తే భలే ఆశ్చర్యంగా ఉంటుంది అప్పుడప్పుడు!

సూర్య పడుకొనె
https://qr.ae/pyjwhX

## వాడుకలో తమ అసలు అర్థాలు కాకుండా వేరే అర్థాలతో ప్రాచుర్యం పొందిన పదాలు అనగానే మీకు ఏమి గుర్తుకు వస్తాయి?

అర్థ విపరిణామం ప్రతి భాషకూ సహజం. భాష ప్రవాహిని. వాడుక లో పద స్వరూపంలో మార్పు జరుగుతూ ఉంటుంది . అలాగే అర్థమున్నూ.. వాక్యంలో ఆ పదం వాడే దాన్ని (సందర్భాన్ని) బట్టి కూడా వేర్వేరు అర్థాలు వస్తూ ఉంటాయి.

**కొన్ని ఉదాహరణలు:**
అయోమయం, అసలు, గోవిందా, టోపీ వేసాడు, మొద్దు, యతిమతం, తిథి, పక్షపాతం, అనుమానం, అధ్వాన్నం, వేషాలు వేస్తున్నాడు, ప్రజ, పాలన, రాజకీయం, పటము, మందం, ప్రియం.

వివరణ = మొదటిది శబ్దార్థం – రెండోది ఇపుడు వాడుకలోది.

అయోమయం = ఇనుముతో నిండినది – ఏమీ తెలియని వాడు.

అసలు = బురద – పెట్టుబడి.

గోవిందా = భగవంతుణ్ణి స్మరించుకోనేటప్పుడు అనే ఒక పదం – మోసం చేయడం

టోపీ వేసాడు = టోపీ ఎవరికైనా ధరింపజేసాడు – మోసం చేసాడు.

యతిమతం = సాధుపురుషుల అభిప్రాయం– తిక్కలోడు .

తిథి = పాడ్యమి విదియ మొదలైనవి – తద్దినం. పితృ దినం

మొద్దు = కొయ్య – (కోయనిది ) – చలనం లేని వాడు.

పక్షపాతం = రెక్కలు విరగడం / పడిపోవడం – స్వ పర భేదంతో నడుచుకొనడం.

అనుమానం = కొలతను అనుసరించి – సందేహించడం.

అధ్వాన్నం = దారిలో తినే అన్నం – ఎందుకూ పనికి రానిది.

వేషాలు వేస్తున్నాడు = వేషాలు నాటకంలో వేస్తున్నాడు – తెలియనట్లు నటిస్తున్నాడు.

ప్రజ = కన్న బిడ్డ – దేశంలోని మనిషి.

కౌసల్యా సు ప్రజా ! రామ ! – అని విశ్వామిత్ర మహర్షి శ్రీరాముణ్ణి లేపుతాడు. కౌసల్య యొక్క ముద్దు బిడ్డ ఐన ఓ రామా !– అని.

పాలన = కాపాడడం — కర్ర పెత్తనం చేయడం.

రాజకీయం = రాజకు సంబంధించినది — కడుపులో ఏదో పెట్టుకొని మంచివాడుగా నమ్మించడం.

పటము = వస్త్రం — ఫోటో. వస్త్రం అనేది ఒకటే దీని అర్థం.

మందం = మెల్లగా — లావు( గుడ్డ విషయంలో ), అజీర్ణం

[పాత రోజుల్లో గుడ్డ మీదనే రంగులతో చిత్రాలు వేసేవారు. చిత్ర పటం అంటే చిత్రం ఉన్న వస్త్రం — క్రమంగా పటం ఐపోయింది]

ప్రియం = ఇష్టమైనది — ధర ఎక్కువ.

శివరామ ప్రసాద్ మాచవోలు
https://qr.ae/pyjwyc

## తుంగలో తొక్కడం అంటే ఏమిటి?

పేదవాడు పూరింట్లో ఉంటున్నాడు అంటాము. పేదవాడు మట్టితో నాలుగు గోడలు పెట్టి ఒక గోతాము వాకిట అడ్డంగా ఏర్పాటు చేసుకొంటాడు. పైన ఎండ తగలకుండా కొన్ని తాటాకులు పరిచి పైన ఎండుగడ్డి పరుస్తాడు. అది పూరిల్లు (పూరి అంటే ఎండు గడ్డి. కసవు అంటే పచ్చి గడ్డి).

తాటాకు త్వరగా ఎండలకు ఎండిపోతుంది. పొడి పొడిగా రాలిపోతూ ఉంటుంది. ఒక రెండు మూడేళ్ళకు మళ్ళీ తాటాకు కప్పాల్సి ఉంటుంది. అగ్ని ప్రమాదాలకు తేలికగా బలి అయ్యేది ఈ పూరిళ్ళే.

దీనికంటే కొంచెం ఖర్చూ, భద్రత , మన్నిక గలిగింది తుంగ కప్పిన ఇల్లు. అంతకంటే లేదా దీనితో సమానమైంది విడవలితో ఇంటి కప్పు వేసుకోవడం.

తాటాకు, గడ్డి దొరికినంత ఎక్కువగా ఇవి దొరకవు. దొరువుల్లో పెరిగే తుంగ కోసి ఎండబెట్టి పంజలుగా కట్టి , తెచ్చుకోవాలి. దాన్ని నేయాలి. ఆ పరచడం తాటాకు పేర్చినట్టు కాదు. కొంత నేర్పు ఉండాలి. అడుగున తాటి బద్దలతో గట్టి చట్రం (ఫ్రేమ్) ఆ పెద్ద ఇంటి మొత్తానికీ ముందు తాళ్ళతోనో, తడపలతోనో చీలలతోనో సిద్ధం చేయాలి. తర్వాత దాని మీద బాగా మోపుగా ఒక మూర లావు ఉండేట్టు – ఆ తుంగ నేయాలి. చక్కగా వాటంగా వాన నీరు జారిపోయేట్టు చేయాలి. ఇటుక రాతి గోడల మీద బాగా ఎత్తుగా నిర్మించింది గాబట్టి ఏడెనిమిదేళ్లు దాని జోలికి పోబనిలేదు. పెద్దగా అగ్ని ప్రమాదాల పాలూ కాదు.

వానలకు ఈ తుంగ పస తగ్గి పోతుంది. ఎండలు, కోతుల బాధలూ ఉంటాయి. అవి మార్చే సమయానికి కింద ఉన్న తాటి బద్దల చట్రం గూడా ఉలుకుబట్టి, చెదలు చేరి నాశనమై యుంటుంది. మళ్ళీ దాన్ని చక్క జేయడం కొత్తగా నిర్మించినంత పని అవుతుంది.

నల్లగాబోయిన ఆ తుంగ ఎండ వానలకు ససి చెడి , అసహ్యంగా నిరుపయోగంగా ఉంటుంది. దాన్ని పూర్తిగా తీసిపారేసి, వేరే తుంగ మళ్ళీ నేయాలి... పెద్ద ఖర్చు.

ఈ తీసివేసే తుంగ నల్లగా బూడిద మాదిరిగా ఉంటుంది . దానిలో పడింది ఇక ఎందుకూ పనికి రాదు. తీసివేసేటప్పుడూ అది కొంత తడీ, కొంత పొడీగా అసహ్యంగా ఉంటుంది. దాన్ని ఎగిరి పడకుండా కాలితో తొక్కి వేస్తూ, దాని పైన వేస్తూ బండ్లలో చెత్త పేరుస్తూ తీసి బయట వేయాలి, అది దూరంగా పారవేయాలి. ఇండ్ల దగ్గర మంటబెడితే ఆ పొగ రెండు మూడు రోజులు భరించాలి.

తుంగలో తొక్కడం అంటే విసుక్కుంటూ పని చేయడం.

*ఇంక దీని సంగతి నాకు పనిలేదు* అనే విసుగు ఆ పనిపట్ల చూపడం– అని ఈ జాతీయం అర్థం.

విడవలి ఇంకా అరుదు.. ధర కూడా ఎక్కువే. తుంగ మాదిరిగానే దొరువులలో పెరిగేది.

(తుంగ –రౌండ్ పుల్లల మాదిరిగా, విడవలి –పొడవైన హైబ్రీడ్ గడ్డి మాదిరిగా ఉంటాయి. విడవలూరు నెల్లూరు జిల్లాలో ఉంది)

పల్లెల్లో ఉన్న పెద్దవాళ్లు తుంగ, విడవలి ఇళ్ళు వాళ్ల స్థాయి కి తగినట్లు నిర్మించుకొంటారు. ఎండలకు, వానలకు, గాలులకూ వెరవకుండా దర్జాగా కాలిమీద కాలేసుకొని సుఖిస్తారు.

దీనె పెంకుతో పెంకుటిళ్ళు, మంగుళూరు పెంకుటిళ్ళు, ఎస్బెస్టాస్ రేకుల ఇళ్ళు, ఆంధ్రప్రదేశ్ ఎండలకు పనికి రావు. ఎండలకు లోపలే ఉడికి పోతారు. ఐనా, ఇపుడు నగరాలలో ఇవే గతి.

పైగా తాటాకు, తుంగ పని చేసేవాళ్ళూ దొరకరు, అవి అంత తేలికగా దొరకవు.

చేయవలసిన పనులు పట్టించుకోకుండా వేరే అనవసరమైన పనులు నెత్తిన బెట్టుకొన్నపుడు నిందగా ఈ నుడికారాన్ని వాడుతూ ఉంటారు.

శివరామ ప్రసాద్ మాచవోలు

https://qr.ae/pyVXQu

## తెలుగు తల్లి, తమిళ తాయి ఇలాంటి కాన్సెప్ట్ వేరే భాషలకి ఉన్నాయా? అసలు ఈ తెలుగుతల్లి అన్న కాన్సెప్ట్ ఎప్పట్నుంచి ఉంది?

ఈ భాషా తల్లుల కాన్సెప్టు చాలా అర్వాచీనమైనదే. వీటి చరిత్ర బహుశ ఒక రెండు వందల ఏళ్లు కూడా ఉండదు అని నా అనుకోలు. అనాదిగా భారతీయులందరికీ సరస్వతీ దేవి మాత్రమే భాషకు, సాహిత్యానికీ, సంగీతానికీ తల్లి. తెలుగు వాణి, సంస్కృత భారతి లాంటి పదాలు ఇటీవల సృష్టించినవి.

నాకు తెలిసినంతలో భాషా ప్రయుక్త రాష్ట్రాల ఏర్పాటు జరిగిన తరువాత, లేక వాటికోసం ఉద్యమం ప్రారంభమైనప్పుడు, అంటే సుమారు 1950 ప్రాంతాలలో ముఖ్యంగా దక్షిణాది రాష్ట్రాలకు వారి భాషను నిలుపుకోవడానికి ఒక చిహ్నం (ఐకాన్) అవసరం పడింది. అలా భాషా తల్లులు ఏర్పడ్డారు. తమిళనాడులో తమిళ్ తాయ్ ఉన్నది.

సుమారు 1890 ప్రాంతాలలో మనోన్మణియం సుందరం పిళ్లై తన 'మనోన్మణియం' అన్న నాటకంలో వ్రాసిన పాట 'తమిళ్ తాయ్ వాళ్తు' (తమిళ తల్లి స్తుతి) తమిళుల రాష్ట్ర గీతంగా కరుణానిధి పాలనలో ఎంచుకోబడింది.

మొన్నటికి మొన్న 2021 డిసెంబరులో మాత్రమే, స్టాలిన్ ప్రభుత్వం ఏర్పడిన తరువాత దానిని రాష్ట్ర గీతంగా అధికారికంగా ప్రకటిస్తూ చట్టం చేసారు. అలాగే అదే పేరుతో భారతి దాసన్ వ్రాసిన మరో పాటను పాండిచ్చేరి ప్రభుత్వం వారి రాష్ట్ర గీతంగా ప్రకటించింది. తమిళ తల్లి కోవెల అన్న పేరిట శివగంగై జిల్లాలోని కారైకుడి పట్టణంలో ఒక దేవాలయం కూడా ఉంది. ఇది 1993లో తెరువబడింది.

మన శంకరంబాడి సుందరాచారిగారు కూడా ఏదో సినిమా కోసమని వ్రాసిన పాట "మా తెలుగు తల్లికి మల్లె పూదండ" టంగుటూరి సూర్యకుమారిగారికి నచ్చి ఆయన దగ్గర హక్కులు కొనుక్కొని (రూ. 116/-కు అని జ్ఞాపకం) ట్యూన్ కట్టి పాడారు. మెల్లమెల్లగా అది తెలుగు వారి రాష్ట్ర గేయం అయింది. ఇప్పుడు రాష్ట్ర విభజన తరువాత ఒక తెలంగాణ తల్లి కూడా ఏర్పడింది.

కన్నడంలో కూడా ఒక 'కన్నడ తాయి' ఉన్నది. "కలియిరొందు తాయివన్ను కన్నడ తాయి మక్కళే" అని పిల్లలకు భాషను తల్లిగా భావన చేసి నేర్పేవారు. వారి రాష్ట్ర గీతం కూడా కువెంపు వ్రాసిన "జయ భారత జననియ తనుజాతే, జయహే కర్ణాటక మాతే" అన్నది. శతాబ్దాలుగా వివిధ కన్నడ సామ్రాజ్యాల కులదైవం అయిన 'భువనేశ్వరీ దేవి' రూపాన్నే వారు కర్ణాటక మాతగా భావిస్తారు.

కేరళలో 'కైరళి' అన్న పేరిట కేరళ రాష్ట్రాన్ని తల్లిగా భావించి కీర్తించడం ఉంది. ఐతే ఇది భాషకు సంబంధించినది కాదు. కేరళ భూమికి, వారి సంస్కృతికీ మొత్తం ప్రతీకగా ఒక 'కైరళి' మాత ఉంది. ఆమెకు ప్రత్యేకించి ఒక రూపం ఉన్నట్లు లేదు. కైరళి విగ్రహాలేవీ నేను కేరళలో చూడలేదు.

ఒరిస్సా రాష్ట్రం కూడా "బందే ఉత్కళ జననీ" అన్న పేరిట ఒక గీతాన్ని వారి రాష్ట్రగీతంగా ఏర్పరచుకొన్నారు.

పైవన్నీ కూడా 1950 తరువాత విడివిడిగా ఏర్పడ్డ రాష్ట్రాలు. ఉత్తరభారత రాష్ట్రాల్లో ఈ భాషాతల్లుల భావన ఉన్నట్లు లేదు. వారి వారి రాష్ట్రగీతాలు వారి రాష్ట్రాన్ని జననిగానో మరోలానో ప్రశంసిస్తూ ఉన్నాయిగానీ భాష గురించి ప్రత్యేకంగా లేదు. నాకు తెలిసి విదేశాలలో కూడా (ప్రముఖ భాషల విషయంలో) ఇలాంటి భావన లేదు.

చంద్రమోహన్
https://qr.ae/pyjwwb

# ఆర్థికం

## ఆర్థిక ఆరోగ్యానికి తగిన సలహా ఇవ్వగలరా?

మనం నిద్రపోయినా మన డబ్బు సంపద సృష్టిలో సేద తీరకూడదు. అదే ఆర్థిక స్వాతంత్ర్యం వైపు మన పయనాన్ని వేగవంతం చేస్తుంది.

ఇష్టపూర్వకంగానో, దురదృష్టవశాత్తో ఉద్యోగం మానివేసినా జీవనవిధానం మారకుండా, కుటుంబావసరాలు సజావుగా నడుస్తూండే స్థితే ఆర్థిక స్వాతంత్ర్యం.

సంపాదన, సంపద సృష్టి ఒకటే అన్న అపోహలో మొదటి దానిపై పెట్టిన శ్రద్ధ రెండవ దానిపై పెట్టక జీతమెంత సంపాదించినా జీవితాంతం ఇక్కట్లు పడేవారు బోలెడు మంది. సదా మారుతున్న ఆర్థిక సమీకరణాలను ఔపోసన పట్టకపోవటం వల్ల జరిగే నష్టమిది. ఈ మార్పు గత రెండు దశాబ్దాలుగా మరింత వేగవంతమైంది.

మధ్య తరగతి వారికి పెట్టుబడి అంటే ఇల్లు మాత్రమే, ఇదివరకు. వేరే మార్గమెవరైనా సూచించినా మొదట అబ్బుర పడినా మనకు అబ్బదని మిన్నకుండేవారు. అదే ధోరణి నేటికీ అనుసరిస్తూ తడబడి నిలబడిపోయేవారికి కాస్తంత చేయూతనిచ్చే ప్రయత్నమిది.

**ఆర్థిక జ్ఞానం**

ఆర్థిక స్పృహ నేడు విధాయకం. ఇప్పుడు అందరికీ అందుబాటులో ఉన్న ఆన్‌లైన్ వనరులతో వారానికో గంట వెచ్చించినా తగు ఆర్థిక జ్ఞానం అలవడుతుంది.

జీవితభాగస్వామిని ఈ జ్ఞానార్జనలో కూడా భాగస్వామి చెయ్యటం అత్యుత్తమం. ఒకరు లేని విపత్కర పరిస్థితుల్లో మరొకరు ఒంటరిగా, నష్టపోకుండా జీవితాన్ని ఎదుర్కొనే ధైర్యం ఇస్తుంది జ్ఞానం. అలాగే ముఖ్యమైన ఆర్థిక దస్తావేజులు, ఖాతాల సమాచారం కుటుంబానికి అందుబాటులో ఉండేలా భద్రంగా ఉంచాలి. వీలునామా రాయించి పెట్టటం కుటుంబానికి కొండంత అండ.

ఎటువంటి పెట్టుబడులు ఎంత రాబడులనివ్వగలవో స్పష్టంగా తెలుసుకోవాలి. ఉదాహరణకు 1981 నుండి 2019 వరకు వివిధ పెట్టుబడుల రాబడులు ఇలా:




*మూలం:* Historical returns on asset classes in India

ఇంతకు మించి రాబడినిచ్చేది వ్యాపారం మాత్రమే - అది స్థిరాస్తి కావచ్చు, కుటుంబ వ్యాపారం కావచ్చు. అదీ పూర్తి స్పృహలో నిలకడగా అంతఃకరణశుద్ధితో చేస్తేనే. మిగతావన్నీ కుహనా కహానీలే. వాటిని నమ్మితే మొదటికే మోసం, మీ డబ్బు వేరొకరికి దాసోహం.

ఎవరైనా వచ్చి "మా సంస్థలో 10 వేలు కడితే ఏడాదికి లక్ష రుపాయలిస్తా"మనో, "ఇపుడు లక్షన్నర కడితే మూడేళ్ళ పాటు నెల నెలా పదివేలిస్తా"మనో అంటే అరనవ్వుతూ వారిని పోలీసులకు పట్టించే లోకజ్ఞానం ఆర్థిక జ్ఞానంతోనే సొంతమవుతుంది.

**అత్యవసర నిధి**

మన మౌలిక నెలవారీ ఖర్చులు ఇబ్బంది లేకుండా కనీసం ఆరునెలలు గడిచిపోయేంత అత్యవసర నిధి సమకూర్చుకోవాలి. ఉద్యోగస్తులు, వ్యాపారస్తులు ఎవరికైనా తప్పక వర్తిస్తుందిది. అవసరానికి, ఆశకు తేడా గమనిస్తూ పొదుపు చేస్తూ ఉంటే ఈ నిధి అత్యవసరానికి ఆదుకుంటుంది.

అనుకోని, దురదృష్టవశాత్తు ఎదురయ్యే ఖర్చులకు ఎంతో ఊతమిచ్చే నిధి ఇది. ఉదాహరణకు ఉద్యోగం పోవటం, ఇంటి మరమ్మత్తు, వగైరా.

ఈ అత్యవసరనిధిని బ్యాంకుఖాతాలో ఊరికే ఉంచక స్వల్పకాలిక లిక్విడ్ మ్యూచువల్ ఫండ్లలో పెడితే ద్రవ్యోల్బణాన్ని మించిన రాబడి పొందవచ్చు, అత్యవసర పరిస్థితిలో వెంటనే ఉపసంహరించుకోవచ్చు.

**బీమా**

ఎట్టి పరిస్థితుల్లోనూ నిర్లక్ష్యం చెయ్యకూడనిది బీమా. కుటుంబంలో సంపాదిస్తున్న ప్రతి ఒక్కరికి ఒక టర్మ్ బీమా పాలిసీ ఉండాలి.

అలాగే కుటుంబ సభ్యులందరికీ తగినంత కవరేజ్ ఉండే ఆరోగ్యబీమా ఉండాలి. సాధారణంగా ఉద్యోగస్తులకు ఆఫీసు వారు ఆరోగ్యబీమా ఇస్తారు. అయినప్పటికీ సొంతంగా మరో పాలిసీ

తీసుకోవటం మంచిది. ఉద్యోగం మారేప్పుడు రాగల ఆరోగ్య అత్యవసరాలకు ఇది పనికొస్తుంది. ముఖ్యంగా పెద్దవయసు వారు ఉంటే మరో పాలిసీ తీసుకోవటం మంచిది.

ఈ రెండూ ఉంటే పెళ్ళి, ఇల్లు, పిల్లల చదువు, రిటైర్‌మెంట్ వంటి లక్ష్యాలకు చేసే క్రమానుగత పెట్టుబడులకు అకాల ఉపసంహరణ ఆపద ఉండదు.

తెలిసిన వారు పదే పదే వెంటపడ్డారనో, బ్యాంకు మేనేజరు పళ్ళికిలిస్తూ పళ్ళ రసమిచ్చి అడిగారనో యులిప్ బీమాలు, మనీ బ్యాక్ పాలసీలు కొనటమంటే మన సంపదను మనమే అగౌరవ పరిచినట్టు. అవన్నీ ఏజెంట్లు, బ్యాంకులు నిర్వహణా రుసుముల పేరుతో మన సొమ్మును దండిగా దండుకునే మార్గాలు మాత్రమే.

**పెట్టుబడి ప్రణాళిక**

వ్యక్తిగత జీవన లక్ష్యాలకు తగిన ప్రణాళిక జీవితంలో ఎంత త్వరగా రచించుకుంటే ఆ లక్ష్యాలు అంత సజావుగా చేరుకోవచ్చు.

రిటైర్‌మెంట్, పెళ్ళి, ఇల్లు, పిల్లలు ఇలా ప్రతి ఒక్క లక్ష్యానికి పొదుపు, మదుపు సాగుతూ ఉండాలి. అలా పొదుపు చేసిన సొమ్ము స్వతహాగా సంపద సృష్టి, వృద్ధి చేసేలా ఉంటే అత్యుత్తమం.

ఏదైనా వ్యాపారంలో పెట్టుబడి, కొత్త నైపుణ్యాలు నేర్చుకోవటం, ప్రవృత్తి ద్వారా సంపాదించటం, వీలైతే మరొక ఉద్యోగం చెయ్యటం, ఇలా బహువిధ ఆదాయమార్గాలు ఏర్పరుచుకుంటే మంచిది. షేర్లు, మ్యూచువల్ ఫండ్లు, బంగారం, రియల్ ఎస్టేట్, వ్యాపారం - ఇలా వివిధ మార్గాల్లో పెట్టుబడులను విస్తృతీకరించి ఎప్పటికప్పుడు ప్రణాళికను సమీక్షిస్తూ ఉండాలి.

వయసును బట్టి ఆయా మార్గాల్లో ఎంత పెట్టుబడి పెడుతున్నదీ మార్చుకుంటూ ఉంటే రిస్క్ తగ్గించుకుంటూ, అందుకు తగిన రాబడిని పొందవచ్చు.

మార్కెట్ పతనాలు, ఆర్థిక మోసాలు, చీటీ వేస్తామని బోర్డు తిప్పటాలు వంటివేవీ మీ ఆర్థిక బాగోగులను శాసించకూడదు. అందుకు అవసరమైనది కాస్త అవగాహన, జ్ఞానం అంతే.

అలోక్ నంద ప్రసాద్<br>https://qr.ae/preQQS

## ఇండెక్స్ ఫండ్స్ అంటే ఏంటి? వీటిలో ఎవరైనా మదుపు చేయవచ్చా? ఎలా చేయాలి?

సాధారణంగా టీవీ, వార్తాపత్రికల్లో అప్పుడప్పుడూ మార్కెట్ల పతనం, సూచీల పరుగులు అని ఎలుగెత్తి చెబుతుంటారు. మార్కెట్ల పతనం, సూచీల పరుగు అంటే ఏమిటి? ఎలా లెక్కిస్తారు? అసలీ పతనం, పరుగు వంటి వాటికి పరిమాణీకరణం(weightage) ఎలా?

ఉదాహరణకు నిఫ్టీ 50 సూచీ తీసుకుందాం. సాధారణంగా దీన్నే నిఫ్టీ అనేస్తుంటారు. నిఫ్టీ 50 అంటే మార్కెట్ మూలధనీకరణ (market cap) ప్రకారం 50 అతిపెద్ద సంస్థల సూచీ. ఆయా సంస్థల షేర్ల పనితీరు ఎలా ఉంటే ఈ సూచీ పనితీరు అలా ఉంటుంది. షేరు పనితీరును బట్టి దానికి సూచీలో ఎంత పరిగణన ఉండాలో సమీక్షిస్తూ, పనితీరు బాగాలేని షేర్లను తీసేస్తూ, బాగున్నవాటిని జోడిస్తూ ఉంటారు.

మార్చ్ 31, 2021న నిఫ్టీ 50, అందులో ఎక్కువ weightage ఉన్న షేర్ల వివరాలు:

**Portfolio Characteristics**

| Methodology | Free Float Market Capitalization |
|---|---|
| No. of Constituents | 50 |
| Launch Date | April 22, 1996 |
| Base Date | November 03, 1995 |
| Base Value | 1000 |
| Calculation Frequency | Real-Time Daily |
| Index Rebalancing | Semi-Annually |

| Index Returns (%) | QTD | YTD | 1 Year | 5 Years | Since Inception |
|---|---|---|---|---|---|
| Price Return | 5.07 | 5.07 | 70.87 | 13.68 | 11.15 |
| Total Return | 5.31 | 5.31 | 72.54 | 15.13 | |

| Statistics ## | 1 Year | 5 Years | Since Inception |
|---|---|---|---|
| Std. Deviation * | 22.48 | 18.25 | 23.86 |
| Beta (NIFTY 50) | 1.00 | 1.00 | 1.00 |
| Correlation (NIFTY 50) | 1.00 | 1.00 | 1.00 |

**Sector Representation**

| Sector | Weight(%) |
|---|---|
| FINANCIAL SERVICES | 38.03 |
| IT | 16.77 |
| OIL & GAS | 11.78 |
| CONSUMER GOODS | 11.49 |
| AUTOMOBILE | 5.40 |
| PHARMA | 3.26 |
| METALS | 2.86 |
| CEMENT & CEMENT PRODUCTS | 2.72 |
| CONSTRUCTION | 2.70 |
| TELECOM | 1.97 |
| POWER | 1.67 |
| SERVICES | 0.81 |
| FERTILISERS & PESTICIDES | 0.56 |

**Fundamentals**

| P/E | P/B | Dividend Yield |
|---|---|---|
| 33.2 | 4.2 | 0.96 |

**Top constituents by weightage**

| Company's Name | Weight(%) |
|---|---|
| HDFC Bank Ltd. | 10.24 |
| Reliance Industries Ltd. | 10.19 |
| Infosys Ltd. | 7.98 |
| Housing Development Finance Corporation | 7.08 |
| ICICI Bank Ltd. | 6.34 |
| Tata Consultancy Services Ltd. | 5.18 |
| Kotak Mahindra Bank Ltd. | 4.05 |
| Hindustan Unilever Ltd. | 3.42 |
| ITC Ltd. | 3.01 |
| Axis Bank Ltd. | 2.76 |

*మూలం: https://www1.nseindia.com/content/indices/ind_nifty50.pdf*

ఈ యాభై షేర్ల ప్రత్యక్ష ధరలు NSE వెబ్‌సైట్‌లో చూడవచ్చు. ఇలా NSEలోనే వివిధ సూచీలు ఉన్నాయి.

ఇంతకూ ఇండెక్స్ ఫండ్స్ అంటే ఏమిటి?

ఒక ఇండెక్స్(సూచీ) యొక్క పనితీరును తూ.చ తప్పక అనుకరించే ఫండ్‌ను ఇండెక్స్ ఫండ్ అంటారు. ఉదాహరణకు నిఫ్టీ 50 సూచీని అనుకరించే ఫండ్ నిఫ్టీ50 ఫండ్. అంటే నిఫ్టీ 50 సూచీలో ఏ షేర్లుంటాయో, అవే షేర్లను అదే weightageతో కొంటారు. భవిష్యత్తులో సూచీలో ఏవైనా షేర్లను తీసేసి కొత్త షేర్లను జోడిస్తే ఆ ఇండెక్స్ ఫండ్‌లోనూ ఆయా షేర్లను అమ్మివేసి, కొత్త షేర్లు కొంటారు. అంతే.

ఇండెక్స్ ఫండ్లకు, ఇతర ఫండ్లకు ముఖ్యమైన తేడా వాటి ఉద్దేశ్యమే.

సాధారణంగా ఒక మ్యూచువల్ ఫండ్‌కు దాని ఆధారిత ప్రమాణసూచీ (benchmark index) కంటే ఎక్కువ రాబడులను ఇవ్వటమే లక్ష్యం అయితే ఇండెక్స్ ఫండ్ల ముఖ్యోద్దేశం ఆ సూచీ యొక్క విలువ పెంపును రాబడి రూపేణా మదుపర్లకు ఇవ్వటం. అందుకే ఇండెక్స్ ఫండ్లలో నిర్వహణా ఖర్చు (expense ratio) చాలా తక్కువ - అనుభవజ్ఞులైన ఫండ్ మేనేజర్ల అవసరం ఉండదు కాబట్టి.

సాధారణంగా ఎక్కువ రిస్క్ తీసుకోగోరనివారు, ఎఫ్‌డీని మించిన post-tax రాబడి పొందగోరు వారు ఇండెక్స్ ఫండ్లను ఎంచుకుంటారు.

వీటిలో ఎవరైనా మదుపు చేయవచ్చా?
చెయ్యవచ్చు. వీటిలో మదుపు మరే మ్యూచువల్ ఫండ్ మాదిరిగానే చెయ్యవచ్చు. ఈక్విటీ మ్యూచువల్ ఫండ్లు అన్నిటిలో రిస్క్ తక్కువగా ఉన్నవి ఇండెక్స్ ఫండ్లు. అందుకే రాబడి కూడా తక్కువగానే ఉంటుంది (దీర్ఘకాలానికి సగటున 9-10%).

ఎలా చేయాలి?
ఉదాహరణకు జెరోధా కాయిన్ వేదికలో "Nifty Index Fund" అని సెర్చ్ చేస్తే పెట్టుబడికి అందుబాటులోని ఫండ్లన్నీ చూడవచ్చు. అందులోంచి ఒకటి ఎంచుకుని పెట్టుబడి పెట్టటమే.




మరో విషయం ఏమిటంటే ఇండెక్స్ ఫండ్లకు అనుసంధానమైన ETFలు (Exchange Traded Funds) కూడా ఉంటాయి. ETFలను షేర్ల లాగా కొని అమ్మవచ్చు - Liquidity ఎక్కువ.

అలోక్ నంద ప్రసాద్

https://qr.ae/pykkqM

## పెట్టుబడికి ఎఫ్‌డీకి తగిన ప్రత్యామ్నాయ మార్గమేదైనా ఉందా?

ఎఫ్‌డీ(ఫిక్స్‌డ్ డిపాజిట్) - ఒక పొదుపు సాధనం. అధికశాతం మధ్యతరగతి జనులు మదుపులా పొరబడి దీర్ఘకాలంలో డబ్బు కోల్పోయే సాధనం కూడా! ఎందుకంటే ద్రవ్యోల్బణం, పన్నులు పోగా మూలధనాన్ని వృద్ధి చెయ్యని సాధనం ఏదయితేనేమి, పళ్ళూడటానికి!

అయితే, చివరకు శుభం కార్డ్ వేసినా నిఖార్సైన థ్రిల్లర్ కాబట్టి స్టాక్ మార్కెట్ అందరికీ నప్పకపోవచ్చు.

మరి ఎఫ్‌డీకి, స్టాక్ మార్కెట్‌కు మధ్యన రిస్క్ ఎక్కువ లేని మదుపు సాధనం ఏదీ లేదా?

లక్షణంగా ఉంది!

కోటీశ్వరులు, బ్యాంకులు, ఆర్థిక సంస్థలు విరివిగా వాడుకునే ఆ సాధనమే G-Secs (ప్రభుత్వ బాండ్లు)[1].




*మూలం: Coin by Zerodha*

సాధారణంగా ఏడాది లోపు మెచ్యూరిటీ ఉన్నవాటిని T-Bills అని, అంతకు మించిన మెచ్యూరిటీ ఉన్నవాటిని Bonds అని సంబోధిస్తారు. రెండిటికీ భారత ప్రభుత్వ పూచీకత్తు ఫ్రీ! పైగా ఎఫ్‌డీలా టీడీయస్(Tax Deducted at Source) ఉండదు.

T-Bills మెచ్యూరిటీ 91 రోజులు, 182 రోజులు, 364 రోజుల లెక్కన ఉంటుంది.

ఇది వరకు కాస్త కష్టతరమైన వేలం పాటలో ఈ బాండ్ల అమ్మకాలు జరిగేవి. ఆ జటిలమైన ప్రక్రియకు జడిసి చిన్న మదుపర్లు వాటి జోలికి వెళ్ళటం అరుదుగా జరిగేది.

అయితే ఇటీవల ఆర్‌బీఐ సహకారంతో NSE ఈ బాండ్లను సాధారణ మదుపర్లకు అందుబాటులోకి తెచ్చింది. ఫలితంగా కొన్ని సంస్థల డీమ్యాట్ ఖాతాల్లోంచి మనబోటి మదుపర్లు కూడా నేరుగా వాటి వేలంలో పాల్గొని కొనవచ్చు.

ఎఫ్‌డీ, T-Billsపై వడ్డీ రాబడి (నవంబర్ 2022):

### T-Bills vs Fixed Deposit (FD) rates

| Duration | 91 Days | 182 Days | 364 Days |
|---|---|---|---|
| T-Bills | 6.77% | 6.90% | 6.89% |
| HDFC | 4.50% | 5.75% | 6.00% |
| SBI | 4.50% | 5.25% | 5.75% |
| ICICI | 4.50% | 4.75% | 6.70% |
| AXIS | 4.75% | 5.75% | 6.75% |
| PNB | 4.50% | 5.50% | 6.75% |

*మూలం: https://www.instagram.com/p/CtJURzCKaWU*

మరి చిన్ముద్రాలంకృత అభయహస్తంలా ఉందా?! ఓ మెలికె ఉంది - అదే పన్ను విధానం:

- T-Billsపై వచ్చిన లాభాన్ని STCG(స్వల్పకాలిక మూలధన లాభం)గా లెక్కించి, వ్యక్తిగత స్లాబ్ ప్రకారం పన్ను కట్టవలసి ఉంటుంది.
- Bonds విషయంలో మూడేళ్ళ లోపు అమ్మితే వచ్చిన లాభాన్ని STCG(స్వల్పకాలిక మూలధన లాభం)గా పరిగణించి వ్యక్తిగత స్లాబ్ ప్రకారం పన్ను కట్టవలసి ఉంటుంది. మూడేళ్ళు దాటాక అమ్మిన వాటిపై లాభాన్ని LTCG (దీర్ఘకాలిక మూలధన లాభం)గా పరిగణించి 20% పన్ను (ఇండెక్సేషన్‌తో) కట్టవలసి ఉంటుంది.

ఈ పన్ను దృష్ట్యా 30% స్లాబ్‌లో ఉన్నవారికి G-Secs అద్భుతమైన ప్రత్యామ్నాయం.

**ఫుట్‌నోట్స్**

[1] https://m.rbi.org.in/scripts/FAQView.aspx?Id=79

అలోక్ నంద ప్రసాద్

https://qr.ae/pykj8B

## బంగారం మీద మంచి పెట్టుబడి మార్గాలు ఏంటి? కాస్త వివరంగా చెప్పగలరా?

### నగలు

ఇది అందరికీ తెలిసినదే! నగలు దాచుకోటానికి బ్యాంకు లాకర్ తీసుకుంటే దాని అద్దె కూడా కొనుగోలు, నిర్వహణ ఖర్చుకు జోడించాలి. మరలా లాభానికి అమ్మేసినా దానిపై పన్ను కట్టవలసి ఉంటుంది. తయారీ, తరుగు వంటి ఖర్చులు ఉంటాయి. ఇవి కాక, నగలు కొన్నప్పుడు కట్టే జీయస్టీ కొంతకాలం తరువాత వాటిని అమ్మినపుడు తిరిగి రాదు. నగల భద్రత పూర్తిగా మన బాధ్యత.

అంచేత నగల రూపేణా బంగారంలో పెట్టుబడి అన్నది అంత లాభదాయకం కాదు. పైగా మన దేశంలో నగలను పెట్టుబడి సాధనాలుగా కాక ఎమోషనల్ ఆస్తిగా చూస్తాం కాబట్టి అలాగే వ్యవహరించటం మంచిది.

నగల కొనుగోలులో మరొక విధానం బంగారం పొదుపు పథకాలు.[1] బంగారు దుకాణాలు ఇటువంటి పథకాలను అందిస్తుంటాయి. వారి వద్ద నెలనెలా కొంత మొత్తం పొదుపు చేస్తే, గడువు ముగిసే సమయానికి ఒక కిస్తు వారే కట్టి, మొత్తం సొమ్ముకు సమాన విలువ గల బంగారు ఆభరణాలు కొనే సౌకర్యం ఇస్తారు. చట్టబద్ధం కాదని ప్రభుత్వం మునుపు ఇటువంటి పథకాలను నిషేధించినా, మరలా గరిష్టంగా 12 నెలల పథకాలకు అనుమతి ఇచ్చారు.[2]

### బంగారు నాణేలు/యిటుకలు

బ్యాంకులు, MMTC[3] వంటి సంస్థల వద్ద కొనవచ్చు. నాణ్యత గురించి భరోసా కూడా ఉంటుంది. నగల దుకాణంలో కొనాలనుకున్నప్పుడు నగలు కొన్నట్టు తగిన నాణ్యతా ప్రమాణాలు చూసే కొనాలి. నగల వలెనే వీటి నిల్వ, భద్రత బరువు బాధ్యతలు కొనుగోలుదారువే. ఒకవేళ అవసరమై అమ్మేస్తే, ఎంత కాలం ఉంచుకున్నారన్నదాన్ని బట్టి లాభంపై పన్ను కట్టవలసి ఉంటుంది.

### డిజిటల్ బంగారం[4]

ఈ మధ్య కాలంలో అందుబాటులోకి వచ్చిన కొత్త పెట్టుబడి విధానమిది. PAYTM, GPay, PhonePe వంటి అమ్మకందార్ల వద్ద మనకు సౌకర్యమైన మొత్తంలో (1 రూపాయి నుంచి) డిజిటల్ బంగారాన్ని కొనవచ్చు. ఇందులోనూ కొంతకాలానికి బంగారాన్ని లాభానికి అమ్మివేస్తే ఆ లాభంపై పన్ను కట్టవలసి ఉంటుంది.

ఇందులో నిల్వ, భద్రత వంటి బాధ్యతలు ఉండవు. కానీ ప్రస్తుతం ఈ మార్గం ఇంకా అంకురంలోనే ఉన్నందున, నిబంధనలు, వ్యవస్థీకరణ పటిష్టం అయ్యేంత వరకు దూరంగా ఉండటమే మంచిదని నా అభిప్రాయం.

### గోల్డ్ ETF[5]

**TOP GOLD ETFs**

| Fund | Net assets (₹ cr) |
|---|---|
| Goldman Sachs Gold ETF Fund | 2,356.40 |
| R*Shares Gold ETF | 2,230.25 |
| SBI Gold Exchange Traded Scheme | 1,241.08 |
| Kotak Gold ETF Fund | 784.58 |
| HDFC Gold Exchange Traded Fund | 744.40 |
| UTI Gold Exchange Traded Fund | 606.48 |
| Axis Gold ETF Fund | 365.77 |
| ICICI Prudential Gold Exchange Traded Fund | 169.59 |
| Canara Robeco Gold Exchange Traded Fund | 157.66 |
| IDBI Gold Exchange Traded Fund | 141.84 |
| Birla Sun Life Gold ETF | 119.74 |
| Religare Invesco Gold Exchange Traded Fund | 65.54 |
| Motilal Oswal MOSt Shares Gold ETF Fund | 55.35 |

Source: Value Research Online Compiled by BS Research Bureau

ఇవి మ్యూచువల్ ఫండ్లలో ఒక రకం, నేషనల్ స్టాక్ ఎక్స్‌చేంజ్‌లో లిస్ట్ అయి ఉంటాయి[6]. స్టాక్ మార్కెట్లపై అవగాహన ఉన్నవారు తమ ఈక్విటీ పెట్టుబడులకు ప్రతిరక్షగా గోల్డ్ ETFలో పెట్టుబడి పెడతారు. ఈ మ్యూచువల్ ఫండ్లలో నిర్వహణ రుసుము తక్కువగానే ఉంటుంది, భద్రతా బాధ్యత, లాకిన్ ఉండవు కానీ వచ్చిన లాభంపై పన్ను మాత్రం స్వల్పకాలిక లేదా దీర్ఘకాలిక అమ్మకం బట్టి కట్టవలసి ఉంటుంది.

### సావెరిన్ గోల్డ్ బాండ్స్[7]

బంగారంలో అత్యుత్తమ పెట్టుబడి సాధనాలివి. ప్రభుత్వం ఎప్పటికప్పుడు ఈ బాండ్లను అమ్మకానికి ఇస్తుంది[8]. అప్పుడు మన డీమ్యాట్ ఖాతా నుంచి వీటికి దరఖాస్తు చేసుకోవచ్చు. డీమ్యాట్ ఖాతా లేకపోతే SBI[9] వంటి బ్యాంకులలోనూ దరఖాస్తు చేసుకోవచ్చు.

ఇది కూడా ఒక విధమైన డిజిటల్ బంగారం వంటిదే అయినా ఈ బాండ్లు నేషనల్ స్టాక్ ఎక్స్‌చేంజ్(NSE)లో లిస్ట్ అయి ఉంటాయి. 0% పన్ను ప్రయోజనాలు పొందాలంటే ఎనిమిదేళ్ళ లాకిన్ ఉంటుంది. నిల్వ, భద్రత వంటి తలనొప్పులు ఉండవు. పైగా మన పెట్టుబడి మొత్తంపై సంవత్సరానికి 2.5% వడ్డీ ప్రభుత్వం చెల్లిస్తుంది.

సావెరిన్ గోల్డ్ బాండ్లలో లాభ నష్టాలు:

- బంగారాన్ని నగలు, నాణేలు, బిస్కెట్ల రూపంలో కొంటే స్వచ్ఛత, భద్రపరచే బాధ్యత, తరుగు ఖర్చులు ఉంటాయి. గోల్డ్ బాండ్లలో ఈ భయాలు, వృధా ఖర్చులు ఉండవు.
- 999 స్వచ్ఛమైన బంగారం ప్రమాణికంగా బాండ్లు కేటాయిస్తారు.
- బాండ్ల పెట్టుబడి మొత్తంపై సాలీనా 2.5% వడ్డీ ప్రభుత్వం చెల్లిస్తుంది.
- బాండ్ల కొనుగోలులో మనబోటి రీటైల్ మదుపర్లకు గ్రాముకు 50 రూపాయల డిస్కౌంట్ ఉంటుంది.
- 8 సంవత్సరాల మెచ్యూరిటీ లాకిన్ ఉంటుంది. అమ్మేయాలనుకున్న వారికి కొంత రుసుముతో 5 సంవత్సరాల తరువాత అమ్ముకునే సౌకర్యం ఉంటుంది.

- బాండ్ల గడువు (8 ఏళ్ళు) పూర్తయ్యాక షేర్ మార్కెట్లో అమ్మేయవచ్చు.
- మెచ్యూరిటీ తరువాత లాభానికి అమ్మేస్తే ఆ లాభంపై ఎటువంటి పన్ను ఉండదు. ఒకవేళ బంగారం ధర తగ్గినందున నష్టానికి అమ్మితే ఆ నష్టానికి ఆదాయపు పన్ను రిటర్న్స్‌లో మినహాయింపు పొందవచ్చు.
- గోల్డ్ బాండ్లు ప్రభుత్వ పూచీకత్తుతో రిజర్వు బ్యాంకు విక్రయిస్తుంది. అందువల్ల భరోసా ఉంటుంది. దివాలా, ద్రవ్యత్వలోపం వంటి వాటికి తావు లేదు.
- బాండ్లపై చెల్లించే 2.5% వడ్డీని వ్యక్తిగత ఆదాయానికి జోడించి స్లాబ్ ప్రకారం ఆదాయపు పన్ను చెల్లించాలి.
- మెచ్యూరిటీ తరువాత మార్కెట్లో బంగారం ధర మన కొనుగోలు ధరకంటే తక్కువగా ఉంటే నష్టం సంభవం. అయితే ఇది భౌతికంగా బంగారం కొన్నా ఉంటుంది.
- ప్రభుత్వం ప్రకటన ఇచ్చినప్పుడు దరఖాస్తు చేసుకుని కొన్న వారికే 2.5% వడ్డీ, పన్ను ప్రయోజనాలు వర్తిస్తాయి. షేర్ మార్కెట్లో అమ్మినపుడు (8 ఏళ్ళ లాకిన్ పూర్తైనవి) కొంటే ఈ ప్రయోజనాలు వర్తించవు.

సావెరిన్ గోల్డ్ బాండ్లను ఎలా కొనుగోలు చేయాలి?
ప్రముఖ ప్రభుత్వ బ్యాంకుల్లో ఎద్దైనా శాఖకు వెళ్ళి సావరిన్ గోల్డ్ బాండ్లను కొనవచ్చు. ఇలా కొంటే బాండ్లను ప్రమాణపత్రాల రూపేణా అందజేస్తారు. ఆ పత్రాలను భద్రపరచుకోవాలి.
ఆన్‌లైన్ అయితే KYC పూర్తైన వారు (షేర్లు, మ్యూచువల్ ఫండ్లు వంటి పెట్టుబడులు చేసేవారు) బ్యాంకు వెబ్‌సైట్ లేదా డీమ్యాట్ ఖాతా ద్వారా సులువుగా ఈ బాండ్లను కొనవచ్చు. ఇలా కొంటే డిజిటల్ రూపేణా డీమ్యాట్ ఖాతా హోల్డింగ్స్‌లో కొనుగోలు చేసిన బాండ్లను చూడవచ్చు. ఉదాహరణకు జెరోధాలో నేను కొన్న బాండ్లు:

Holdings (8) Kite only  Search Family Analytics Download

| Instrument | Qty. | Avg. cost | LTP | Cur. val | P&L | Net chg. | Day chg. |
|---|---|---|---|---|---|---|---|
| SGBNOV24-GB | | 2,957.00 | 5,885.78 | | | +99.05% | +0.10% |
| SGBJUNE31 | | 5,876.00 | 5,957.99 | | | +1.40% | +0.13% |

## ఫుట్‌నోట్స్


[1] All you need to know about gold savings schemes
[2] Gold deposit schemes can run for only up to a year
[3] 7 things to know while buying gold coins
[4] Investing in digital gold is easy, but should you?
[5] https://www1.nseindia.com/products/content/equities/etfs/gold.htm
[6] Investing Advantages With Gold ETFs
[7] https://www.nseindia.com/products-services/about-sgb
[8] Government announces dates for further tranches of Sovereign Gold Bond sale
[9] Sovereign Gold Bond Scheme (SGB) - Personal Banking


అలోక్ నంద ప్రసాద్
https://qr.ae/pGVsBh

## The Big Short సినిమాలో జరిగే షార్టింగ్ గురించి వివరించగలరా?

ముందు మార్కెట్ పరిభాషలో లాంగ్, షార్ట్ అంటే ఏమిటో తెలుసుకుందాం.

లాంగ్: ముందు కొని, తరువాత అమ్మటం. ఇల్లు, స్థలం, బంగారం, షేర్లు ఏవైనా కావచ్చు, విలువ పెరుగుతుందని తెలిసినవాటిని ఇలా కొని, అమ్మేసి లాభం సంపాదించటం. దీని ప్రతిక్రియను (equal and opposite action) షార్ట్ అంటారు.

షార్ట్: మన వద్ద లేని దాన్ని అరువు తెచ్చుకుని ముందు అమ్మివేయటం. దాని విలువ పడినప్పుడు లాభానికీ, పెరిగినప్పుడు నష్టానికీ తిరిగి కొనుక్కుని అరువు తెచ్చుకున్న వాడికి తిరిగిచ్చేయటం. ఇందులోని లాభనష్టాలు పూర్తిగా షార్ట్ చేసినవాడివే, ఆ వస్తువు సొంతదారువి కాదు.




ప్రపంచంలోని అత్యంత లాభదాయక వ్యాపారాల్లో ఒకటి బీమా. చాలా మందికి తెలియని విషయం ఏమిటంటే వారెన్ బఫెట్ తన సంపాదనలో సింహభాగం బీమా వ్యాపారంలోనే సంపాదిస్తున్నారు.

సరళంగా బీమా అంటే ఏమిటి?
జరగకూడని ఘటన ఒకవేళ జరిగితే పరిహారం అందుకునేలా చేసుకునే ఒప్పందం. దానికి బీమా కొనుగోలుదారు చిన్న మొత్తం కిస్తులు కడుతూ, ఆ ఘటన సంభవిస్తే పెద్ద మొత్తంలో బీమా సొమ్ము అందుకుంటారు.
మైకేల్ బర్రీ అనే ఒక మేధావి అమెరికాలో హౌసింగ్ మార్కెట్ పతనం అవబోతోందని విశ్లేషించి, ఆ మార్కెట్‌ను ముందుగానే షార్ట్ చేసి, ఆధునిక మానవ చరిత్రలోని అతిపెద్ద సంక్షోభం జరిగినప్పుడు కళ్ళు చెదిరే లాభం సంపాదించాడు. ఇదే బిగ్ షార్ట్ సినిమా వృత్తాంతం (యదార్థ సంఘటన).

అదంతా సరే, అంత పెద్ద హౌసింగ్ మార్కెట్‌ను షార్ట్ చెయ్యటం ఎలా?

దీనికి అతను పెద్ద బ్యాంకులు తన కొరకు ఒక ఉత్పత్తి (CDS) తయారు చేసి అమ్మేలా చేసాడు. ఆ CDS బీమా వంటిది. ఈ బీమాలో హౌసింగ్ మార్కెట్ పతనమవటం అనేది జరగకూడని ఘటన అయితే, మైకేల్ బర్రీ కట్టిన సొమ్ము బీమాకిస్తులు. హౌసింగ్ మార్కెట్ పతనమయినప్పుడు బ్యాంకులు ఆయనకు కట్టినది సమ్-ఇన్స్యూర్డ్.

సరళంగా జరిగిందిదే. వివరాలు బాగా బోరు కొట్టవచ్చు కావున టూకీగా చెప్పే ప్రయత్నం చేస్తాను. సినిమా చూస్తే ఇంకా బాగా అర్థం అవుతుంది.

ముందుగా ఈ సమాధానం నేపథ్యంలో కొన్ని పదాలు, వాటి అర్థాలు:
Mortgages: గృహరుణాలు.
Subprime Mortgages(SM): తిరిగి చెల్లించే సామర్థ్యం తక్కువగా ఉన్నవారికిచ్చే గృహరుణాలు.
Default: రుణం తీసుకున్న వారు తిరిగి చెల్లించకపోవటం.
Mortgage Backed Security(MBS): ఒక బ్యాంకు తాము ఇచ్చిన గృహరుణాలను కలిపి తయారు చేసిన బాండ్ల ప్యాకేజ్. వీటిని ఆసక్తి ఉన్నవారికి కమిషన్‌కు అమ్మేసి ఆయా రుణాల నుండి రిస్క్ లేకుండా ముందుగానే కొంత లాభం సంపాదిస్తారు.
Collateralized Debt Obligation(CDO): MBSలో ఒక రకం, ముఖ్యంగా SMల ప్యాకేజ్.
Credit Default Swap(CDS): CDOల విలువ పతనమవుతుంది (అంటే గృహరుణాలు తీసుకున్న వారిలో ఎక్కువ శాతం తిరిగి కట్టలేక Default అవుతాయి) అని వాటిపై తీసుకునే బీమా అనుకోవచ్చు.




*మూలం: Subprime Mortgage: The Cause of 2008 Financial Crisis Explained*

అసలేం జరిగింది?

బ్యాంకులు MBSలను అమ్ముతూ వాటిపై వచ్చే కమిషన్‌తో లక్షల కోట్లు సంపాదిస్తుండగా తిరిగి చెల్లించలేని వారికి కూడా గృహరుణాలిచ్చి వాటిని CDOలుగా అమ్మితే మరింత కమిషన్ సంపాదించవచ్చన్న దురాశ మొదలైంది.

రేటింగ్ ఏజెన్సీలు ఈ CDOలకు మంచి రేటింగ్ ఇచ్చేలా చెయ్యటం బ్యాంకుల దురాశకు పరాకాష్ట (రేటింగ్ ఏజెన్సీలది కూడా). దానితో ఎవరికి ఇస్తున్నారన్న ధ్యాస, జాగ్రత్త లేకుండా విచక్షణా రహితంగా గృహరుణాలివ్వటం జరిగింది. విచ్చలవిడిగా రుణాలు రావటంతో అందరూ ఇళ్ళు కొనటం మొదలుపెట్టారు. గిరాకీ పెరిగి ఇళ్ళ ధరలకు రెక్కలొచ్చాయి, బుడగ పెద్దదవటం మొదలైంది.

చెల్లించలేని వారికి రుణాలివ్వటం పెరుగుతూ ఉంటే క్రమంగా రుణాల కిస్తులు కట్టటం తగ్గిపోతుంది. ఆ దురాశే ఒకానొక దినాన బ్యాంకింగ్, హౌసింగ్ రంగాలు కుదేలయ్యే స్థితికి దారితీసింది, బుడగ పగిలిపోయింది.

అయితే ఆ CDOలు అన్నీ మేడిపళ్ళే అని ముందే విశ్లేషించిన మైకేల్ బర్రీ వాటి విలువ పతనమవుతుందని వాటిని షార్ట్ చేసేందుకు వాడిన సాధనం CDS. ఇక్కడ మైకేల్ బర్రీ చేసిన పని ఏమిటంటే CDOలు జారీ చేసే బ్యాంకులే అవి పతనమయితే పరిహారం చెల్లించే CDSలను రూపొందించి తనకు అమ్మేలా చెయ్యటం. వారి దురాశకు వారి చేత్తోనే వారి కళ్ళు పొడుచుకునేలా చేశాడన్నమాట. ఫలితంగా ఆయన తన వ్యక్తిగత ఖాతాలో 100 మిలియన్ డాలర్లు, తన సంస్థ మదుపర్లకు మరో 700 మిలియన్ డాలర్ల లాభం సంపాదించాడు - అదీ 2008లో ప్రపంచమంతా మాంద్యం ముసురులో మునిగినప్పుడు. అందుకే ఈ ఉదంతంపై తీసిన సినిమా పేరు ది బిగ్ షార్ట్.

అలోక్ నంద ప్రసాద్
https://qr.ae/pykkjO

## హెల్త్ ఇన్సూరెన్స్ తీసుకునేప్పుడు 'నో క్లెయిమ్ బోనస్' ఎంచుకొమ్మంటారు. పాలసీదారులకు ఇది లాభసాటేనా? లేకుంటే క్లెయిమ్స్ లేకుండా చేసుకోవడానికి కంపెనీల ఎత్తుగడా?

"బావా. ఎలా ఉంది అమ్మమ్మకి ?.. ఏమైనా గుణం కనిపిస్తోందా?"

"లేదు బావా. పరిస్థితి ఏం బాలేదు. ఇప్పటికే రెండు నెలలు అయ్యింది ఆసుపత్రిలో చేరి"

"ఎంత ఖర్చు అవుతుంది? నీ దగ్గర అంత డబ్బుందా?"

"ఇప్పటికి ఇరవై లక్షలు అయ్యింది. ఇప్పుడు ఈ మార్పిడికి ఒప్పుకుంటే నలభై దాకా అవుతుంది అంటున్నారు. ఇప్పటి వరకు అయితే మొత్తం ఇన్సూరెన్స్ లోనే కాబట్టి ఇబ్బంది పడలేదు..ఈ ఒక్కదానికి ఏదైనా చేయాలి".

నిజానికి ఆయన తీసుకున్న ఇన్సూరెన్స్ ఇరవై లక్షలు కాదు. పదిహేను మాత్రమే. గత అయిదేళ్ళుగా ఎలాంటి క్లైమ్ లేనందుకు నో క్లైమ్ బోనస్ పెరిగి పెరిగి ఇప్పుడు ఇరవై అయిదు లక్షలు వాడుకునే వెసులుబాటు కలిగింది. అదే ప్రీమియంతో. ఏదో ఒకసారి చిన్న చిన్న అనారోగ్యానికి ఇరవై ముప్పై వేలు ఇన్సూరెన్స్ కింద క్లైమ్ చేసి ఉండవచ్చు. కానీ నో క్లైమ్ బోనస్ వల్ల చేయలేదు. కట్టిన ప్రీమియం వసూలు చేయాలి అని అలా ప్రతి చిన్న వైద్యానికి ఇన్సూరెన్స్ వాడేవాళ్ళు ఎందరో నాకు తెలుసు.

***

"నో క్లైమ్ బోనస్" బీమా ప్రపంచంలో ఒక ఉభయ తారక మంత్రం.

పాలసీ దారుని లాభాల గురించి చెప్పాలి అంటే నో క్లైమ్ బోనస్ వల్ల అదే ప్రీమియం కడుతూ రాను రాను ఎక్కువ కవరేజీ పొందే సదుపాయం ఉంటుంది. ఆరోగ్యవంతులకు అనూహ్యంగా వచ్చే ఆరోగ్య సమస్యల సమయంలో ఆర్థికంగా ఎంతో లాభం. ఒకవేళ ఏ సమస్యా రాకపోయినా కట్టే ప్రీమియం తక్కువే కాబట్టి సమస్య లేదు.

బీమా సంస్థలకు కూడా లాభమే. చిన్న చిన్న అనారోగ్యాలకు అవసరానికి మించిన చికిత్స పేరుతో డబ్బులు వసూలు చేసే వాళ్ల వల్ల ఆ ఇన్సూరెన్స్ సంస్థలకు ఏటా లాభాలు తగ్గుతూ ఉంటున్నాయి. తత్ఫలితంగా ప్రీమియం పెంచాల్సి వస్తోంది. అదే వినియోగదారులు ఆరోగ్యంగా ఉంటూ, చిన్న అనారోగ్యానికి సైతం క్లైమ్ బాట పట్టకుండా ఆపగలిగితే వాళ్లకు ఫేక్ క్లైమ్ చెల్లింపులు చాలా తగ్గుతాయి.

**నో క్లైమ్ బోనస్ స్కీములు అన్నీ ఒకేలా పనిచేస్తాయా?**

లేదు. ఒక్కో స్కీం ఒక్కోలా ఉంటుంది. అందుకే వివరాలు జాగ్రత్తగా చూడాలి.

కొన్ని ప్రతి ఏడు ఇంత శాతం (అయిదు, పది, ఇరవై) నో క్లైమ్ బోనస్ కింద బీమా మొత్తం ఏటికేడు పెంచుతూ ఉంటారు. ఇలా పెంచడానికి ఒక గరిష్ట పరిమితి ఉంటుంది. మీ అసలు ఆరోగ్య బీమా మొత్తం పది లక్షలు అనుకుంటే యాభై శాతం వరకు అదనపు నో క్లైమ్ బోనస్ గరిష్ట పరిమితి ఉంటే బీమా మొత్తం పదిహేను లక్షలు అయ్యేదాకా మాత్రమే నో క్లైమ్ బోనస్ జమ అవుతూ ఉంటుంది. కొన్నిట్లో వంద శాతం కూడా ఉంటుంది. అంటే అదే ప్రీమియం కట్టి ఇరవై లక్షల బీమా మొత్తం అయ్యేదాకా నో క్లైమ్ బోనస్ వాడుకోవచ్చు.

ఇంకొన్ని సంస్థలు నో క్లైమ్ బోనస్ కింద మీ ప్రీమియం మొత్తం తగ్గిస్తూ ఉంటాయి.

కొన్ని పాలసీలు ఒకసారి క్లైమ్ చేస్తే పెరిగిన బీమా మొత్తం నుండి అమాంతం అసలు మొత్తానికి మీ బీమా తగ్గించి మళ్ళీ మొదటి నుండి మొదలు పెడతాయి. కొన్ని జీవిత కాలంలో ఇన్ని సార్లు మాత్రమే ఈ విధానం వాడుకునే లాగా ఉంటాయి.

ఏ రూపంలో ఉన్నా సరే నాలుగు సంస్థల బీమా పాలసీలు, వాటి చెల్లింపుల శాతం, మీ అవసరాలు అన్నీ సరిచూసుకుని తగిన పాలసీ ఎంచుకోవాలి.

ప్రత్యూష
https://qr.ae/pKRonc

## ఎక్కువమంది స్టాక్ మార్కెట్లు, మ్యూచువల్ ఫండ్లలో పెట్టుబడి పెడితే భారత ఆర్థిక వ్యవస్థ మెరుగుపడుతుందా? అలా చేయడానికి ప్రభుత్వాలు ఏ చర్యలు తీసుకోవాలి?

మన స్టాక్ మార్కెట్లు ప్రధానంగా భావావేశాలపై కదలాడుతాయి.

ఈ మాటను మరోలా అర్థం చేసుకోవద్దు. మనబోటి చిన్న మదుపర్ల దురాశ, భయాలను సంస్థాగత మదుపర్లు, పెద్ద ట్రేడర్లు (చిన్న మదుపర్లకు వ్యతిరేక దిశలో కొనుగోళ్ళు/అమ్మకాలు జరుపుతూ) సొమ్ము చేసుకోవటం చాప క్రింది నీరులా జరుగుతున్నదే. అందుకే భావావేశాలకు అతీతంగా, సాధ్యమైనంత సూక్ష్మ ఖచ్చితత్వంతో మార్కెట్లో డబ్బు పెట్టగల చిన్న మదుపర్లే నిలకడగా సంపద సృష్టించుకోగలరు.




ప్రస్తుతం మన దేశంలో కేవలం 3% జనాభా మాత్రమే స్టాక్ మార్కెట్లో (మ్యూచువల్ ఫండ్లు సహా) మదుపు చేస్తున్నట్టు అంచనా. దాదాపు ప్రపంచ దేశాలన్నిటి కంటే వేగంగా అభివృద్ధి చెందుతున్న చైనాలో సుమారు 13% జనాభాకు స్టాక్ మార్కెట్లో పెట్టుబడులు ఉన్నాయి.

అయితే ఎక్కువ మంది స్టాక్ మార్కెట్లో పెట్టుబడులు పెట్టినందున మాత్రమే ఆర్థిక వ్యవస్థ మెరుగు పడిపోదు. అలాగని అసలు లాభమే ఉండదనీ కాదు. దేశం ఖచ్చితంగా లాభపడుతుంది కానీ అందుకు కనీసం దశాబ్దం పట్టవచ్చు. ఎందుకంటే:

- మదుపర్లు ఎక్కువైతే ముందుగా మార్కెట్లో చాంచల్యం(Volatility), చపలత(Fickleness) తాండవం చేస్తాయి.
- తత్ఫలితంగా షేర్ల ధరల్లో విపరీతమైన కదలికలు ఉంటాయి.
- ప్రస్తుతం కొద్ది మందినే బలితీసుకుంటున్న Pump & Dump స్కాములు హెచ్చు మీరతాయి.

- గబుక్కున కోట్లు సంపాదించేయాలన్న ఆశ మన దేశంలో ప్రబలం. తగినంత జ్ఞానం లేకుండానే ట్రేడింగ్ చేసి డబ్బు పోగొట్టుకునే ఉదంతాలు ఇంకా ఎక్కువవుతాయి.
- పైవన్నీ జరిగే కొద్దీ క్రియాశీలకంగా రావలసిన మార్గదర్శకాలు, విధివిధానాలను ఒత్తిడిలో ప్రతిక్రియాశీలకంగా రూపొందించటానికి ప్రభుత్వం, సెబీలకు సమయం పడుతుంది.

వెరసి మొదట్లోని చాంచల్యం, చపలత కొన్నేళ్ళలో వెలసిపోయి జనంలో స్టాక్ మార్కెట్ పట్ల వ్యామోహం తగ్గి బాధ్యత పెంపొందిన రోజున పెట్టుబడుల్లో సమతౌల్యం, మదుపర్లలో, మార్కెట్లో పరిపక్వత వస్తాయి.

సరైన పనితీరు గల సంస్థల షేర్లు పెరుగుతూ, వాటికి గిరాకీ పెరిగి ఆయా సంస్థల వృద్ధి మన ఆర్థిక చరిత్రలో కని, విని, ఎరుగని రీతిన సాగుతుంది. చైనా, అమెరికా వంటి దేశాల్లోలా పలు కార్పొరేట్ దిగ్గజాలు వృద్ధి చెంది వినియోగదారులకు నాణ్యమైన వస్తు, సేవలు అందుబాటులోకి వస్తాయి.

కానీ - ఇవి జరగాలంటే అనుబంధ వ్యవస్థల్లో కూడా పెనుమార్పులు తప్పవు. కార్పొరేట్ మోసగాళ్ళకు వెంటనే కఠిన శిక్షలు పడాలి, బ్యాంకు రుణాల ఎగవేతలు గణనీయంగా తగ్గాలి, వ్యవసాయమూ దిగ్గజ పరిశ్రమగా పరిణమించి పరిపక్వత చెందాలి, వినియోగదారుల్లో బాధ్యత, అవగాహన పెరగాలి. ఇవన్నీ జరగటానికి స్టాక్ మార్కెట్లో పాల్గొనే జనం సంఖ్య పెరగటం ఒక ట్రిగ్గర్ కావచ్చు!

అంచేత స్టాక్ మార్కెట్లో ఎక్కువ మంది పెట్టుబడులు పెట్టటం దేశ ఆర్థిక వ్యవస్థకు దీర్ఘకాలానికి మంచి పరిణామమే.

అలోక్ నంద ప్రసాద్

https://qr.ae/pykLpl

## మనం షేర్లు కొంటూ అమ్ముతూ ఉంటే దేశానికి, ఆర్థిక వ్యవస్థకేం లాభం? పోనీ మనం కొనే షేరు బాపతు కంపెనీకి మాత్రం ఏం లాభం?

పబ్లిక్ ఇష్యూ, ఐ.పి.ఓ అవసరమా ఒక సంస్థకి? అదేం లేదు. ప్రైవేటు ప్రొప్రైటర్షిప్ గా ఉండిపోవచ్చు. ఈ తాతగారి లాగా అక్షరాలా 15 కోట్ల జీతం తీసుకుంటూ.




*మూలం: https://sugermint.com/wp-content/uploads/2020/09/Mahashay-Dharampal-Gulati.jpg*

మరి ఎందుకు సెబీ లాంటి సంస్థల అధిక నియంత్రణ[1] ఉంటుందని తెలిసీ సంస్థలు పబ్లిక్ అయ్యేది?

సంస్థ అంటే ఏంటి? యజమానులు ఇంకా వాటాదారులే కదా. వారికి సంస్థలో పెద్ద ఎత్తున షేర్ల రూపంలో వాటా ఉంటుంది. ఉన్నత స్థానాల్లో ఉన్న ఉద్యోగులకు కూడా వాటా ఉంటుంది.

ఒక సంస్థ తొలినాళ్ళలో వివిధ దశల్లో పెట్టుబడి అవసరం అయినపుడు, వ్యవస్థాపకులు అన్ని సార్లు అంత మొత్తం పెట్టడం సాధ్యం కాదు. బ్యాంకు రుణాలు కూడా ప్రతి తరహా వ్యాపారానికి దొరక్క పోవచ్చు. ఉదా: విఫలం అయ్యే అవకాశం ఎక్కువగా ఉన్న కొత్త రంగాల అంకురాలు.

అప్పుడు ఏంజిల్ ఇన్వెస్టర్ల నుండి ప్రైవేట్ ఇక్విటీ వరకు చాలా రకాల పెట్టుబడులు సమీకరించాలి. అందుకు ప్రతిఫలంగా సంస్థలో వాటా అడుగుతారు వారు. ఈ దశలో చేరిన ఉద్యోగులకు కూడా క్యాష్ తక్కువగా ఇచ్చి స్టాక్ ఆప్షన్ రూపంలో కంపనీ భవిష్యత్ లాభాల్లో వాటా ఇస్తుంటారు. డబ్బు కొరత కారణంగా. సంస్థ లాభాల బాట పట్టినప్పుడు వారందరికి తగిన ప్రతిఫలం దక్కుతుంది. లేకపోతే పెట్టుబడి(శ్రమ) మొత్తం ఏట్లో కొట్టుకుపోతుంది.

కానీ ఒక చిక్కు. లాభాల బాట పట్టడానికి ఎన్నేళ్ళు పట్టేది తెలియదు. పెట్టుబడిదారులకేమో ఒక వ్యవధి లోపు పెట్టుబడి మూలధనం రాబడితో సహా తిరిగి పొంది మరో వ్యాపారంలో పెట్టాలని ఉత్సాహంగా ఉంటుంది. ఆ కాలవ్యవధి 3 లేదా 5 నుండి 7 సంవత్సరాల వరకు కూడా ఉండవచ్చు.

అప్పటి వరకు లాభాలు లేకపోతే వారి పరిస్థితేంటి? ఇన్ని రోజుల శ్రమ వృధా చేయకుండా ఏం చేయాలి? సంస్థ విలువ భవిష్యత్తులో వచ్చే ఆదాయం, తగ్గిన రిస్కు, లాభాల పరంగా కోట్లలో ఉండవచ్చు గాక. ఈ ఫ్లిప్కార్ట్ (flipkart) విలువ[2] లాగా. ప్రస్తుతం రూపాయి కూడా తిరిగి చెల్లించలేని పరిస్థితి. ఈ దశలో ఇంకా పెట్టుబడి అవసరం అయితే?

మరో ఇన్వెస్టరు సదరు పెట్టుబడిదారు వాటా ఇప్పుడున్న విలువ ఆధారంగా కొనేయచ్చు. వాల్ మార్ట్ పైన చెప్పిన ఫ్లిప్కార్ట్ లో కొన్నట్టు. కానీ అలా జరగడం అరుదు లేదా కష్టం.

కావున ఏదో ఒక దశలో
1. పెట్టుబడి ఉపసంహరణ మార్గాలు, ఉబర్ విషయంలో చూసినట్టు, కావాలి
2. ఉద్యోగులకు ఇచ్చిన వాటా సులువుగా  అమ్మి వారు డబ్బులు కళ్ళ జూసే వెసులుబాటు కావాలి
3. వ్యాపార విస్తరనకు, పోటీలో ముందుండడానికి అదనపు పెట్టుబడులు కావాలి.

అందుకే సంస్థలు పబ్లిక్ అయ్యి ఐ.పి.ఓ కి వెళ్ళేది .ప్రైమరీ* మార్కెట్లలో.

ఇక ప్రశ్నలో అడిగిన విషయం.

ఐ.పి.ఓ తదనంతరం వాటాదారులు మారారు, అదనపు వాటాదారాలు చేరారు. కాని సమస్య అలాగే ఉంది. ఇప్పుడున్న వారు ఏదో రోజ ఎంతో కొంత వాటా అమ్మి పెట్టుబడి పైన రాబడి లాభాలు చూడాలి.

- కంపనీ ఎదుగుతున్నన్ని రోజులు లాభాలు పునర్వినియోగించడం అత్యుత్తమ మార్గం. కాబట్టి డివిడెండ్ల రూపంలో కూడా లాభాలు పంచేది కొంతే. లాభాలు తిరిగి పెట్టుబడుల కోసం వినియోగించడం సంస్థకు మంచిదే కాని మళ్ళీ పెట్టుబడిదారులది అదే సమస్య. ఇంకో ఐదు పదేళ్ల సమయం పట్టవచ్చు డివిడెండ్ల రూపంలో పూర్తి పెట్టుబడి తిరిగి రావాలంటే. పెట్టుబడి ఉపసంహరించే మార్గం కావాలి.
- ఉద్యోగులు కూడా తమ స్టాక్ ఆప్షన్ ఒకేసారి కాకుండా కొద్ది కొద్దిగా అమ్మి సొమ్ము చేసుకునే వెసులుబాటు కావాలి.
- మదుపరులు, పెట్టుబడిదారులు మరో అధిక లాభాలిచ్చే సంస్థకు పెట్టుబడులు మార్చాలన్నా ముందు పెట్టిన మొత్తం తిరిగి రావాలి.

వీటన్నిటి దృష్ట్యా సమర్థవంతమైన సెకండరీ* మార్కెట్ కావాలి.

ఒకవేళ ఈ సెకండరీ మార్కెట్ లేకపోతే

1. అంకుర దశలో పెట్టుబడి పెట్టేందుకు ముందుకు వచ్చేవారు తగ్గి, పెట్టుబడులు తగ్గిపోతాయి. అసలు రాకపోవచ్చు.
2. సమర్థమైన ఉద్యోగులు దొరకరు.
3. ఒకవేళ దొరికినా వారికి పెట్టుబడి ఉపసంహరణ మార్గాలు తగ్గడం వల్ల ఒకే సంస్థలో ఇరుక్కుపోయిన పెట్టుబడులు, ఇన్వెస్టర్లు మరిన్ని సంస్థలకు చేరకుండా ఆగిపోయి ఆర్థిక రంగం కుంటుపడుతుంది.
4. సామాన్యులకు సంస్థల ఎదుగుదలలో పాలుపంచుకొని, లాభ పడే అవకాశాలు ఉండవు. (అవసరం ఉన్నప్పుడు అమ్మగలగడం చిన్న మదుపరులకు అవసరం.. లాభాల కన్నా కూడా)
5. ఈ లావాదేవీలు జి.డి.పి లో లెక్కించే చట్టబద్ధ లావాదేవీలు కాబట్టి దేశానికి ఉపయోగమే. (తెర వెనుక జరిగే స్థిరాస్తి లావాదేవీలలా కాకుండా)
6. తక్కువ మంది ఇన్వెస్టర్ల నుండి ఎక్కువ మంది మదుపుదార్లు రోజూ కొని అమ్మడం వల్ల కంపనీ విలువ సరిగ్గా మదింపు జరిగి, ప్రమోటర్లు కుమ్మక్కై సంస్థ విలువ ఎన్నో రెట్లు పెంచి సత్య దూరంగా ఉంచకుండా కూడా దోహద పడుతుంది.

పనిలో పనిగా రకరకాల పన్నులు. లావాదేవి పన్ను, మూలధన వృద్ధి పన్ను. బ్రోకరేజి సంస్థల, మ్యూచువల్ ఫండ్, అడ్వైసరీ రూపంలో మరిన్ని ఉద్యోగాల కల్పన.

***

కొన్ని కీలక పదాలు:
క్యాపిటల్ మార్కెట్: తెలుగులో పెట్టుబడి బజారు అందాం. ఇందులో రెండు రకాలు.
*ప్రైమరీ మార్కెట్: ప్రాథమిక మార్కెట్ (మొదటిసారి షేర్లు, బాండ్ల జారీ)
*సెకండరీ మార్కెట్: ఉప మార్కెట్ అందాం (జారీ చేసిన షేర్లు, బాండ్ల పునరమ్మకాలు కొనుగోలు)

దీర్ఘకాలిక నిధులు సమీకరించే వ్యవస్థను క్యాపిటల్ మార్కెట్ అంటారు. అంటే షేర్లు, సంవత్సరం కంటే ఎక్కువ వ్యవధి గల బాండ్లు లావాదేవీ జరిగే అంగడి అన్నమాట. ఇవి 300 యేళ్ల క్రితం నుండే ఉన్నాయి.

ప్రభుత్వం బాండ్ల ద్వారా నగదు సమకూర్చుకోవాలన్నా, సంస్థలు బాండ్లు లేదా షేర్ల రూపంలో పెట్టుబడులు రాబట్టాలన్నా ఈ మార్కెట్లే శరణ్యం.

ఫుట్‌నోట్స్ :
[1] https://www1.nseindia.com/products/content/equities/ipos/about_ipos.htm
[2] Walmart CEO defends Flipkart's valuation, says learnings from India helped double their e-commerce sales

ప్రత్యూష
https://qr.ae/pyuFHV

**ఒక సంస్థ IPOలో మదుపర్లు షేర్లు కొంటే ఆ మొత్తం నగదు సంస్థకు చేరుతుంది. ఆ మూలధనాన్ని వ్యాపార విస్తరణ, రుణ చెల్లింపులు వంటి ఉద్దేశాలకు సంస్థ వాడవచ్చు. తద్వారా వ్యాపార వృద్ధి సాధ్యం. సంస్థ వ్యాపారం వృద్ధి చెందితే దేశానికేం లాభం?**

- ఉద్యోగాలు, ఉపాధి కల్పన,
- తద్వారా పెరిగిన తలసరి ఆదాయం, ఉద్యోగస్తుల సంఖ్య, వారి జీతాలతో పెరిగే వస్తువులు, సేవల వినియోగం, ప్రభుత్వ పన్ను ఆదాయం,
- తద్వారా పెరిగే పొదుపు - బ్యాంకుల్లో డిపాజిట్లు పెరిగితే వారు ఎక్కువ అప్పులు ఇవ్వగలరు,
- తద్వారా పెరిగే వ్యాపారాలకు అప్పులు,
- తద్వారా మరింత వ్యాపార వృద్ధి,
- ఉద్యోగాలు, ఉపాధి కల్పన... అదే చక్రం!

పై కారణాల వల్ల స్థూల దేశీయోత్పత్తికి కొండొకచో తోడ్పాటు. ఇదంతా సరళమైన వివరం. పై అంశాలు గుర్తుంచుకుని ముందుకెళ్దాం.

IPO ద్వారా మదుపు చేస్తే దేశ ఆర్థికానికి లాభం సరే, సెకండరీ మార్కెట్లు NSE, BSEలలో షేర్లు కొంటే దేశానికి ఏమి లాభం? పోనీ మనం కొనే షేరు బాపతు కంపెనీకి మాత్రం ఏం లాభం?

జనాలు ఒక సంస్థ షేర్లు కొనటం వల్ల ఆ షేర్ల విలువ పెరుగుతుంది, తద్వారా సంస్థ మూలధనీకరణం (market capitalization) పెరుగుతుంది. షేర్ మార్కెట్లు లిస్ట్ అయిన సంస్థల మూలధనీకరణం పెంచుకోటానికే కాదు, వ్యాపార వృద్ధికి పలు రకాలుగా తోడ్పడతాయి. వాటిలో కొన్ని:

- FPO (Follow-on Public Offer), OFS (Offer For Sale)[1] ద్వారా మరిన్ని షేర్లు మార్కెట్లో అమ్మి నిధుల సమీకరణ.
- NCD (Non Convertible Debentures)[2] ద్వారా నిధుల సమీకరణ - దీనికీ మార్కెట్లో సంస్థ మూలధనీకరణ విలువ ఒక ప్రమాణం.
- సంస్థ మూలధనీకరణ విలువ ఆధారంగా యాజమాన్యం వాటా కుదువ పెట్టి నిధుల సమీకరణ.
- సంస్థలో షేర్లు కొనటం అంటే ఆ సంస్థలో వాటాదారులవటం అనేది తెలిసినదే. అలా వాటాదారులుగా ఉండటం వల్ల సంస్థ విధి విధానాలు, వ్యాపార వ్యూహాల గురించి యాజమాన్యాన్ని ప్రశ్నించే హక్కు ఉంటుంది. ఇందువల్ల సంస్థ నిర్వహణ నైతికంగా జరిగే ఆస్కారం ఎక్కువ.

వీటివల్ల జరిగే "సంస్థ వ్యాపార వృద్ధి - ఉద్యోగ ఉపాధి కల్పన - వినియోగం - స్థూలజాతీయోత్పత్తి" చక్రం ఇదివరకే చూశాం.

మనం షేర్లు కొంటూ, అమ్ముతూ ఉంటే అలా జరిగే ప్రతి లావాదేవీలో కొంత STT(Securities Transaction Tax)[3] పన్ను రూపంలో ప్రభుత్వానికి చేరుతుంది.

మనం అలా షేర్లు కొని, అమ్మటం ద్వారా లాభాలార్జిస్తే ఆ లాభాలను తిరిగి మదుపు చెయ్యటమో, ఖర్చు పెట్టటమో చేస్తాం. రెండూ వ్యవస్థకు లాభదాయకమే.

**ఫుట్‌నోట్స్**

[1] Supplementary note - Rights, OFS, FPO – Varsity by Zerodha
[2] Non Convertible Debentures ( NCD ) : Meaning, Features and more
[3] What is the Security Transaction Tax? When is STT Levied? | Scripbox

అలోక్ నంద ప్రసాద్
https://qr.ae/pKRoOQ

## ప్రభుత్వ పథకాల ద్వారా పేదలకు ఇస్తున్న డబ్బులు తిరిగి ఆర్థిక వ్యవస్థలోకి వచ్చి మొత్తం ఆర్థిక పరిస్థితులను మెరుగుపరుస్తుందని ఒక వాదన ఉంది. దీనిలో నిజానిజాలు ఏమిటి?

దెయ్యం, దేవుడు లాగే ఆర్థికశాస్త్రంలో కూడా ఇదమిత్థంగా నిరూపించలేకపోయినా నమ్మకంగా నమ్మే వాదనలు కొన్ని ఉన్నాయి. అందులో రెండు ట్రికిల్ డౌన్ ఎకనామిక్స్ ఇంకా మల్టిప్లయర్ ఎఫెక్ట్. నాకు ఎకనామిక్స్ పాఠాల్లో చెప్పిందాన్ని బట్టి, ఆర్థికంగా మాంద్యం వచ్చిన ప్రతిసారీ ప్రభుత్వం డబ్బు సరఫరా పెంచి, సంక్షేమ పథకాలు చేపట్టి, నిర్మాణ రంగంలో పెట్టుబడులు పెట్టి ముందుకు వెళ్లడం చూసి నిజమే అనిపిస్తుంది. దిగ(వకు)జారుడు అర్థసూత్రం అని వ్యంగ్యంగా చెప్పుకునే సరఫరా ఆధారిత అర్థికసూత్రం (trickle down effect/supply side economics) గురించి సంక్షిప్తంగా ఈ చిత్ర పటం. (మూలం Economics Help వాళ్ళది తెలుగులో స్వేచ్ఛగా తర్జుమా చేశాను)




అదే UPA-1 నుండి ప్రభుత్వ ఆర్థిక విధానం. మనం పెద్ద పెద్ద సంస్థలకు ప్రోత్సాహకాలు ఇస్తే సంపద దానంతట అదే కింది వర్గాలకు ఉద్యోగ ఉపాధి, ఖర్చు మార్గాల్లో చేరిపోతుంది అని. అవి మరింతగా గిరాకీ పెంచి కొత్త ఉద్యోగ ఉపాధి అవకాశాల ద్వారా ఆ ధనం అందరికీ చేరుతుంది అన్నదే ఈ ప్రతిపాదన. అయితే అనుకున్న మేర ఫలితాలు ఇవ్వలేదు. సంపద అంతా ఉన్నవాళ్ళ దగ్గరే కేంద్రీకృతం అయ్యి కొన్ని వర్గాలకు చేరలేదనీ అందుకే నిజమైన పేదరికం అనుకున్న మేర తగ్గలేదనీ విమర్శ లేకపోలేదు.

అంచేత మన ఆర్థిక విధానానికి మరో సవరణ, ప్రభుత్వం నేరుగా పథకాల ద్వారా పేదలకు డబ్బు ఇవ్వడం. పనికి ఆహార పథకం, వృద్ధాప్య, వితంతు పింఛను లాంటివన్నీ ఇదే కోవలోకి వస్తాయి. పైన సూత్రంలో ధనికుల్లో పెరిగిన ఆదాయం గిరాకీ సృష్టిస్తే, ఇందులో పేదల చేతిలో డబ్బు అదే పని చేస్తుంది. ఎలాగైనా వాళ్ళ నిత్యావసరాలకి, అత్యవసరాలకి ఖర్చు చేస్తారు కాబట్టి అది మళ్ళీ ఆర్థిక రంగంలోకి వస్తుంది. పనిలో పనిగా కొన్ని వస్తువులు సేవలకు పెరిగిన గిరాకీ వల్ల కూడా కొత్త ఉద్యోగాలు ఉపాధి అవకాశాలు సృష్టింపబడతాయి అన్నదే ఈ వాదం. (పై పటానికి నా అదనపు మార్పులు)




దిగజారు అర్థసూత్రం అయినా, గోపుర దక్షిణాంత (bottom of the pyramid) పథకాలు అయినా ప్రతి రూపాయి ఖర్చుకు, కొన్ని రెట్ల ఆర్థిక లావాదేవీలు జరిగి, తిరిగి పన్నుల రూపంలో ప్రభుత్వానికి జమపడతాయని, దేశ స్థూల జాతీయోత్పత్తి కూడా పెరుగుతుందని చెప్పే ఆర్థిక దృగ్విషయం గుణక ప్రభావం (multiplier effect) అనబడుతోంది.

ఈ డబ్బు పంపిణీ పథకాల మీద కొన్ని ప్రయోగాలు చేయడం జరిగింది. అవన్నీ కూడా ఈ పథకాలు అనుకున్న ఫలితాలు ఇస్తున్నాయా లేదా అనే దాని మీదనే కానీ, దేశ ఆర్థిక కోణంలో కాదు.(ఉదా: Cash or Condition? Evidence from a Cash Transfer Experiment)

ప్రశ్న దీనిలో నిజానిజాలు ఏంటి అని కదా. అదీ చూద్దాం.

నేరుగా కొలవగలికే విధానాలు నాకు దొరకలేదు కానీ ఆలోచించి చూస్తే సంబంధం లేని మరో సమస్యలో సమాధానం ఉందనిపించింది. ప్రపంచంలో అధిక సహజ వనరులు ఉన్న 51 దేశాలలో 29 పేద దేశాలుగానే మిగిలిపోయాయి[1] . కారణం ఏమై ఉంటుందనేది ఇప్పటికీ సమాధానం లేని చర్చ.

తరచి చూస్తే ఆయా దేశాల్లో కేవలం డబ్బు వితరణతో సమస్య తీరకపోవడానికి కారణం, ఆ డబ్బుతో కొనగలిగే వస్తువులు, సేవలు అందుబాటులో లేకపోవడం. తద్వారా ద్రవ్యోల్బణం లాంటి సమస్యలు.

అలా కాకుండా ఆర్థిక స్థిరత్వం, తగినంత ఉత్పాదన ఉండి సరఫరాలో లోపం వల్ల, ఆర్థిక అసమానతల వల్ల మాత్రం కొందరు వస్తువులు, సేవలు కొనలేకపోతున్న పరిస్థితులు ఉంటే ప్రభుత్వ పథకాల ద్వారా పేదలకు ఇస్తున్న డబ్బులు తిరిగి ఆర్థిక వ్యవస్థలోకి వచ్చి మొత్తం ఆర్థిక పరిస్థితులను మెరుగుపరుస్తుందని నమ్మవచ్చు. మన దగ్గర FCI లో మగ్గుతున్న ధాన్యం నిలవలు[2] ఒకవైపు, ఆకలి మరణాలు మరోవైపు[3] ఇదే అసమానతలకు కారణం అని చెప్పకనే చెప్తున్నాయి.

ఏదేమైనా అంకెలు లేవు కాబట్టి ప్రస్తుతానికి నమ్మకమే ఆధారం.

### ఫుట్‌నోట్స్

[1] Resource curse - Wikipedia
[2] Government struggling to find space for fresh rice stock
[3] India’s poverty rate to be around 10% in FY22: WB

ప్రత్యూష
https://qr.ae/pKRomy

## ప్రభుత్వం చేసే అప్పుల భారం పేద ప్రజల మీద ఎక్కువ పడుతుందా? ధనవంతుల మీద ఎక్కువ పడుతుందా?

అప్పు నిప్పు ఒకటే. నిప్పు కాలుతుందేమోనని భయపడి దూరం పెట్టకుండా జాగ్రత్తగా వాడుకొంటే వంటతో కడుపు నిండుతుంది.

సంపాదన శక్తి ఉన్న ఉద్యోగి అప్పు చేసి ఇల్లు కొనేది, చేతిలో సరిపడా నగదు ఉండీ కారు ఋణం తీసుకొని కొనేది తెలివి లేక కాదు. అప్పులో ఉన్న ఒక శక్తి వల్ల.

ఇంటి ఋణం 8% వడ్డీ ఉన్నా ఎందుకు తీసుకున్నారు అంటే అందరూ చెప్పే సమాధానం లోన్ తీర్చే లోపు ఇల్లు విలువ అంతకన్నా ఎక్కువగా పెరుగుతుంది అని. వాహనం ఋణంతో కొనేది, చేతిలో ఉన్న నగదు ఏదైనా పెట్టుబడి పెడితే కారు ఋణానికి పోయే వడ్డీ కన్నా అధిక రాబడి వస్తుందని.

అంటే ఋణం మీద కట్టే వడ్డీ కన్నా అధిక రాబడి ఉన్నవాళ్ళకు అప్పు ఆప్తమిత్రుడు. అదే కట్టలేని వాడికి అప్పు అతిపెద్ద ముప్పు.

మన దేశం విషయానికి వస్తే అప్పుతో దేశాభివృద్ధి జరిగే పనులు జరిగి, తగిన రాబడితో అప్పు మీద వడ్డీ కట్టగలశక్తి ఉన్నన్ని రోజులు వడ్డీ కడుతూ ఉంటే సరిపోతుంది.




*మూలం: Where does the government generate revenue and where is it spent*

మనుషులు రిటైర్ అయినట్టు దేశాలు కావు (అప్పుడప్పుడు వెనిజ్వెలా దేశం, గ్రీస్ దేశంలా ప్రమాదం అంచుకు వెళ్తారు). కాబట్టి అప్పు నిరంతరం నవీకరించుకోవచ్చు. అసలు కట్టేయకుండా వడ్డీ చెల్లిస్తూ పోవడం లాగే. ఎవర్గ్రీనింగ్.

దేశ జి.డి.పి లో వృద్ధి నిజంగా జరిగినన్ని రోజులు ఏ ప్రపంచ బ్యాంకు అసలు తిరిగి చెల్లించమని అడగదు. అలా అడిగే అవకాశం దేశ క్రెడిట్ రేటింగ్ పడిపోయినప్పుడు అధికం. విచిత్రమేమిటంటే పర్సనల్ లోన్ లాగానే అవసరం ఉన్న బలహీన దేశాలకు అప్పు పుట్టదు, అవసరం లేని దేశాలకు ఎగబడి ఇస్తారు.

అప్పు అనగానే దేశం ఏ ప్రపంచ బ్యాంకు నుండి తెచ్చుకుంది అనే ఆలోచిస్తాం కానీ, దేశ ప్రజలు నుండి, రిజర్వు బ్యాంకు నుండి కూడా అప్పు చేస్తారని గుర్తించం. ప్రభుత్వం జారీ చేసే బాండ్లలో పెట్టుబడి పెట్టారా? ఐతే మీరూ దేశానికి అప్పిచ్చారు.

ఈ కబుర్లకేం కానీ దేశ భవిష్యత్తు మీద నమ్మకం లేదు. అప్పు చెల్లించాల్సిన పరిస్థితి వస్తే బాధ్యత గల పౌరునిగా నేనెంత కట్టాలి అంటారా? మీ శక్తి కొద్దీ కడతారు. ఇదిగో ఇలా.

దేశం ఆదాయంలోంచే కదా ఋణం తిరిగి చెల్లించేది. ఆ ఆదాయం ఆధారంగా, అదీ ప్రభుత్వం 2022 బడ్జెట్ ఆధారంగా మాట్లాడతాను.




*మూలం: https://www.outlookindia.com/business/budget-2022-understanding-how-every-rupee-will-be-utilised-this-financial-year-news-56218*

ప్రభుత్వ ఆదాయం వివిధ పన్నుల రూపంలో.

కార్పొరేట్ టాక్స్: 15%.  ఇది పూర్తిగా సంస్థలు చెల్లించే పన్ను. సామాన్యుడు కాదు.

పర్సనల్ టాక్స్: 15%. అంచెలంచెలుగా ఉన్న మన ఆదాయ పన్ను మధ్యతరగతి మీద 10% 15% వరకు, ధనవంతుల మీద 15 నుండి 35% వరకు పడుతుంది.

మనకి అనిపించవచ్చు జీతంలో టాక్స్ చాలా పోతుందని కాని సంవత్సరానికి పన్నెండు లక్షల ఆదాయం వారికి 10% మాత్రమే కొత్త విధానంలో. పాత దానిలో అదనపు మినహాయింపు ఏమన్నా ఉంటే ఇంకా తగ్గుతుంది. అంటే నెలకు లక్ష ఆదాయం. టాక్స్ 10%. మధ్య తరగతి అన్నమాట.

మిగిలింది వస్తు సేవల పన్ను 16%. ఇది దాదాపు అందరికీ వర్తిస్తుంది.

మధ్య తరగతి, ధనికవర్గం సామాన్యంగా కొనే అతి పెద్ద ఖర్చు ఇల్లు, బంగారం. బంగారం మీద 3%. ఇల్లు మీద 5%. (చిన్న తరహా ఇల్లు అయితే 1%).

ఇక అందరూ కొనే నిత్యావసరాల గురించి. నిత్యావసరం కాబట్టే తక్కువ పన్ను. ఎంత ఆదాయం ఉన్నా తినగలిగేది అవసరం మేరకే. ఆ అవసరం నిరుపేదకే ఎక్కువ.

వారి ఆదాయంలో భాగంగా చూస్తే నిత్యావసరాల మీద పెట్టే ఖర్చు ఎక్కువ. ఆ విధంగా చూస్తే వారికి వచ్చే దాంట్లోనే ప్రభుత్వానికి మళ్ళీ సబ్బు నుండి నూనె దాకా అన్నిటిమీదా పన్ను కడుతున్నట్టు.

మన దగ్గర యథాలాపంగా అనేస్తుంటాం. పేదవాడు పొదుపు చేయకుండా తిని తాగుతాడు అని.

2021 లెక్కల ప్రకారం తిండికి మాత్రమే నెలకు ఒక్కరికి 1500 కనీస మొత్తం అవసరం అని మరో లెక్కలో తేల్చారు. సగటున కుటుంబానికి ఐదుగురు అనుకుంటే 4000 నుండి 4500 రూపాయలు నెలకు భోజనం ఖర్చు. ఇది కూడా దొరకని పేదలు 30% ఉన్నారని ఆర్థిక సర్వే.

కుటుంబం అంతా కలిసి నెలలో పది పదిహేను వేలు సంపాదించని పేదలు ఎంత ఆదాయం పొదుపు చేసినా కనీసం 20 లక్షలు లేనిదే రాని ఇల్లు కొనుగోలు చేయడం కష్టం. పోనీ బంగారం అంటే అదీ శక్తికి మించిన పనే. అందుకే చేసేది లేక ఉన్న దాంట్లో చేయగల సరదాలు ఏవీ వదులుకోరు.

ప్రశ్న అప్పు భారం గురించి కదా. తలసరి అప్పుగా చూస్తే ఆదాయం లేని పేద మీద ఎక్కువ పడ్డట్టు ఉంటుంది. కానీ అప్పు చెల్లించేది వ్యక్తులు కాదు ప్రభుత్వం. అదీ వార్షిక ఆదాయంలోంచి.

ఆ వార్షిక ఆదాయం ఎవరి నుంచి ఎంత వస్తుందో ముందే చూశాం కదా. మధ్య తరగతి వాళ్ళు సంపాదించినది వీలైనంత మిగిల్చి ఇల్లు కొంటారు. పేదలు కుదిరింది ఖర్చు చేసి, ప్రభుత్వం అందించే సహాయం దొరికిన వారు లాభపడతారు లేనివారు అలాగే రెక్కాడితే డొక్కాడని స్థితిలో ఉండిపోతారు.

ధనికాదాయ, ఔత్సాహిక మధ్యతరగతి వర్గం పరిశ్రమలు వగైరా పెడితే వారు సంపాదించి, కొన్ని ఉద్యోగాలు సృష్టించి పన్నులు కడుతుంటారు. ధనిక వర్గంలో కూడా కొందరు ఉన్న ఆస్తుల అద్దెల మీద బ్రతికేస్తుంటారు. కాని మన సమస్య వర్గం మొత్తం గురించే కాని వ్యక్తుల గురించి కాదు , అన్ని వర్గాల్లోనూ కష్టించేవారు వ్యసనపరులు సోమరులు ఉండడం మానవ సహజం.

ఏతావాతా చెప్పేది ఏంటంటే దేశం ఎదిగినంతసేపూ అప్పు భారం ఏ ఒక్కరి మీదో పడదు. అసలా అప్పే మన సామాన్యుల వృద్ధికి కావాల్సిన మౌలిక వనరులు ఉద్యోగాలు సృష్టిస్తుంది. ఐనా కూడా ఒకరిని ఎత్తి చూపాలంటే ఆదాయంలో వాటా పరంగా పరోక్ష పన్నులు రూపంలో వ్యక్తిగతంగా పేదల మీద, దేశ ఆదాయంలో వాటా పరంగా ఐతే ప్రత్యక్ష, కార్పొరేట్ పన్ను రూపంలో ధనికాదాయ వర్గం మీద భారం అధికం.

ప్రత్యూష
https://qr.ae/pykLvd

## 1990-91 భారత దేశ ఆర్థిక సంక్షోభం గురించి కారణాలు, సంస్కరణలు సహా తెలుపగలరా?

1991 మన దేశానికి కైరోస్(Kairos)* అనుకోవచ్చు. మన ఆధునిక ఆర్థిక చరిత్రను 1991 ముందు, తరువాతగా మాట్లాడుకోవాలి. ఆ దశలో మనం సంక్షోభ వలలో చిక్కుకున్నప్పటికీ దాన్ని ఒక అవకాశంగా మలుచుకోగలిగాం.

> *In a crisis, be aware of the danger--but recognize the opportunity. -JFK*
> *సంక్షోభ సమయంలో అపాయం గురించి జాగ్రత్తగా ఉంటూనే అవకాశాన్ని ఒడిసిపట్టగలగాలి.*

**మనకు వచ్చిన ఇబ్బంది ఏంటి?**
నికర చెల్లింపుల సంక్షోభాన్ని (BoP - Balance of Payments Crisis) ఎదుర్కొన్నాం. అంటే ఏమిటి?

మన దిగుమతులకు చెల్లింపులు చేయటానికి ఎగుమతులు, విదేశీ మారక ద్రవ్య నిలువల (Forex Reserves) సంపాదన చాలని పరిస్థితి. ఆగష్టు 1990 నాటికి 3.11 బిలియన్ డాలర్లు ఉన్న విదేశీ మారక ద్రవ్య నిలువలు జనవరి 1991కల్లా 896 మిలియన్ డాలర్లకు పడిపోయాయి.

మనకు ఉన్న నిలువలతో మరో రెండు వారాలు మాత్రమే దిగుమతుల చెల్లింపులు చేయగల పరిస్థితి. అప్పటి ప్రమాణాల ప్రకారం కనీసం మూడు నెలల నిలువలు ఉంటే చీకు చింత అక్కర్లేదు. ఇలా ఎన్ని రోజులకి సరిపడా నిలువలు ఉన్నాయన్న విషయాన్ని ఇంపోర్ట్ కవర్ అంటారు. ప్రస్తుతం మన ఇంపోర్ట్ కవర్ అటుఇటుగా ఒక సంవత్సరం ఉంటోంది.

**ఈ సంక్షోభానికి కారణాలేంటి?**
కర్ణుడి చావుకు సవాలక్ష కారణాలన్నట్టు, అప్పట్లో దేశాన్ని ముసిరిన జటిల పరిస్థితులివి:

1. 1985 నుంచే మనకు నికర చెల్లింపులకు సంబంధించిన ఇబ్బందులు ఉండేవి. అవి 1991 వచ్చే సరికి చిలికి చిలికి గాలివానగా మారాయి.
2. గల్ఫ్ యుద్ధం(Gulf War) వలన చమురు ధరలు అపారంగా పెరగడం.
3. వేల కొద్ది వలస ఉద్యోగులను వెనక్కి తీసుకురావాల్సి వచ్చింది. అంచేత వారు సంపాదించే విదేశీ మారక ద్రవ్యాలు పోయాయి.
4. అస్థిర ప్రభుత్వం చలువతో రాజకీయ పరిస్థితులు కూడా అంతంత మాత్రమే. పైగా మండల్ కమిషన్ సూచనలకు వ్యతిరేకంగా విస్తృతంగా ఆందోళనలు జరిగాయి.
5. 1986–89 మధ్యలో వడ్డీ రేట్లు తక్కువగా ఉండేసరికి ఆనాటి ప్రభుత్వం స్వల్పకాల రుణాలు తీసుకుంది. ఆ రుణాల చెల్లింపుల ఒత్తిడి 1991లో గొంతు మీదకు వచ్చిపడింది.
6. ద్రవ్యోల్బణం కూడా పై వాటితో సరితూగే ఇబ్బందే. 1985–90 సమయంలో సగటుగా 6.7% ఉన్న ద్రవ్యోల్బణం 1990–91 ఆర్థిక సంవత్సరానికి 10.3% తాకి, ఆగష్టు 1991 నాటికి

16.7% చేరుకుంది. దీని వలన ఎగుమతులు ఖరీదు అయ్యి, విదేశీయులు మన దగ్గర కొనటానికి మొగ్గు చూపని పరిస్థితి.

7. ఇలాంటి పరిస్థితుల్లో ప్రవాస భారతీయులు ఇక్కడ దాచుకున్న డబ్బును వెనక్కి తీసేసుకోవటం మొదలెట్టారు.

ఈ క్లిష్ట పరిస్థితులు మొదలయ్యాక మొదట వీపీ సింగ్, చంద్రశేఖర్ ప్రధాన మంత్రులుగా ఉన్నారు. చంద్రశేఖర్‌గారు, ఇంకా అప్పటి ఆర్థిక మంత్రి యశ్వంత్ సిన్హా ఆర్బీఐ(RBI) సలహా మేరకు మన బంగారం నిలువల్లో కొంత భాగాన్ని విదేశీ బ్యాంకులకు పంపి డబ్బు తీసుకొచ్చారు. తరువాతి ప్రభుత్వం కూడా ఈ పనిని కొనసాగించింది.

1991లో చంద్రశేఖర్ ప్రభుత్వం కూలిపోవటంతో మళ్ళీ ఎన్నికలు జరిగాయి. ఈ ఎన్నికల్లో కాంగ్రెస్ పార్టీ గెలిచి, 21 జూన్ 1991న పి.వి.నరసింహారావుగారు ప్రధానిగాను, మరుసటి రోజున మన్మోహన్ సింగ్‌గారు  ఆర్థిక మంత్రిగాను ప్రమాణ స్వీకారం చేసారు.



24 జులై 1991న మన్మోహన్ సింగ్‌గారు  దేశ చరిత్రలో సువర్ణ అక్షరాలతో నిలిచే బడ్జెట్ ప్రసంగం ఇచ్చారు. అయితే మెరుస్తున్నా కూడా బంగారం అని తెలుసుకోలేని మూర్ఖులు, 'మెరిసేవన్నీ బంగారం అవుతాయా?!' అని అడిగే నిరాశావాదులు ఎప్పుడూ ఉంటారుగా. ఎవరు ఏమి అనుకున్నా ప్రసంగం చివర్లో మన్మోహన్ సింగ్‌గారు  చెప్పినట్టు:

> *No power on earth can stop an idea whose time has come.  -Victor Hugo*
> *తన సమయం ఆసన్నమైన ఆలోచనను లోకంలో ఏ శక్తీ ఆపలేదు.*

బడ్జెట్‌కు ముందు, బడ్జెట్లో, తర్వాత కూడా వ్యవస్థను దారిలో పెట్టటానికి చాలా పనులు చేసారు. వాటిలో ముఖ్యమైనవి:

- రూపాయి విలువ తగ్గింపు(Devaluation). ఇది రెండు విడతల్లో చేసారు (మొదటిసారి 9%, తరువాత 11%).
- కొత్త వాణిజ్య పాలసీ ప్రవేశపెట్టారు - అనవసరమైన నియంత్రణలు తీసేసారు, లైసెన్స్ పద్ధతులని సులభం చేసారు, అవసరం లేని దిగుమతులు తగ్గించే ప్రక్రియ మొదలెట్టారు.

- ఇంటర్నేషనల్ మానిటరీ ఫండ్(IMF) నుంచి అత్యవసర రుణం తీసుకున్నారు.
- కొత్త పారిశ్రామిక పాలసీ తీసుకొచ్చారు. దీనితో ప్రభుత్వానికే ఏకఛత్రాధిపత్యం ఉన్న కొన్ని రంగాలలోకి ప్రైవేట్ వారిని అనుమతించారు. అంతే కాక ఔత్సాహికులు పారిశ్రామిక/వ్యాపార రంగాల్లోకి రావటం తేలిక చేసే పని చేపట్టారు.
- విదేశీ పెట్టుబడుల నియమాలు, పద్ధతులు వ్యాపారస్తులకు అనుకూలంగా మార్చారు.
- ఎరువులు, వంట గ్యాస్, పెట్రోల్ ధరలు పెంచారు. అలాగే పంచదార మీద సబ్సిడీ ఎత్తివేసారు.

ఈ అడుగులన్నిటిని మూడు భాగాలుగా విభజించవచ్చు.

1. సరళీకరణ (Liberalisation): ఆర్థిక కార్యకలాపాలు సుగమం చేసేందుకు విధివిధానాలు అనుకూలంగా ఉండేట్టు చేయటం.
2. ప్రైవేటీకరణ (Privatisation): ప్రభుత్వ యాజమాన్యంలోని ఆస్తులను, వ్యాపారాలను ప్రైవేటు సంస్థలకు అమ్మటం.
3. ప్రపంచీకరణ (Globalisation): ఆర్థిక కార్యకలాపాలు/లావాదేవీలు దేశ భేదాలు లేకుండా జరిగేట్టు చూడటం.

వీటినే LPG రిఫార్మ్స్/సంస్కరణలు అంటారు. రమారమి 29 సంవత్సరాల క్రితం మొదలైన ప్రక్రియ ఇంకా కొనసాగుతూనే ఉంది.

**IMF పాత్ర ఎంత?**




IMF ఇటువంటి పరిస్థితుల్లో అప్పు ఇస్తే కొన్ని షరతులు విధిస్తుందనేది నిజమే. ఆ షరతులు పైన చెప్పిన LPG తరహాలోనే ఉంటాయి.

కానీ మన సంస్కరణలకు పూర్తిగా IMFయే కారణం అని చెప్పలేము. ఎందుకంటే ఆ సంస్కరణల బీజాలు 1985 నుంచే ఉన్నాయి. నెమ్మదిగా, జంకుతూ ఏవో చేస్తూ ఉన్నారు. అయితే నిలకడగా, చిత్తశుద్ధితో చేపట్టింది మాత్రం 1991 తరువాతే. ఇదే కాకుండా నిజంగా IMF ఒత్తిడి ఒక్కటే కారణం అయితే ఇన్ని సంవత్సరాలు ఇదే బాటలో వెళ్ళేవారు అని నేను అనుకోను.

> *Men make their own history, but they do not make it as they please; they do not make it under self-selected circumstances, but under circumstances existing already, given and transmitted from the past. -Karl Marx*
> *మనుషులు తమ చరిత్రను తామే సృష్టించుకోగలరు కానీ తమకు నచ్చినట్టు కాదు, తమకు అనువైన పరిస్థితుల్లోనూ కాదు కానీ అప్పటికే ఉన్న, గతం ఆపాదించిన పరిస్థితుల్లో మాత్రమే.*

సమాధానంలోని చిత్రాలన్నీ జైరామ్ రమేశ్‌గారు రచించిన "To The Brink And Back" పుస్తకంలోనివి.

*Kairos - ఓ బృహత్తర కార్యానికి సమయసందర్భాలు అనుకూలించే అరుదైన తరుణం.

ప్రమోద్ చల్లా
https://qr.ae/pykj2

# సైన్స్

## 40,000 అడుగుల కన్నా లోతుగా భూమిలో రంధ్రం ఎందుకు తవ్వకూడదు?

40000 అడుగులంటూ ప్రత్యేకంగా కారణమేమీ లేదు. ప్రస్తుతానికి మన సాంకేతికత చేరుకోగల దూరం అంతే.
భూమి పూర్తి వ్యాసార్థం సుమారు 6400 కిలోమీటర్లు. ఇందులో ముఖ్యంగా భూపటలం (Crust) అనబడే భూమి పై-పొర ఖండాలపై 40–70 కిలోమీటర్లు మరియు సముద్రంలో 6–7 కిలోమీటర్ల మందంగా ఉంటుంది.




*మూలం: https://simple.wikipedia.org/wiki/Structure_of_the_Earth*

ప్రస్తుతానికి మానవుడు చేరుకున్నది 40000 వేల అడుగులు (సుమారు 12 కిలోమీటర్లు) మాత్రమే.
భూమిలో అత్యంత లోతైన రంధ్రాలు:

1. "కోలా సూపర్ డీప్ బోర్ హోల్" (రష్యా:1984) - 40230 అడుగులు
2. "Z-44 చేవో వెల్" (రష్యా: 2008) - 40600 అడుగులు
3. "BD-04A" ( కతర్: 2008) - 40318 అడుగులు.

మన దేశం విషయానికి వస్తే ఓఎన్జీసీ కేజీ బేసిన్లో తవ్విన NA7–1 (10,385 అడుగులు: 3.16 కి.మీ) అనేది ఇప్పటి వరకు లోతైన రంధ్రం.

ఘనరూపంలో ఉన్న భూమిలోని పొరలు ఎంతో దృఢంగా ఉంటాయి. వీటిని వైజ్ఞానికపరంగా అధ్యయనం చేయడానికి ఉన్న ఉత్తమ మార్గం డ్రిల్లింగ్. ఉదాహరణకు భూమి కేంద్రం వరకు రంధ్రం చెయ్యాలనే ప్రయత్నం మొదలు పెట్టామనుకుందాం...

భూమి గుండా డ్రిల్లింగ్ చెయ్యడమనేది సాధారణ విషయం కాదు. ఎంతో ఖర్చు, భారీ పరికరాలు, మానవ శక్తి అవసరమవుతాయి. ఇందులో అడుగడుగునా అనేక ప్రమాదాలు పొంచి ఉంటాయి.

సగటున ఒక చమురు బావి తవ్వే డ్రిల్ బిట్ గంటకు 7 మీటర్లు మాత్రమే చొచ్చుకుపోగలుగుతుంది. ఒకరోజ డ్రిల్లింగ్ చేయడానికి కొన్ని లక్షలు ఖర్చు అవుతుంది. సముద్రంలో ఆ ఖర్చు మరింత ఎక్కువ, ఇంకా ప్రమాదాలు జరిగే అవకాశం కూడా ఎక్కువే. ఈ విధంగా చూసుకుంటే భూమి కేంద్రం వరకూ చేరుకోడానికి ఎంత సమయం పడుతుంది? ఎంత ఖర్చు అవుతుంది?

డ్రిల్లింగ్ చేసేటప్పుడు ఏర్పడే ఘర్షణ వల్ల ఉత్పన్నమయ్యే ఉష్ణాన్ని చల్లబరచడానికి, ఆ ఘర్షణకు కందెనగా (Lubricant) ఉపయోగపడటానికి, భూమి అంతర్భాగంలోని ద్రవాల(నీరు, చమురు, సహజ వాయువులు) వల్ల ఏర్పడే ఒత్తిడిని అధిగమించడానికి Drilling Mud అనే ఒక రకమైన బురద లాంటి పదార్థాన్ని ఎల్లప్పుడూ పంపు చేయవలసి వస్తుంది. ఈ పంపిణీలో ఏ మాత్రం తేడా జరిగినా మొత్తం బ్లో-అవుట్ జరిగే ప్రమాదం ఉంది. ఎక్కువ లోతు తవ్వుతున్నప్పుడు అంత ఎక్కువ Drilling Mudని నిర్వహించడం చాలా కష్టం, ఖరీదైన విషయం.

భూమి లోతులోకి వెళ్ళేకొద్దీ ఉష్ణోగ్రత ప్రతీ కిలోమీటరుకు 25–30 డిగ్రీలు(సెల్సియస్) పెరుగుతూ ఉంటుంది. ఉపరితలంపై 28 డిగ్రీల ఉష్ణోగ్రత ఉందనుకుంటే కేంద్రం వద్ద 6000 డిగ్రీలకు చేరుకుంటుంది. ఇంత ఉష్ణాన్ని తట్టుకొనే పదార్థం ప్రపంచంలో ఎక్కడా లేదు.

డ్రిల్లింగ్ ని ఒక పద్ధతి ప్రకారంగా చేస్తారు. మొదట కొంత దూరం డ్రిల్ చేసిన తరువాత రంధ్రం ఎక్కడా మూసుకుపోకుండా ఉండటానికి స్టీల్ పైపు వేస్తారు. ఈ ప్రక్రియను కేసింగ్ అంటారు. కేసింగ్ వేసాక అందులో సిమెంట్ పంపించి కేసింగ్ మరియు రంధ్రం యొక్క గోడల మధ్య ఖాళీని సిమెంట్ తో నింపుతారు. ఈ ప్రక్రియను సిమెంటింగ్ అంటారు. సిమెంట్ గట్టిపడ్డాక కేసింగ్ తీసేసి మళ్ళీ డ్రిల్లింగ్ మొదలుపెడతారు. ఇది నిరంతరం జరుగుతూ ఉంటుంది. అంత పొడుగు పైపులు ఎక్కడ నుండి తీసుకురాగలం? మరియు లోతుకు వెళ్ళేటప్పుడు అక్కడి భౌతిక పరిస్థితుల వల్ల ఈ పదార్థ ధర్మాలు మారిపోయి, పాడయిపోయే ప్రమాదం ఉంది.

డ్రిల్లింగ్ జరుగుతుండగా మధ్యలో డ్రిల్ బిట్ పాడవ్వచ్చు, drilling mud ప్రవాహం వల్ల అప్పటికే ఉన్న సిమెంటు కొట్టుకుపోవచ్చు, ఇలాంటి ప్రమాదాలు ఎన్నో జరగచ్చు. ఎక్కడ ప్రమాదం జరిగిందో తెలుసుకుని సకాలంలో స్పందించడం చాలా కష్టం.

మామూలుగా చమురు, సహజవాయు నిక్షేపాల కోసం తవ్వే బావులు గరిష్టంగా 4–5 కిలోమీటర్ల లోతు ఉంటాయి. డ్రిల్లింగ్ చేసేముందు ఎంతో ప్రణాళిక వేసుకొని పని మొదలుపెట్టినా ఏదొక రూపంలో ఇబ్బందులు తలెత్తుతాయి. వీటిని అత్యంత జాగ్రత్తగా పర్యవేక్షిస్తుండాలి. క్షణకాలం నిర్లక్ష్యం వల్ల కొన్ని కోట్ల రూపాయల ఆస్తి నష్టం మరియు రిగ్గులో పని చేసేవారి ప్రాణాలకే ప్రమాదం.

**భూగర్భ జలాలు** గరిష్టంగా 1200 అడుగులు (300మీ) వరకు లభిస్తాయి.
**ఖనిజాలు** 0–1500 మీటర్ల మధ్యలో లభిస్తాయి.
**చమురు** 1 కి.మీ నుండి 5 కి.మీ మధ్య లోతులో లభిస్తుంది.

---

**సహజ వాయువు (జీవజన్య)** 0 నుండి 1 కి.మీ మధ్యలో లభిస్తుంది.
**సహజ వాయువు (ఉష్ణజన్య)** 3 నుండి 6 కి.మీ మధ్యలో లభిస్తుంది.

దీన్ని బట్టి చూస్తే మనకు కావలసిన సహజ వనరులన్నీ భూ ఉపరితలం నుండి పది కిలోమీటర్ల లోతులోనే లభిస్తున్నాయి. మరింత దూరం వెళ్ళాల్సిన అవసరం లేదు.

భూపటలం (CRUST) యొక్క అమరిక అస్తవ్యస్తంగా, విజాతీయంగా (In-homogeneous) ఉండి ప్రాంతాన్ని బట్టి దాని కూర్పులో తేడాలు వస్తాయి. ఇక్కడ ఉన్నట్టు పది కిలోమీటర్ల ఆవల ఉండదు. సముద్రంలో ఒకలా ఉంటుంది, ఖండాలపై వేరే విధంగా ఉంటుంది. మరీ ముఖ్యంగా మొదటి 10 కిలోమీటర్ల మేర జమ కాబడిన అవక్షేపాలు (Sediments) మరింత క్లిష్టంగా, పొరలుగా ఉంటాయి. టెక్టోనిక్ ప్లేట్ల కదలికలు, వాతావరణ మార్పుల ద్వారా వాటి నిర్మాణాల్లో తేడాలు ఉంటాయి. అందువల్ల కేవలం ఒక్క చోట రంధ్రం చేయడం వల్ల ఎక్కువ సమాచారం లభించదు.

**మరి భూమి లోపలి పొరల గురించి మనకు ఎలా తెలిసిందనే సందేహాలు రావచ్చు.**

అగ్ని పర్వతాలు బద్ధలయినప్పుడు భూగర్భం నుండి ఎగసిపడి, భూ ఉపరితలం చేరుకొనే శిలాద్రవం నుండి కొంత సమాచారం లభిస్తుంది. టెక్టానిక్ ప్లేట్లు కలుసుకొనే చోట దొరికే రాళ్ళ నుండి కూడా విలువైన సమాచారం లభిస్తుంది.

భూకంపం ఏర్పడిన ప్రదేశం నుండి వెలువడే వివిధ కంపన తరంగాలు వివిధ వేగాలతో భూ అంతర్భాగంలో ప్రయాణిస్తాయి. ఈ ప్రయాణ వేగాల్లో వ్యత్యాసాలను గమనించి భూమి లోపలి పొరల గురించి తెలుసుకుంటారు.

సహజంగా ఏర్పడ్డ భూకంపాల నుండే కాకుండా కృత్రిమంగా భూకంపాలను డైనమైట్లు, వైబ్రేటర్ల ద్వారా సృష్టించి, ఆ కంపన తరంగాల ప్రయాణ కాలం మరియు ప్రయాణ వేగాల నుండి భూగర్భ నిర్మాణాలను 2D లేదా 3D లో ఒక ఎక్స్-రే లాంటి చిత్రంగా తయారు చేస్తారు.

హైడ్రోకర్బన నిక్షేపాల అన్వేషణలో ఈ చిత్రం నుండి ఎక్కడ డ్రిల్లింగ్ చెయ్యాలి, ఎంత లోతులో చెయ్యాలి, ఏ దిశలో డ్రిల్లింగ్ చెయ్యాలనే కీలకమైన నిర్ణయాలను తీసుకుంటారు.

భూగర్భం గురించి చాలా వరకు సమాచారం భూమిలో రంధ్రం చెయ్యకుండానే తెలుస్తుంది. కానీ ఆ విషయాలను ధృవీకరించడానికి డ్రిల్లింగ్ చెయ్యాల్సి వస్తుంది.

ఆఖరుగా.. భూగర్భంలో పూర్తిగా రంధ్రం చెయ్యాలనుకోవడం సాధ్యం కాని విషయం, అనవసరం కూడా.

ప్రసాదరాజు
https://qr.ae/pyMkDO

---

## భారతానికి ఉత్తరాన హిమాలయాలు ఎలా ఏర్పడ్డాయి?

మూడు వందల మిలియన్ ఏళ్ల క్రిందటి మాట!
అంటే 30 కోట్ల సంవత్సరాల క్రితం...

అనగనగా ఒక పేద్ద కుటుంబం. ఆ కుటుంబం ఎంతో కలిసి మెలసి సంతోషంగా జీవిస్తుండే వారు. ఎప్పుడూ ఒకర్నొకరు గట్టిగా హత్తుకునేంత గాఢమైన ప్రేమ వారి మధ్య ఉండేది. మరి అంత సంతోషంగా జీవిస్తున్న కుటుంబం అంటే విలన్లకి కళ్ళు కుడతాయి కదా... ఈ విలన్ బాగా శక్తిమంతుడు.

ఆ మాటలూ, ఈ మాటలూ చెప్పి కుటుంబం మధ్య చిచ్చు పెట్టాడు. ఫలితంగా కుటుంబం రెండు కింద చీలిపోయింది. అంతటితో ఆగకుండా విలన్ మళ్లీ ఆ రెండు కుటుంబాల్లో విడిగా దూరి ఒకరంటే ఒకరికి పడనీకుండా చేసాడు. ఈ రెండు కుటుంబాలూ అప్పుడంలా మరిన్ని ముక్కలయ్యి ఎవరికి వారు బ్రతుకుతెరువుకి తలో దిక్కుకు పోవడానికి సిద్ధమయ్యారు. వీరి మధ్యలో ఒక కుటుంబం తల్లి అనంతమ్మ, తండ్రి అప్పయ్య, పిల్లాడు భరత్.

'నీకు ఈ గొడవలన్నీ ఎందుకు, పట్నమెళ్ళి ఏదో పని చేసుకో నాయనా' అని తల్లిదండ్రులు చెప్పడంతో ఒంటరి ప్రయాణం మొదలు పెట్టాడు భరత్.

భరత్ ఉత్తరం వైపు బయల్దేరాడు. ఒకటా రెండా... 10 కోట్ల సంవత్సరాల పాటు గొప్ప సాహస యాత్ర చేసాడు. ఎన్నో ఒడిదుడుకులు ఎదుర్కొని మొత్తానికి ఐదు కోట్ల ఏళ్ళ క్రితం తీరం చేరాడు. అక్కడ ఒక పెద్దన్నని ఢీకొని దందా మొదలు పెట్టాడు. దినదినాభివృద్ధి గడించాడు. ఈ ఐదు కోట్ల ఏళ్ల వ్యాపార అనుభవంతో ప్రపంచంలో అతిపెద్ద ధనవంతుల జాబితాలో మొదటి స్థానం సంపాదించుకున్నాడు. ప్రపంచం మొత్తం అటువైపు చూసేలా ఎంతో ఎత్తుకు ఎదిగిపోయాడు. ఎంత ఎదిగినా పెద్దన్న మీద మాత్రం ఇంకా ఆధిపత్యం ప్రదర్శించాలనే చూస్తున్నాడు.

ఇదేదో సినిమా కథ లాగా ఉంది కదా..

ఈ కథలో పెద్ద కుటుంబం- ప్యాంజియా (మహా ఖండం)
చిచ్చు- టెక్టానిక్స్
విలన్- భూగర్భంలో ఉష్ణ సంవాహన ప్రవాహాలు.
రెండు కుటుంబాలు - లోరేషియా, గోండ్వానా.
అప్పయ్య- ఆఫ్రికా(మడగాస్కర్), అనంతమ్మ- అంటార్కిటికా
భరత్ - భారత ఫలక.
పెద్దన్న- యురేషియన్ ఫలక.
ధనవంతుల జాబితాలో మొదటి స్థానం - హిమాలయాలు, ఎవరెస్టు ఎత్తు.

కథ పేరు - ప్లేట్ టెక్టానిక్స్.




*మూలం: https://popperfont.net/2012/07/25/pangaea-when-the-continents-were-cuddling/*

4.5 బిలియన్ సంవత్సరాల క్రితం భూమి ఏర్పడినప్పుడు భూమి నిండా శిలాద్రవం పొయ్యి మీద పులుసు మరిగినట్టు మరిగేది. క్రమంగా భూ ఉపరితలం మీద వాతావరణం చల్లబడటంతో పైన పొర మాత్రం గట్టిబడి లోపల మరుగుతున్న శిలాద్రవం అలానే ద్రవరూపంలోనే ఉండిపోయింది. ఈ గట్టి పొరను Lithosphere అందాం. ఈ Lithosphere మందం 200 కిలోమీటర్లు.

భూమి అంతర్భాగంలో లోపలికి వెళ్ళేకొద్దీ ఉష్ణోగ్రత పెరుగుతూ ఉంటుంది. దీన్ని భూ-ఉష్ణప్రవణత (Geothermal gradient) అంటారు. ఉష్ణోగ్రత ప్రవణత వల్ల శిలాద్రవం ఒకచోట స్థిరంగా ఉండక పైకి కిందకీ చక్రంలా తిరుగుతుంది. వీటిని ఉష్ణ సంవాహన ప్రవాహాలు అంటారు. భూగర్భంలో ఉష్ణ సంవాహక ప్రవాహాలు Lithosphereని కొన్ని బలహీన ప్రదేశాల్లో చీలికలు చేశాయి. ఇలా చీలికలు కాబడ్డ భారీ వైశాల్యం కలిగిన ఒక్కొక ముక్కని 'టెక్టానిక్ ఫలక' అంటారు. టెక్టానిక్ ఫలకలు కంటికి కనిపించనంత సూక్ష్మ వేగంతో చలనంలో ఉంటాయి. వీటి వేగం మనిషి గోళ్ళు పెరిగే వేగంతో సమానం అంటుంటారు.

ఫలకలు వివిధ దిశల్లో కదులుతూ అంచుల వద్ద ఒకదానికొకటి గుద్దుకోవచ్చు, దూరంగా జరగొచ్చు లేదా సమాంతరంగా కదలవచ్చు. ఒక గది నిండా జనాల్ని కుక్కి తలుపేసేస్తే ఎలా తోసుకుంటారో ఈ ఫలకల పరిస్థితి కూడా అంతే. భూమి పైపొర గట్టి పడినప్పటి నుండి ఈ పలకలు ఒకదానికొకటి దూరం జరుగుతూ, దగ్గరవుతూ ఉన్నాయి. దూరం జరిగినప్పుడల్లా ఆ ఖాళీలో సముద్రం ఏర్పడుతుంది. దగ్గరికొచ్చినప్పుడు సముద్రం మూసుకుపోతుంది. ఇలా సముద్రాలు తెరుచుకోవడం, మూసుకుపోవడాన్నే విల్సన్ చక్రం అంటారు.




*మూలం:*
*https://www.researchgate.net/publication/260546325_Mapping_The_Surface_of_the_Moon_Learning_Objectives*

ఇలా అన్ని ఫలకలు ఒకేసారి దగ్గరికి చేరినప్పుడు 'మహాఖండం' అనబడే భారీ టెక్టానిక్ ఫలక ఏర్పడుతుంది. మహాఖండాన్ని చుట్టుముట్టిన సముద్రాన్ని 'మహా మహాసముద్రం' అందాం. భూమి ఆవిర్భావం నుండి ప్రస్తుత సమయం వరకు 7 మహాఖండాలు ఏర్పడ్డాయి, అలానే విడిపోతూ వచ్చాయి కూడా. వీటిలో అత్యంత ఇటీవలి మహాఖండం 'ప్యాంజియా' 30 కోట్ల సంవత్సరాల క్రితం ఏర్పడింది. ప్యాంజియా చుట్టూ ఉన్న మహా మహాసముద్రం 'పాంతలెస్సా'.

200 మిలియన్ సంవత్సరాల క్రితం ఈ మహాఖండం 'లోరేషియా', 'గోండ్వానా' అనే రెండు పెద్ద ఖండాలుగా విడిపోయింది. ప్రస్తుత కాలానికి అవి ఏడు ఖండాలు, ఐదు మహా సముద్రాలుగా మారాయి. టెక్టానిక్ ఫలకల కదలికల సమాచారం నుండి వాటి భవిష్యత్ స్థానాలను అంచనా వేస్తారు. రాబోయే 10 మిలియన్ సంవత్సరాలలో ఆఫ్రికా ఖండం నుండి తూర్పు ఆఫ్రికా విడిపోయి అక్కడ ఒక కొత్త సముద్రం ఏర్పడనుంది, యాభై మిలియన్ సంవత్సరాల తర్వాత అది యురేషియన్ ప్లేటును ఢీకొంటుందని అంచనా.

సులభంగా చెప్పాలి అంటే టెక్టానిక్ ఫలకలు నిత్యం చలనంలో ఉంటాయి, ఈ చలనం చాలా నెమ్మదిగా జరుగుతుంది, ఫలకలు ఒకదానితో ఒకటి దోబూచులాడుకున్నప్పుడు భౌగోళికంగా భారీ మార్పులు చోటు చేసుకుంటాయి. భూకంపాలు, సముద్రాలు తెరుచుకోవడం మూసుకుపోవడం, పర్వత శ్రేణులు ఏర్పడటం అన్నీ టెక్టానిక్ చలనాల వల్లే జరుగుతున్నాయి.

**భారత ఫలక(Indian plate) కథ:**

250 మిలియన్ సంవత్సరాల క్రితం మహాఖండం పాంజీయా ఉన్న సమయంలో భారత భూభాగం పశ్చిమాన ఆఫ్రికాతోనూ, తూర్పున అంటార్కిటికాతోనూ, ఈశాన్యాన ఆస్ట్రేలియాతోనూ కలిసి ఉండేది. అక్కడి నుండి 50మిలియన్ సంవత్సాలు గడిచాక, అంటే 200 మిలియన్ సంవత్సరాల క్రితం

మహాఖండం 'లారేషియా', 'గోండ్వానా' ఖండాలుగా విడిపోయాయి.లారేషియాలో ఉన్న ప్రస్తుత ప్రదేశాలు- ఉత్తర అమెరికా, యూరేషియా, గ్రీన్ లాండ్. గోండ్వానాలో ఉన్న ప్రస్తుత ప్రదేశాలు- దక్షిణ అమెరికా, ఇండియా, ఆఫ్రికా, అంటార్కిటికా, ఆస్ట్రేలియా.

180–170 మిలియన్ సంవత్సరాల క్రితం ఆఫ్రికా నుండి దక్షిణ అమెరికా విడిపోయింది. 140 మిలియన్ సంవత్సరాల క్రితం గోండ్వానాలో భారత భూభాగం ఆకృతి చీలిక జరిగింది.100 మిలియన్ సంవత్సరాల క్రితం భారత భూభాగం చుట్టు పక్కల పలకల నుండి వేరుచేయబడి ఒంటరిగా ఉత్తరం వైపు(కొద్దిగా ఈశాన్యం వైపు అనుకోవచ్చు) కదలనారంభించింది. ఈ చలనం వేగంగానూ (సంవత్సరానికి సుమారు 15 సెంటీమీటర్ల వేగం), శిలాద్రవ ప్రవాహాల మధ్యన, హాట్ స్పాట్లు అనబడే కురుపుల్లాంటి అగ్నిపర్వతాలను ఢీకొంటూ దాదాపు 6400 కిలోమీటర్ల దూరం జరిగింది.




*మూలం: https://www.livescience.com/38218-facts-about-pangaea.html*

50 మిలియన్ సంవత్సరాల క్రితం ఉత్తరం వైపు ప్రయాణిస్తున్న భారత ఫలక యొక్క ఉత్తర, ఈశాన్య భాగం యూరేషియాని ఢీకొట్టగానే ఆ ఒత్తిడిని విడుదల చేసే క్రమంలో భూభాగం మొత్తం పైకి నెట్టబడింది. మధ్యలో టెథిస్ సముద్రం మూసుకుపోయింది. అప్పటి వరకు వేగంగా ప్రయాణిస్తున్న భారత ఫలక వేగం 15 సెం.మీ/సం నుండి 9 సెం.మీ/సం వరకు తగ్గిపోయింది. ఆ క్షణం నుండి అక్కడ భూభాగం ఎత్తు పెరుగుతూ వస్తుంది.

ప్రస్తుత భారత ఫలక వేగం ఉత్తరం వైపు సుమారు 2సెం.మీ./సం కాగా, యురేషియన్ ప్లేటు వేగం ఉత్తరం వైపు 0.78 సెం.మీ/సం. అంటే, భారత ఫలక యురేషియా మీద ఇంకా ఒత్తిడి కలగజేస్తూనే ఉంది. దీని మూలంగా ఈ మొత్తం ప్రాంతం క్రియాశీలంగా ఉంటూ తరచుగా భూకంపాలు సంభవిస్తుంటాయి. హిమాలయాలు అన్ని పర్వత శ్రేణులకన్నా ఇటీవలే ఏర్పడటం వల్ల చురుగ్గా ఉంటూ ఏడాదికి సెంటీమీటర్ పైనే ఎత్తు పెరుగుతున్నాయి. సమయం గడిచే కొద్దీ ఈ చురుకుదనం తగ్గిపోతుండవచ్చు.

భారత ఫలక ఢీకొన్నప్పుడు జరిగిన తాకిడికి ఇక్కడ భూభాగం ముడతలు పడింది. అందుకే హిమాలయాలను 'ముడత పర్వతాలు(Folded mountains)' అంటారు. ఖండాలు ఢీకొనే ప్రక్రియకు హిమాలయాలు గొప్ప ఉదాహరణ. ఈ ప్రక్రియని 'Orogeny' అంటారు. ఈ ప్రదేశంలో ఒక ఫలకపై మరొక ఫలక చేరి అక్కడ భూమి పైపొర రెండింతలు మందంగా తయారవుతుంది. యూరప్ లోని 'ఆల్ప్స్' పర్వతాలు కూడా 'Orogeny' ప్రక్రియ ద్వారానే ఏర్పడ్డాయి. ఇక్కడ యూరోపియన్ ఫలకని ఆఫ్రికన్ ఫలక ఢీకొట్టింది.

హిమాలయాలు ఏర్పడక ముందు అక్కడ సముద్రం ఉండేదన్నట్టు రుజువుగా అక్కడ సున్నపురాయిలో సముద్ర జీవుల శిలాజాలు దొరికాయట. ఖండాలు ఢీకొనే ప్రక్రియకు హిమాలయాలు గొప్ప ఉదాహరణ. ఈ ప్రక్రియని 'Orogeny' అంటారు. ఈ ప్రదేశంలో ఒక ఫలకపై మరొక ఫలక చేరి అక్కడ భూమి పైపొర రెండింతలు మందంగా తయారవుతుంది. యూరప్లోని 'ఆల్ప్స్' పర్వతాలు కూడా 'Orogeny' ప్రక్రియ ద్వారానే ఏర్పడ్డాయి. ఇక్కడ యూరోపియన్ ఫలకని ఆఫ్రికన్ ఫలక ఢీకొట్టింది. హిమాలయాలు ఏర్పడక ముందు అక్కడ సముద్రం ఉండేదన్నట్టు రుజువుగా అక్కడ సున్నపురాయిలో సముద్ర జీవుల శిలాజాలు దొరికాయట.

ప్రసాదరాజు
https://qr.ae/pyMMPc

## రైల్వే స్టేషన్లలో ఊరు పేరు తెలిపే పసుపు రంగు బోర్డుపై సముద్రమట్టానికి ఆ ఊరు ఎంత ఎత్తులో ఉన్నదీ ఎందుకు రాస్తారు?




MSL(Mean Sea Level) అంటే సరాసరి/సగటు సముద్ర మట్టం. ప్రపంచంలో అంతో ఇంతో పెద్దగా తేడాలు లేకుండా ఒకే ఉపరితల మట్టం ఉండేది నీటికే గదా. అందుకే నీటి మట్టం కొలతగా తీసుకుంటారు. అయితే ఇక్కడే చిక్కు ఉంది. సముద్రం మన ఆలోచనల్లా కుదురుగా ఉండదు కదా! యమ వేగంగా కదులుతూ ఉంటుంది. అంతకంటే ముఖ్యమైనది ఆటుపోట్లు - భూమిపై చంద్రుని మరియు సూర్యుని ప్రభావం వల్ల వస్తాయి.

ఇలా నీరు తీరాన్ని దాటి ముందుకు రావడం, మళ్ళీ వెనక్కు పోవడం రోజులో రెండు సార్లు ఆటు, రెండు సార్లు పోటు ఉంటుంది. ఇలా స్థిరమైన మట్టం లేకపోవడం వల్ల ఆటు మరియు పోటుల సరాసరిని సగటు సముద్ర మట్టంగా కొలుస్తారు. ఇది పాత పద్ధతి.

ఇప్పుడు నవీనంగా ఉపగ్రహాలని ఉపయోగించి GPS ద్వారా, ఇంకా ఇతర పద్ధతుల ద్వారా కొలుస్తూ ఉన్నారు. భారత దేశం లో ఇలా కొలిచి స్థిరపరిచే వ్యవస్థ భారతీయ సర్వే సంస్థ చేస్తుంది. ఇది ముంబై లో బ్రిటీషు వారు ఏర్పరచింది.

మన దేశానికి సముద్రమట్టం నుండి సగటు ఎత్తు 160 మీటర్లుగా వారు నిర్ధారించారు. ఇలా చేసాక ప్రతి ప్రదేశంలో సగటు సముద్ర మట్టాన్ని స్థిరపరచి కేంద్ర ప్రభుత్వ అజమాయిషీలో ఉండే రైల్వే స్టేషన్, ప్రఖ్యాత కట్టడాలు, పెద్ద పోస్ట్ ఆఫీసు, మిలిటరీ బేస్‌లు వంటి వాటి చోట్ల వ్రాయమని ఆదేశించారు.

ఇందు వల్ల సాధారణ ప్రజానీకానికి, ఇతరత్రా వీటి కొలతలతో నిర్మాణాలు చేపట్టే సందర్భం ఉన్న వ్యక్తులు, సంస్థలకు ఉపయోగకరం అని భావించారు. పెద్ద పెద్ద నిర్మాణాలకు, విమాన, హెలికాప్టర్ సర్వీసులకు, పొడుగైన టవర్లు కట్టేటప్పుడు ఇంజనీర్లకు ఇది మార్గదర్శకంగా ఉంటుంది అని భావించారు. భూమి సర్వే చేసే సివిల్ ఇంజనీర్లు డేటం(Datum) ని రెఫరెన్సు కింద వాడతారు. దీనికి ప్రపంచ వ్యాప్తంగా MSL సగటు సముద్ర మట్టాన్ని ఉపయోగిస్తారు.

ప్రతి రైల్వే స్టేషనులో ఇది తప్పనిసరిగా వ్రాస్తారు.ఎందుకంటే ఇన్ని సాంకేతిక నైపుణ్యాలు లేని కాలంలో రైలు నడిపే వారికి, అలాగే రైలు మార్గంలో నిర్మాణాలు చేసే వారికి సులభంగా సమాచారం దొరికి ఉపయుక్తంగా ఉండేది. ఇప్పుడున్న పరికరాల వల్ల ఇలాంటి సూచనలు కేవలం అలంకారప్రాయం అయ్యాయి. కిటికీ పక్కన కూర్చుని ఆ ప్రాంతం కొండ ప్రాంతమా, సముద్రం దగ్గరా అనేది మీరు ఉహించుకోవడానికి బాగుంటుంది మరి.

ప్రతి సంవత్సరం సగటు సముద్ర మట్టం మారుతూనే ఉంటుంది. భూతాపం వల్ల భారత దేశపు ఓడ రేవుల్లో మట్టం పెరుగుతున్నదట.

అప్పారావు ముప్పాళ్ల
https://qr.ae/pydKfg

## త్రీ పిన్ ప్లగ్‌లోని ఎర్త్ పిన్ మిగతా వాటికన్నా పెద్దదిగా ఎందుకు తయారు చేస్తారు?

దాదాపు అన్ని విద్యుత్ ఉపకరణాలు, ముఖ్యంగా బయట లోహపు భాగాలను కలిగి ఉండే ఉపకరణాల లోపల ఎర్త్ పిన్ ఈ పటంలో చూపిన విధంగా బిగించబడి ఉంటుంది.




ఎర్త్ పిన్ నేరుగా ఉపకరణం బయటి భాగం, అంటే వినియోగదారుడు తాకే అవకాశం ఉన్న భాగానికి కలుపబడి ఉంటుంది. అలాగే సాకెట్ లోని ఎర్త్ పిన్ కనెక్టర్ ఎర్త్ పిట్‌కి కలపబడి ఉంటుంది.

ఉపకరణంలో పొరపాటున లైవ్ వైర్ వదులు అవ్వడం వల్ల కానీ లేదా మరో కారణంగా కానీ, ఉపకరణం యొక్క లోహపు భాగానికి తగిలితే, ఆ లోహపు భాగాన్ని వినియోగదారుడు తాకినప్పుడు షాక్ తగిలే అవకాశం ఉంటుంది. అందుకే ఈ లోహపు భాగాలను ఎర్త్ వైర్ ద్వారా ఎర్త్ పిట్ కి కలిపినట్లైతే లోహపు భాగంలో పొరపాటున కరెంట్ ప్రవహిస్తే, అది ఎర్త్ వైర్ ద్వారా ఎర్త్ పిట్ కి చేరుకుంటుంది.

ఎర్త్ పిన్ పెద్దగా ఎందుకు ఉంటుంది?

గమనిస్తే ఎర్త్ పిన్ పెద్దగా ఉండడమే కాదు, మిగిలిన రెండు పిన్‌ల కన్నా కొంచం పొడుగుగా కూడా ఉంటుంది. ఉపకరణానికి విద్యుత్ సరఫరాని ఇచ్చే ముందే, ఎర్త్ పిన్‌ని సాకెట్లోకి పంపించడం ద్వారా ఒకవేళ ఉపకరణపు బయట భాగంలో కరెంట్ ప్రవహిస్తూ ఉంటే, వినియోగదారుడు తాకడానికి ఆస్కారం ఉన్న లోహభాగాన్ని ఎర్త్‌కి కలపబడుతుంది. అలాగే ప్లగ్ సాకెట్‌లో నుండి పీకేటప్పుడు మిగిలిన రెండు పిన్‌లు బయటకి వచ్చాక మాత్రమే ఎర్త్ పిన్ బయటకి వస్తుంది. ఈ రకమైన ఏర్పాటు

కారణంగా ఉపకరణం బయట భాగంలో పొరపాటున విద్యుత్ ప్రవహిస్తున్నప్పటికీ, వినియోగదారుడికి షాక్ నుండి రక్షణ ఉంటుంది.

ఇక ఎర్త్ పిన్ పెద్దగా ఉండడానికి రెండు కారణాలు ఉన్నాయి.

1. పొరపాటున ఎర్త్ పిన్‌ని సాకెట్‌లోని లైవ్ రంధ్రంలో పెడితే, ఎర్త్ పిన్ ఉపకరణం యొక్క లోహపు భాగానికి కలిపి ఉంటుంది కనుక అది వినియోగదారున్ని షాక్ కి గురి చేసే ప్రమాదం ఉంది. కాబట్టి సాకెట్లో ఒకటే పెద్ద రంధ్రం, ప్లగ్ లో ఒకటే పెద్ద పిన్ ఉండేలా డిజైన్ చేయబడింది.
2. ఎర్తింగ్ కోసం వాడే వాహకం, సాధారణంగా లీకేజీ కరెంట్‌ని సమర్థవంతంగా ఎర్త్ చేయాలి కనుక మంచి వాహకతను కలిగి ఉండాలి. అంటే నిరోధకత సాధ్యమైనంత తక్కువగా ఉండాలి.

$R=\rho L/A$

నిరోధకత(R), వాహకం యొక్క వైశాల్యానికి(A) విలోమానుపాతంలో ఉంటుంది. వాహకానికి ఎక్కువ వైశాల్యం ఉంటే తక్కువ నిరోధకత ఉండటం వల్ల లీకేజీ కరెంట్‌ని సమర్థవంతంగా ఎర్త్ చేయగలుగుతుంది.

ప్రత్యూష్ పరుచూరి
https://qr.ae/pydskH

## నార్వేలో కొన్ని నెలలపాటు సూర్యుడు అస్తమించకపోవడానికి కారణమేమిటి?

ఎప్పుడైనా జాబిలిలో ప్రశాంతంగా కూర్చుని ఈ రాత్రి తెల్లారకపోతే ఎంత బాగుండు అనుకున్నారా? లేదా ఏదైనా ఇష్టమైన పని చేస్తూ, ఈ రోజుకి చీకటి పడకపోతే బాగుండు అని అనుకున్నారా? అయితే మీరు ఏదో ఒక ధృవపు ప్రాంతానికి వెళ్తే ఇలాంటి కలలు నిజమవుతాయి. ఎందుకంటే అక్కడ దాదాపు ఆరు నెలలు పాటు సూర్యుడు ఉదయించడు (ఉదయించినా అతి స్వల్పంగా ప్రకాశిస్తాడు), మరో ఆరు నెలలు పాటు సూర్యుడు అస్తమించడు.

ఎందుకు ఇలా జరుగుతుందని తెలుసుకునే ముందు కొన్ని ఖగోళ విషయాలు:

1. 66.5 డిగ్రీల ఉత్తర అక్షాంశానికి పై వైపు ప్రాంతాన్ని, అలాగే దక్షిణ అక్షాంశానికి క్రింది వైపు ప్రాంతాన్నిధృవపు ప్రాంతాలు అంటారు. ఉత్తర ధ్రువ పరిధిలో ఉండే కొన్ని ప్రాంతాలను కలిగి ఉన్న దేశాలు- నార్వే, స్వీడన్, ఫిన్లాండ్, రష్యా, అలాస్కా, కెనడా, ఉత్తర సైబీరియా, గ్రీన్లాండ్. దక్షిణ ధ్రువ పరిధిలో ఏ దేశానికీ చెందని అంటార్కిటికా ఖండపు భూభాగం ఉంది.




60th parallel north




60th parallel south

2. భూమి తన చుట్టూ తాను తిరగడాన్ని భూభ్రమణం అంటారు. భూభ్రమణం వల్లే భూమిపై ఉన్న వివిధ ప్రాంతాలు, సూర్యుడికి అభిముఖంగా వచ్చినప్పుడు పగలుకు, సూర్యుడికి వ్యతిరేకముఖంగా వెళ్ళినపుడు రాత్రికి మారతాయి. భూభ్రమణ అక్షం నిటారుగా కాక కింది చిత్రంలో చూపిన విధంగా 23.5 డిగ్రీలు వాలుగా ఉంటుంది. సూర్యుని చుట్టూ భూమి తిరిగేప్పుడు కూడా ఈ వాలు మారదు.




3. ధ్రువ ప్రాంతాల్లో అర్థరాత్రి కూడా సూర్యుడు అస్తమించని స్థితిని 'ధృవపు దినం' అంటారు. అలాగే పగటిపూట కూడా సూర్యుడు ఉదయించని స్థితిని 'ధృవపు రేయి' అంటారు.

4. విషువత్తు(equinox) అనగా రాత్రి, పగలు సమాన సమయాలు కలిగి ఉండు రోజు. ఈ రోజున సూర్యకిరణాలు భూమధ్యరేఖకు లంబంగా పడటంతో రాత్రింబవళ్ళు సమానంగా ఉంటాయి. మార్చ్ 21న వసంత విషువత్తు, సెప్టెంబర్ 23న శరద్ విషువత్తు సంభవిస్తాయి.

ఇంతకూ నార్వేలో కొన్ని నెలలపాటు సూర్యుడు ఎందుకు అస్తమించడు?




పై చిత్రంలో ఎడమవైపున ఉన్న గోళ దశ, డిసెంబర్ నెలలో భూగోళం ఉండే స్థితి. భూగోళ అక్షం 23.5 డిగ్రీలు వాలి ఉండడం వల్ల, ఆ సమయానికి ఉత్తర ధృవం పై చిత్రంలో చూపిన విధంగా చాలా వరకు సూర్యుడికి దూరంగా చీకట్లో ఉంటుంది. అయితే దక్షిణ ధృవం మాత్రం సూర్యుడికి దగ్గరగా ఉండటంతో పాటు సూర్యునికి అభిముఖంగా ఉండటం గమనించవచ్చు. కాబట్టి భూభ్రమణం జరుగుతున్నప్పటికీ భూగోళ అక్షపు వాలు వల్ల దక్షిణ ధృవంలో సూర్యుడు అస్తమించడు, ఉత్తర

ధృవంలో సూర్యుడు ఉదయించడు. ఆ విధంగా ఒక ధృవంలో 'ధృవపు దినం' నడుస్తుంటే మరో ధృవంలో 'ధృవపు రేయి' నడుస్తూ ఉంటుంది.

అయితే కుడివైపున ఉన్న భూగోళ దశను గమనిస్తే జూన్ మాసంలో భూగోళం ఉండే స్థితి పైన చెప్పిన విధంగానే ధృవపు దినమూ, రేయీ నడుస్తూనే ఉంటాయి. కాకపోతే ఈసారి ఉత్తరధృవం సూర్యుడికి అభిముఖంగా రావడంతో అక్కడ ధృవపు పగలు, అలాగే దక్షిణ ధృవంలో ధృవపు రేయి నడుస్తూ ఉంటాయి.

ధృవపు పగలూ, రాత్రి అనేవి ఆయా ప్రాంతాల్లో పూర్తి స్థాయిలో ఎంత కాలం నడుస్తాయి? విషువత్తుల దగ్గర, ధృవ ప్రాంతాల మీద సూర్యకిరణాల ప్రసరణ మారుతుంది. వసంత విషువత్తు దగ్గర నుండి, ఉత్తర ధృవం కొద్ది కొద్దిగా సూర్యుడికి అభిముఖంగా మారుతూ, ఉత్తరాయణ సమయానికి పూర్తిగా ధృవపు పగలును సంతరించుకుంటుంది. అలాగే దక్షిణ ధృవం శరద్ విషువత్తు దగ్గర నుండి , కొద్ది కొద్దిగా సూర్యుడికి దూరంగా జరుగుతూ దక్షిణాయన సమయానికి ధృవపు పగలును సంతరించుకుంటుంది.

ఈ కారణాల వల్లనే నార్వేలోని కొన్ని ప్రాంతాల్లో కొన్ని నెలలపాటు సూర్యుడు అస్తమించడు, మరి కొన్ని నెలలపాటు ఉదయించడు.

ప్రత్యూష్ పరుచూరి

https://qr.ae/pydskH

## ఈ మధ్యలో గ్లైసెమిక్ ఇండెక్స్(Low GI)ఫుడ్స్ అని ఊదరగొడుతున్నారు. గ్లైసెమిక్ ఇండెక్స్(GI), గ్లైసెమిక్ లోడ్(GL) మధ్య గల తేడా ఏమిటి?

గ్లైసెమిక్ ఇండెక్స్(GI) ఒక కొలత. రకరకాల పిండి పదార్థాలు( కార్బోహైడ్రేట్లు) రక్తంలో కలిసిపోవడానికి, ప్రభావం చూపడానికి తీసుకునే సమయం వేరుగా ఉంటుంది. కాబట్టి ఇవి ఎంత త్వరగా రక్తంలో కరిగి అక్కడ చక్కర శాతాన్ని పెంచుతాయి అని తెలుసుకోవడం ఈ కొలమానం లక్ష్యం. ఇది 0 నుంచి 100 వరకు ఉన్న ఒక కొలబద్ద. అంటే త్వరగా కరిగి చక్కెర స్థాయి పెంచేవి ఎక్కువ GI గాను, తక్కువగా కరుగుతూ చక్కెర స్థాయిని నెమ్మదిగా పెంచేవి తక్కువ GIతోనూ సూచిస్తారు.

GIను మూడు రకాలుగా విభజిస్తారు:
అత్యధిక GI (ఉన్న పిండిపదార్థాలు): 70 నుండి 100
మధ్యమ GI (ఉన్న పిండిపదార్థాలు): 56 నుండి 69
అల్ప GI (ఉన్న పిండిపదార్థాలు): 0 నుండి 55

తక్కువ GI ఉన్నవే తినడం అస్సలు మంచిది కాదు. కొన్ని సార్లు ఎక్కువ GI ఉన్నా అవి చెడ్డవి కాదు. ఉదా: ఒక్క ఆకుకూరనే ఉడికించుకు తినడం సంపూర్ణ ఆహారమూ, పోషకవిలువలు ఉన్న ఆహారం అవుతుందా? దాన్ని దేనితో కలిపి వండామన్న దాన్నిబట్టి ఆకుకూర పప్పు GI విలువ మారుతుంది. కేబేజీ మంచిదే కానీ నూనెలో వేయించి తీసిన కేబేజీ మంచిదా, చెడ్డదా? కాబట్టి, GI అనేది ఒక సూచిక మాత్రమే. దాన్ని స్థూలదృష్టితో గమనిస్తూ ఉండాలి కాని, కేలిక్యులేటర్‌తో కూడికలు వేసుకుని తినమని కాదు.ఉదాహరణకి 50 గ్రాముల సుక్రోజ్ ద్రావణం ఖాళీ కడుపుతో తీసుకుంటే, రెండు గంటల్లో అది ఎంత శాతం రక్తపు గ్లూకోజ్‌ని పెంచుతుంది, ఎంత సేపటిలో మామూలు స్థాయికి వస్తుంది సరి చూసుకుని ఒక నిర్ధారిత సంఖ్య ఇస్తారు. ఇలా అన్ని పిండి పదార్థాలకు నిర్ణీత సంఖ్యలను సమకూర్చటం జరిగింది. అయితే ఇవన్నీ పరిశోధనాశాలలో నియమిత అంశాలకు లోబడి చేస్తారు.

పండని అరటికి GI 30 ఉంటే, మగ్గిన అరటి పండుకి 62 ఉంటుంది. ఉడికిన బంగాళా దుంపకి, వేయించిన దుంపకి GI లో బోలెడు వ్యత్యాసం. కాబట్టి GI అనేది మొద్దు లెక్క.

Annexure - 10

Glycemic Index (GI) of Common Foods

| Sl. No. | Name of the foods | Glycemic Index | Sl. No. | Name of the foods | Glycemic Index |
|---|---|---|---|---|---|
| 1 | White wheat bread | 75 ± 2 | 17 | Mango (raw) | 51 ± 5 |
| 2 | Whole wheat bread | 74 ± 2 | 18 | Watermelon (raw) | 76 ± 4 |
| 3 | Wheat roti | 62 ± 3 | 19 | Potato (boiled) | 78 ± 4 |
| 4 | Chappathi | 52 ±4 | 20 | French fries (potato) | 63 ± 5 |
| 5 | White boiled rice | 73 ± 4 | 21 | Carrots (boiled) | 39 ± 4 |
| 6 | Brown boiled rice | 68 ± 4 | 22 | Milk (full fat) | 39 ± 3 |
| 7 | Barley | 28 ± 2 | 23 | Milk (skim) | 37 ± 4 |
| 8 | Instant oat porridge | 79 ± 3 | 24 | Ice cream | 51 ± 3 |
| 9 | Rice porridge /congee | 78 ± 9 | 25 | Chick peas | 28 ± 9 |
| 10 | Millet porridge | 67 ± 5 | 26 | Soya beans | 16 ± 1 |
| 11 | Sweet corn | 52 ± 5 | 27 | Lentils | 32 ± 5 |
| 12 | Cornflakes | 81 ± 6 | 28 | Chocolate | 40 ± 3 |
| 13 | Apple (raw) | 36 ± 2 | 29 | Popcorn | 65 ± 5 |
| 14 | Orange | 43 ± 3 | 30 | Soft drinks/soda | 59 ± 3 |
| 15 | Banana | 51 ± 3 | 31 | Honey | 61 ± 3 |
| 16 | Pineapple | 59 ± 8 | 32 | Glucose | 103 ± 3 |

Source: Diabetes care, Vol: 31, Number 12, December 2008

*మూలం: NIN, హైదరాబాద్ వారి పుస్తకం*

ఈ కొరత తీర్చడానికి గ్లైసెమిక్ లోడ్(GL) వచ్చింది. GI ఒక పదార్థం ఎంత సేపటిలో రక్తపు చక్కెర స్థాయిని పెంచగలదో చెప్తే , GL ఆ పదార్థంలో ఎంత కార్బోహైడ్రేట్ ఉందో చెప్తుంది.

GL= (GI X వడ్డించిన దానిలో ఉన్న పిండిపదార్థం ) /100 = గ్రాముల్లో
ఉదా : మీ దగ్గర నాలుగు స్ట్రా బెర్రీలు ఉన్నాయి. ఒక్కో దానిలో 0.5 గ్రాముల పిండి పదార్థం ఉంది. నాలుగింటికి కలిపి 2 గ్రాములు అయ్యింది. స్ట్రాబెర్రీ GI : 40.

GL=40 X2/100 =0.8 అంటే అది చాలా తక్కువ GL కాబట్టి గుటుక్కుమని మింగేయవచ్చు. వీటిని కూడా మూడు రకాలుగా చెప్తారు: అల్ప GL: 0-10 , మధ్య GL: 11-19, అధిక GL: 20 పైన. ఉడికిన తెల్లన్నం = 50GL, ఉడికిన బంగాళదుంప = 25GL, ఆపిల్ = 25GL ఇలా ఉంటాయి.

చివరిగా GI అనేది ఉజ్జాయింపుగా వేసిన లెక్క. మనకు బండ్లు అమ్మేటప్పుడు షాపు వాడు చెప్పే మైలేజి లాంటి లెక్క. GL అనేది మరింత పద్ధతిగా, లోపాలను పరిగణన లోకి తీసుకుని GI మీద ఆధారపడి వేసిన కొత్త లెక్క. అంటే బండి నిజంగా ఇచ్చే మైలేజి, మన పక్కింటి వాహనదారు చెప్పే లెక్క. అదీ సంగతి.

అప్పారావు ముప్పాళ్ల
https://qr.ae/pyMk0H

## హెలీకాప్టర్ ప్రమాదాలు ఎందుకు, ఎలా జరుగుతాయి?

పౌర విమానయాన రంగంలోని ప్రమాదాలతో పోల్చుకుంటే హెలికాప్టర్ ప్రమాదాల సంఖ్య ఎక్కువగానే ఉంటుంది అని ఉత్తర అమెరికాకు చెందిన సంస్థ, నేషనల్ ట్రాన్స్పోర్టేషన్ సేఫ్టీ బోర్డు (NTSB) [1] అంచనా వేసింది.

నేషనల్ ట్రాన్స్పోర్టేషన్ సేఫ్టీ బోర్డు (NTSB) రవాణా రంగంలో నెలకొన్న ప్రమాదాలను సమగ్రంగా విచారణ జరిపి ప్రభుత్వానికి నివేదికలను అందచేస్తుంది. అలాగే భవిష్యత్తులో ప్రమాద నివారణకు తగు సూచనలను ప్రతిపాదిస్తుంది. అయితే NTSB సంస్థ కేవలం ఉత్తర అమెరికాలో సంభవించిన ప్రమాదాలనే విచారిస్తుంది.

మన దేశంలో ప్రముఖ సంస్థ, డైరెక్టరేట్ జనరల్ అఫ్ సివిల్ ఏవియేషన్ (DGCA) విమాన ప్రయాణాలకు సంబంధించిన ప్రమాదాలను దర్యాప్తు చేసి భవిష్యత్తులో ప్రమాద నివారణకు సూచనలు జారీ చేస్తుంది. అయితే DGCA సంస్థ మన భారత రక్షణ శాఖకు సంబంధించిన విమాన/హెలికాప్టర్ ప్రమాదాలను దర్యాప్తు చేయలేదు. మన భారత రక్షణ శాఖకు సంబంధించిన వాయుశాఖ నిపుణుల బృందం విమాన/హెలికాప్టర్ ప్రమాదాలపై అంతర్గత విచారణ జరుపుతుంది.

**పౌర విమానయాన రంగం కంటే హెలికాప్టర్ ప్రమాదాల సంఖ్య ఎక్కువగా ఎందుకు ఉంటుంది?**
సాధారణ విమానాలతో పోలిస్తే హెలికాప్టర్ రూపకల్పన చాలా క్లిష్టమైనది (complex mechanical design). ముఖ్యంగా మెయిన్ రోటార్, టైల్ రోటార్ వేగంగా తిరుగుతుండడం (టార్క్ స్పీడ్) వలన హెలికాప్టర్ తీవ్రమైన ఒత్తిడికి గురి అవుతుంటుంది.




*మూలం:* *https://wiki.ivao.aero/*

క్లిష్టమైన మెకానికల్ ఒత్తిడుల కారణంగా హెలికాప్టరును ఎప్పటికప్పుడు మెయింటెనెన్స్ ఇంజనీర్స్ పరీక్షించడం చాలా ముఖ్యం. ఎక్కువ సంఖ్యలో ప్రమాదాలు ఈ మెయింటెనెన్స్ సరిగా లేనందున జరుగుతూ ఉంటాయి.

విమానాలతో పోల్చుకుంటే హెలికాప్టర్లని క్లిష్టమైన ప్రాంతాలకు చేరుకోవడానికి వాడుతుంటారు. పైగా హెలికాప్టర్లు భూమికి తక్కువ ఎత్తులో ప్రయాణించడం వలన ఎక్కువ ప్రమాదాలు జరిగే ఆస్కారం ఉంది.

ప్రతికూల వాతావరణ పరిస్థితులు అనేక హెలికాప్టర్ ప్రమాదాలకు దారితీసాయి. హెలికాప్టర్ భూమికి తక్కువ ఎత్తున ప్రయాణించడం వలన సాధారణ విమానంతో పోల్చుకుంటే అధికమైన ప్రతికూల వాతారణం ఎదుర్కోవలసి ఉంటుంది. ముఖ్యంగా కొండలలో ప్రయాణిస్తున్నప్పుడు గాలి తీవ్రతను, గతిని, మేఘాలను, మంచును తట్టుకుంటూ ప్రయాణించవలసి వస్తుంది.

తక్కువ ఎత్తులో ప్రయాణించడం వలన కరెంటు తీగలు, టెలిఫోన్ తీగలు, ఎత్తైన భవనాలు, కొండలను తప్పిస్తూ పైలెట్ హెలికాప్టరును నడపవలసి వస్తుంది. ఇందుకు పైలట్ అనుభవం, నైపుణ్యం, చాకచక్యం చాలా అవసరం. అధిక ప్రమాదాలు ఇలాంటి సందర్భాలలో జరుగుతుంటాయి. పైలట్ నైపుణ్య లోపం కూడా హెలికాప్టర్ ప్రమాదాల కారణాలలో ముఖ్యమైనది.

**మనదేశంలో హెలికాప్టర్ ప్రమాదాలు ఎలా జరిగాయి?**

నేను స్వయంగా ఏరోనాటికల్ ఇంజనీరింగ్ చదివాను కాబట్టి నాకు ప్రమాదాల కారణాలను అన్వేషించడం అంటే కుతూహలం. హెలికాప్టర్ మెకానిక్స్ నాకు ఇష్టమైన సబ్జెక్టులలో ఒకటి. ఈ ప్రశ్న చూడగానే నేను DGCA సంస్థ వారు విడుదల చేసిన అనేక రిపోర్టులను చదవడం మొదలుపెట్టాను. దురదృష్టవశాత్తూ DGCA వారు డేటాను సులువైన మార్గంలో ఇవ్వకపోవడం వలన నా పని ఎక్కువయ్యింది. ఉదాహరణకు NTSB వారు ఒక Excel షీటులో డేటాను ప్రజలకు అందచేస్తారు. ఇలాంటి సౌకర్యం DGCA లో లేనందున, నేను రిపోర్టులు అన్ని చదివి స్వయంగా డేటాను తయారు చేసుకోవలసి వచ్చింది. ఈ డేటా తీసుకుని స్వయంగా కొంత పరిశోధన చేసాను. ఇందులో నాకు అర్థమైన ముఖ్యమైన విషయాలు:

- DGCA వారు 1960 నుండి 2011 సంవత్సరం వరకు మన దేశంలో జరిగిన ప్రమాదాలను దర్యాప్తు చేసి నివేదికలు అందజేసారు. దురదృష్టం ఏంటంటే 2012 నుండి వారి నివేదికలను వెబ్సైట్లో ఇంకా పెట్టలేదు (2012 నుండి జరిగిన కొన్ని చెదురుమదురు సంఘటనలు తప్ప). బహుశా ఇంకా ప్రమాదాలను దర్యాప్తు చేస్తున్నారేమో!
- మొత్తం 145 ముఖ్యమైన ప్రమాదాలను DGCA తమ నివేదికలో పొందుపరచడం జరిగింది. ఇందులో చెప్పుకోదగ్గ నివేదికలు అరుణాచల్ ప్రదేశ్ ముఖ్యమంత్రి హెలికాప్టర్ ప్రమాదం, ఆంధ్రప్రదేశ్ ముఖ్యమంత్రి హెలికాప్టర్ ప్రమాదం, లోక్ సభ స్పీకర్ బాలయోగి గారి హెలికాప్టర్ ప్రమాదం, మొదలైనవి. వాటి గురించి తర్వాత చూద్దాం.

- హెలికాప్టర్ ప్రమాదాలకు కారణాలు ముఖ్యంగా క్రింది విధంగా విభజించాను:
    1. మెకానికల్/మెయింటెనెన్స్
    2. పైలట్ తప్పిదం
    3. ప్రతికూల వాతావరణ పరిస్థితులు
    4. నిర్మాణం ఉన్న ప్రదేశాలలో ప్రమాదాలు (తీగలు మొదలైనవి)
    5. తెలియని కారణాలు
- మొత్తం 145 హెలికాప్టర్ ప్రమాదాలలో 77 ప్రమాదాలు పైలట్ తప్పిదాలుగా, 43 మెకానికల్/మెయింటెనెన్స్ లోపాలుగా, 24 ప్రతికూల వాతావరణ పరిస్థితుల కారణంగా, 22 నిర్మాణం ఉన్న ప్రదేశాలలో ప్రమాదాలుగా నిర్ధారించబడినవి. ఇందులో పాఠకులు గమనించవలసినది ప్రమాదాల కారణాల సంఖ్య కూడితే మొత్తం 145 హెలికాప్టర్ ప్రమాదాల కంటే ఎక్కువ వుంటుంది. దీనికి కారణం కొన్ని సందర్భాలలో పైలట్ తప్పిదం, ప్రతికూల వాతావరణ పరిస్థితి రెండూ కారణం కావచ్చు, లేదా మెకానికల్/మెయింటెనెన్స్ లోపాలు, పైలట్ తప్పిదాలు అవ్వవచ్చు. ఈ విషయాలను సులువుగా అర్థం చేసుకోవడానికి నేను Excel లో ఈ చిత్రపటం తయారు చేసాను. ఈ చిత్రం ప్రమాదాలకు కారణాల శాతాన్ని సూచిస్తుంది.




*Data Source:* ***DGCA***

- ఇందులో ముఖ్యంగా చెప్పుకోవలసిన విషయం ఏంటంటే 1990 కంటే ముందు ఎక్కువగా హెలికాప్టర్లు వ్యవసాయ పొలాల్లో మందులు చల్లడానికి ఉపయోగించేవారు. ఇందు కారణంగా అనేక ప్రమాదాలు హై టెన్షన్ తీగలకు హెలికాప్టర్ తగిలి, పైలట్ తప్పిదాల వలన జరిగినవి. ఎక్కువ శాతం విజువల్ ఫ్లైట్ రూల్స్ (VFR ) అమలులో ఉన్నపుడు సంభవించినవి.

పైలట్ క్యాబిన్లో ఉన్న సాంకేతిక పరికరాలను ఉపయోగించకుండా బయటకు చూసి నడిపే విధానాన్ని VFR అంటారు. ఒకవేళ పైలట్ విజిబిలిటీ తక్కువ ఉన్న పరిస్థితుల్లో IFR , అంటే ఇన్స్ట్రుమెంట్ ఫ్లైట్ రూల్స్ అనుగుణంగా సాంకేతిక పరికరాల సాయంతో హెలీకాప్టర్ నడపవలసి ఉంటుంది.

- ఎప్పుడైతే హెలికాప్టర్ ప్రయాణాలు అందరికీ అందుబాటులోకి వచ్చాయో అప్పటినుండి ఎక్కువగా పైలట్ లేదా వాతావరణ ప్రతికూల పరిస్థితుల్లో ప్రమాదాలు సంభవించాయి (సుమారు 1995వ సంవత్సరం తరువాత).
    1. 2001 వ సంవత్సరంలో Dauphin helicopter VT-ELA - అరుణాచల్ ప్రదేశ్ కొండలలో ప్రతికూల వాతావరణం, విజిబిలిటీ తక్కువగా ఉన్న కారణంగా కొండను ఢీకొంది. ప్రయాణికులకు, పైలట్లకు తీవ్రగాయాలు అయ్యాయి.
    2. 2002వ సంవత్సరంలో Bell 206 Helicopter VT–DAP - గౌరవ లోక్ సభ స్పీకర్ బాలయోగి గారిని భీమవరం నుండి హైదరాబాద్ తీసుకువచ్చే క్రమంలో ప్రతికూల వాతావరణం, తక్కువ విజిబిలిటీ కారణంగా కొవ్వాడలంక దగ్గర ఒక చెరువులో ముందస్తు ప్రణాళిక లేని లాండింగ్‌కి పైలట్ విఫల ప్రయత్నం చేసి తిరిగి గాలిలోకి ఎగిరే ప్రక్రియలో చెరువు నీళ్లు తగిలి ప్రమాదం సంభవించిందని DGCA నివేదికలో తెలిపింది.
    3. 2009వ సంవత్సరంలో Bell 430 Helicopter VT-APG - గౌరవ ముఖ్యమంత్రి రాజశేఖర్ రెడ్డి ప్రయాణిస్తుండగా బేగంపేట విమానాశ్రయం నుంచి 08:38 IST బయలుదేరి ప్రతికూల వాతావరణంలోకి ప్రవేశించింది. ఇంజిన్ ఆయిల్ ప్రెషర్ హెచ్చరిక సంకేతాలతో పైలెట్లు సతమతమవుతున్న క్షణంలో తీవ్రమైన గాలి వత్తిడికి హెలికాప్టర్ నల్లమల అడవులలో కుప్పకూలింది.
    4. 2011వ సంవత్సరంలో Ecureuil AS 350 B3 హెలికాప్టర్ - గౌరవ అరుణాచల్ ప్రదేశ్ ముఖ్యమంత్రి తరంగ్ నుండి ఇటానగర్ ప్రయాణిస్తుండగా, ప్రతికూల వాతావరణం కారణంగా కొండలలో ఘోర ప్రమాదానికి గురి అయ్యింది. దీనికి పైలెట్ల తప్పిదం కూడా కొంత వరకు కారణం కావొచ్చు

దీని ద్వారా పైలట్లు కొండ ప్రాంతాల్లో నెలకొన్న ప్రతికూల పరిస్థితులను సరిగా అంచనా వేయడంలో విఫలం చెంది, IFR ఫ్లైట్ రూల్స్ పరిస్థితుల్లో ప్రమాదానికి గురి అవుతున్నారని అర్థం అవుతుంది. బహుశా 2021 ఊటీలో జనరల్ బిపిన్ రావత్ ప్రయాణిస్తున్న హెలికాప్టర్ ప్రమాదానికి ఇలాంటి పరిస్థితులే కారణం కావొచ్చు.

చివరిగా ఒక్కసారి మనం 1995 నుండి 2011 వ సంవత్సరం వరకు సంవత్సరానికి ఎన్ని హెలికాప్టర్ ప్రమాదాలు సంభవించాయో ఈ చిత్రం ద్వారా చూద్దాం. ఈ చిత్రం R language ఉపయోగించి నేను తయారు చేసినది. డేటా DGCA నుండి తీసుకున్నది.




***PC credits: Praveen Kumar, plotted in R-language*** *Data Source: DGCA*

- ఈ చిత్రం ద్వారా 1995 నుండి 2011 వ సంవత్సరం వరకు మన దేశంలో హెలికాప్టర్ ప్రమాదాలు పెరుగుతున్నవి అని అర్థం చేసుకోవచ్చు (ఎరుపు రంగు గీత పెరుగుతున్న ప్రమాదాలకు సంకేతం).
- హెలికాప్టర్ల సంఖ్య పెరుగుతున్నందున ప్రమాదాలు పెరుగుతున్నాయని మనం అనుకోవచ్చు. కానీ NTSB వారి నివేదిక ప్రకారం ఉత్తర అమెరికాలో హెలికాప్టర్ల ప్రమాదాల సంఖ్య ఏటేటా తగ్గుతూ వస్తుందని అంచనా. అయితే మనం దేశంలో ఎందుకు పెరుగుతున్నాయి? ఈ ప్రశ్నకు నేను సమాధానం చెప్పలేను.
- ప్రభుత్వం, ఏవియేషన్ డిపార్ట్మెంట్ వారు ఒక సమగ్ర విచారణ జరిపి భవిష్యత్తులో ప్రమాదాల నివారణకు కఠినమైన నిబంధనలు తీసుకురావాల్సిన అవసరం ఎంతైనా ఉంది.

ఇక మన దేశ రక్షణ శాఖ వారు ప్రమాదాల సంఖ్య, వాటి కారణాలు ప్రజలకు దాదాపు తెలియజేయరు కాబట్టి వారు మరింత పారదర్శకంగా ఉంటూ కఠినమైన విధానాలు ప్రభుత్వ సహాయంతో అమలు పరచకపోతే మనం మరిన్ని ప్రమాదాలకు సాక్షులం అవ్వవలసి వస్తుందేమో.

ప్రవీణ్ కుమార్

https://qr.ae/pyMkzr

## పేడ పురుగు పేడను ఉండలుగా తీసుకెళ్ళి ఏమి చేస్తుంది?

ప్రతి జీవి ఈ ప్రకృతిలో ఒక ప్రత్యేక స్థానంలో ఉంటుంది. సమతుల్యత కోసం జీవులు నియమిత స్థానాల్లో ఉండటం మనుగడ కోసం ఆవశ్యక సహజ నియమం.



*(స్మిత్సోనియన్ వారి చిత్రం)*

ప్రకృతిలో ఇలాంటివి మట్టిలో ఉండి మనిషికి సాయం చేసే జీవులు. ఇవి నశిస్తే మట్టి ఆరోగ్యం నశించినట్టే. ప్రాకృతిక తత్వం లోపించి రసాయనాల వాడకం ఎక్కువైనప్పుడు మొదటగా చనిపోయేవి ఇలాంటి జీవులే. వానపాములు, ఇలాంటి పురుగులు ఆ మట్టిలో లేకపోతే నష్టం మనకే!

పేడ పురుగుల్ని 'స్కారబీయేడి ' కుటుంబంలో చేర్చారు.

పురాతన ఈజిప్ట్ ప్రజలు ఈ పురుగుని గౌరవంతో, భయంతో కొలిచేవారు. అది పేడ ఉండని ముద్దగా చేసి దొర్లించటాన్నిచూసి, ఖేప్రి అనే దేవుడు రోజూ సూర్యుడు అనే గుండ్రని బంతిని తెల్లవారుఝామున ఉదయించడానికి తెస్తాడని ఊహించేవారు. అందుకే 'స్కెరబ్'  తలతో 'ఖేప్రి'ని వీరు పూజించేవారు. అలా జన వ్యవహారంలో ఉన్న పేరుతోనే దాని జంతు శాస్త్ర తరగతికి 'స్కారబీయేడి' అని నామకరణం చేసారు.




*(నెట్ చిత్రం)*

అసలీ పేడతో వాటికి ఏం పని అని కదా ప్రశ్న, అక్కడికే వస్తున్నా. ఈ పురుగులు మూడు రకాలు. ఒకటి దొర్లించే రకం (rollers). ఇవి పేడను సేకరించి అక్కడనుంచి దూరంగా తమకు అనుకూలమైన ప్రదేశానికి తీసుకువెళ్లి, ఆ పేడలో ఉన్న ద్రవరూప వృక్ష సంబంధ పోషకాలను (జంతువు సగం అరిగించుకుని వదిలేసిన) గ్రహిస్తాయి. ఈ ఉండలోనే గుడ్లను పెట్టి, అందులోంచి వచ్చే లార్వాలకి ఘన రూపంలో ఉన్న ఆహారాన్ని అందిస్తాయి. కాబట్టి ఆహారం, సంతాన ఉత్పత్తి ఇలా రెండు విధాలుగా ఈ పేడని అవి వాడుకుంటాయి.

ఇక రెండో రకం బొరియలు తవ్వే రకం (tunnellers). ఇవి పేడ ఉన్న చోట భూమిలోకి రంధ్రాలు తవ్వి, ఈ పేడని అందులోకి లాగి, పైన చెప్పిన రెండు పనులకు వాడుకుంటాయి. ఇలా తవ్వడం వల్ల భూమి గుల్ల బారటం, మొక్కలకు కావలసిన పేడ ఎరువుగా అందటం, పేడలో జీర్ణం కాకుండా మిగిలిన విత్తనాలు మొలకెత్తి విత్తన వ్యాప్తి జరగటం వీటి వల్ల ఒనగూరే అదనపు ప్రయోజనాలు.

ఈ పురుగులలో మూడో రకం పేడలోనే నివాసం ఉండేవి (dwellers). ఇవి పేడ కుప్పలోనే ఉండి అక్కడే పిల్లలను పెంచుతాయి. వీటి వల్ల విసర్జక పదార్థాల సత్వర పునర్వినియోగం (speedy recycling) జరుగుతుంది.

ఈ పురుగులు ఏనుగు, జింక, ఆవులు, బర్రెల వ్యర్థాల మీద ఆధార పడతాయి. ఇవి కొన్నిసార్లు పేడలో గుడ్లు పెట్టే హానికర ఈగలు, (పశువుల్లో వ్యాధులకు కారణం అయ్యే) క్రిములు, కీటకాలను నిర్మూలిస్తాయి కూడా.

కాబట్టి, పేడ పురుగులు ఏమి చేస్తాయంటే

1. పేడని అంటే ఎరువుని పునఃపంపిణీ (redistribute) చేయడము
2. పేడలో పెరిగే హానికర జీవులకు అది అందకుండా తరలించడము
3. నేలలో రంధ్రాలు చేసి గాలి, నీరు మరింత సోకేలా చేయడము
4. విత్తన వ్యాప్తి.

ఇంత ఉపయోగపడే పురుగుని చులకనగా చూడటం తగునా?

అప్పారావు ముప్పాళ్ల
https://qr.ae/pyMMp

# టీవీ సీరియల్ తీయడం ఎలా?

టీవీలో వచ్చే సీరియల్స్ కథలపై ఓ సరదా అల్గోరిథం. అవునా అవునా అవునా అనుకుంటూ విభిన్న కోణాల్లో ఈ ఫ్లోచార్ట్ చూసి నవ్వుకోండి.

(రచన : లలిత నిగేష్)



# ఆగండాగండి!

ముందుమాట ప్రతీ పుస్తకానికీ ఉంటుంది కానీ ఈ పుస్తకానికి చివరిమాట కూడా ఉంది!

కోరాలో సమాధానాలను ఒక పుస్తకంగా వేద్దామనుకున్నప్పుడు వాటి వడపోత ఎలాగో అర్థం కాలేదు. ముందు అంశాలవారీగా వర్గీకరించాము, ఆ తరువాత ఏమి చేసామో చెప్పేస్తామనుకున్నారా? ఆశ, దోశ, అప్పడం, వడ!

ఈ పుస్తకానికి తోడ్పాటు అందించిన నవరత్నాల్లో ఒక రత్నం అనివార్య కారణాలవల్ల మధ్యలో నిష్క్రమించవలసి వచ్చి మేం అష్టదిగ్గజాలమయ్యాము.

మొట్టమొదట మేము ఈ పనికి సై అన్నప్పుడు ఎందుకు, ఏమిటి, ఎలా అని మాటామంతీ ఆడుకోవడానికి ఒక గ్రూప్ ఏర్పాటు చేసుకుని దానికి 'తెకోడిస' అని నామకరణం చేసాము. పకోడీల్లో ఓ రకం కాదండీ ఇది, తెలుగు కోరా డిజిటల్ సంచికకి సంక్షిప్తరూపం. అలా మేము కోళ్ళమయ్యాము.

ఈ గుంపులో గుడ్మార్నింగ్, గుడ్నైట్ సందేశాలు అస్సలొద్దని మొదట్రోజే తీర్మానించుకున్నాము. ఇప్పటివరకూ మా కాళ్ళ మీద మేము నిలబడుతూనే ఆ మాట మీద కూడా నిలబడ్డాము. కానీ కోళ్ళకి అతిముఖ్యమైన తిండి మా అందరికీ ఇష్టమైన అంశం అని ఓ నెల్రోజుల్లోనే తెలిసిపోయాకా ఇంకేముంది? దాని మీదే కొన్ని వేల సందేశాలు! ఏది ఎక్కడ, ఎలా తినాలనే సలహాలు, చేసిన వంటలు, వంటలతంటాలతోపాటు హాస్యపు చురకలు, సాంకేతిక ముచ్చట్లు, పిల్లలు, పెళ్ళిళ్ళు, సినిమాలు...ఎన్నెన్ని కబుర్లో!

సినిమా అంతా పిక్నిక్‌లా గడచిపోయిందని సినిమా యూనిట్ వాళ్ళు రిలీజ్‌కి ముందు చెప్పినట్టు చెప్తున్నామనుకోకపోతే నిర్విఘ్నంగా అలాగే సాగింది మా ప్రయాణం. కాకపోతే నవ్వుల జల్లులకు తోడు అనుమానాలు, శంకలు, చిన్నపాటి వాదనలు, విభేదాలు బోనస్సన్నమాట. పైసా సంపాదన లేని సంపాదకులమయ్యాము. చివరిమాట వ్రాసుకునే స్థాయికి ఎదిగాము!

మా ఈ చిరు ప్రయత్నం మీకు క్రొంగొత్త విషయాలని తెలియజేస్తూనే పెదాలపై అరనవ్వునో, చిరునవ్వునో పూయించిందని ఆశిస్తున్నాము.

చిరు ప్రయత్నం అన్నాము కదా అని మెగాస్టారుకీ దీనికీ ఏ విధమైన బంధమూ, అనుబంధమూ లేదు. ఉంటే గింటే సూపార్‌స్టార్‌తో ఉండాలి. అదేమిటో తెలుసుకోవాలంటే పుస్తకం మళ్ళీ చదివేసేయండి!

మా ఈ ప్రయత్నం గురించి మాకేదైనా చెప్పాలనుకుంటే: anaganagaoprasna@gmail.com